"Vani Nilaya" Series No. 2.

Sri

# DEVANGA PURANAM

of

DEVANGA VAMSODDHARAKA
Samajam, Madras.

Published
By
THE MADRAS PRINTING HOUSE
Post Box No. 195
MADRAS.

FIRST EDITION.

PRINTED AT
THE VANI NILAYAM PRESS
1913



Price Annas 8.] [Postage Extra.

శ్రీరస్తు.
ఓం నమశ్చౌడేశ్వర్యై. 125

# శ్రీదేవాంగపురాణము.

లేక

## దేవాంగచరిత్రము.

ఇది

బ్రహ్మశ్రీ

పండిత పురాణం - సూర్యనారాయణతీర్థులవారిచే

తెలిఁగింపించి



శ్రీవాణీనిలయ ముద్రాక్షరశాలాధికారిచే
ముద్రించి ప్రకటింపఁబడినది.

చెన్నపురి.

క్రయము అ. 8.] 1913 [పోస్టేజి ప్రత్యేకము.


2

# సంగతి.

శ్లో. శ్రీదేవీ జగతాం ధాత్రీ చతుర్వర్గప్రదాయినీ,
దేయా న్మానుష మానస్ధ మథవా యోగిభావితమ్.
యతో జాతాని భూతాని యయా వృద్ధిం ప్రయాన్తి చ,
యత్రైవాన్తే విలీయన్తే సా మే కామేశ్వరీ గతిః.

శా. శ్రీమంతం బగునానుధాబ్ధిని మహశ్రీ వెల్గునాదీవిలోఁ
బ్రాముఖ్యమ్మును గాంచి యెల్లజగముల్ పాలించుచున్ సర్వథా
కామిశ్రేణికిఁ గల్పవృక్ష మగుమాకామేశ్వరీదేవి యీ
నామాకారత నున్నయాత్మను మహానందంబు నొందించుతన్.

చ. తిరుపతికొండను న్నతి ; విధేయవిధేయత నొప్పవేంకటే
శ్వరుని దలంతు, నల్లభగవానుఁడ నాకులదైవ మాటనీ ;
చరితను వెల్లడించినప్రశాంతుఁడు శ్రీతులసింగుసెట్టి దా
సిరి కిరవై పదింబదిగ నేమము నొందుచు నుండుఁ గావుతన్.

ఉ. భూతదయాపరుం డని ప్రభూతయశమ్మును గొన్న వాఁడు సం
పూతచరిత్రుఁ డాపయిని భూసురశిక్షితుఁ డై నవాఁడు స
త్యాతిశయమ్ముకై హృదయ మప్పనసేసినవాఁడు ప్రస్తుతా
జాతరిపుండు నాఁ దగినశాంతుఁడు దాంతుఁడు నీతిమంతుఁడున్.

క. దేవాంగకులధురీణుఁడు,
దేవబ్రాహ్మణులయెడల స్థిరభక్తుండున్
శ్రీ "వాణీనిలయము" ము,
ద్రావేశ్మమునొడయఁడును నుదారుఁడుఁ గృతియున్.

సీ. శ్రీమంత మయి యొప్పచెన్నపట్టణములో
గుణవంతుఁ డని పేరు గొన్నవాఁడు,
బాల్యమ్మునుండి విద్వాంసుల సేవించి
మరియాద సెడకుండ మన్నవాఁడు,
రహి మీఱ నానందరామాయణము తెల్గు
మున్నుగాఁ బ్రకటించియున్నవాఁడు,
అచ్చుకూటము నిల్పి యందుఁ జేరినవారి
నొప్పగాఁ బోషించుచున్నవాఁడు,

గీ. స్వార్థపరు లయి సుజనుల నలంచువారి
లీలగా రెంపునాల్కలు లేనివాఁడు
ఆడి బొంకియెఱుంగని ప్రోఢుఁ డైన
యట్టి తిరుపతి - తులసింగుసెట్టిజెట్టి.

మ. చన వొప్పం బరమేశ్వరీచరణకంజాతద్వయోద్యస్మరం
దనిమజ్జన్మధుపస్మనస్కునిఁ బురాణం-సూర్యనారాయణుం
డనుపేరన్ విదితుండ నైననను దా నర్థిన్ సమీపించి యి
ట్లనియెన్ శాంతము రూప మూనినవిధం బై యట్టె కన్పట్టఁగన్.

"క. స్వాములకుఁ గుశలమే కద, సేమమ్మే కాదె యెల్లశిష్యుల ; కథవా
కామేశ్వరీకటాక్ష, శ్రీమహితుల కెందుఁ గొఱంత సేకూరెడినే ?

మ. తమచేతన్ వెలుఁగొందు లేఖిని సుధాధారాతిరస్కర్తకా
మ మటంచున్ వినుచుందు నెల్లయపుడున్ మాన్యుల్ వచింపంగఁ గా
న మదీయం బగు ప్రార్థనం బొకటి స్వాంతంబందు మన్నించి మో
ఘము గాకుండఁగఁ జేతు రంచును నిరాఘాటంబుగా నమ్మెదన్.

క. మానసశక్త యగు శ్రీ, దేవాంగ మునీంద్రుచరిత దేవర తెనుఁగుం
గావించి యిత్తురేనియు, నే వెల్లడిసేసికొందు నెంతయు భక్తిన్.

క. పండితహృదయాంబుజమా,
ర్తండం బగువ్యాసమౌని వ్రాసినయలబ్ర
హ్మాండపురాణమును త్తర,
ఖండమ్మున నున్న దిదిగొ కనుఁగొనుఁ" డంచున్.

మ. మును పెవ్వారలొ సాంధ్రసంస్కృతముగా మోదమ్ము మైనచ్ఛు గూ
ర్చిన దేవాంగచరిత్రపుస్తకము నర్థిం దెచ్చి యీయంగ నా
తనియాజ్ఞన్ శిరసా వహించి పదిఁ దద్వంశాద్యచారిత్రముం
దెనుఁగుంబాసను వ్రాసినాఁడఁ గనుఁ డెంతే దేట తెల్లంబుగన్.

క. సిరిచే నలరుం గావుతఁ, దిరుపతి-తులసింగుసెట్టి; దీనిని జదువన్
దొరఁకొను సజ్జనమండలి, పరమేశ్వరికరుణ కెపుడుఁ బాత్రమ్మగుతన్.



శ్రీ రస్తు.
శ్రీచౌడాంబాయై నమః

# దే వాం గ పు రా ణ ము.

## మొ ద టి అ ధ్యా య ము.

శ్లో. నమః శ్రీరామలింగాయ చౌడాంబాయై నమోనమః,
దేవలాయ నమో యేన కృతం దేవాంగగౌరవమ్.

పూర్వ మొకప్పుడు నారదుఁడు లోకుల ననుగ్రహించుతలంపు తో సత్యలోకమునకుఁ బోయి బ్రహ్మకు నమస్కరించి యిట్లనియె. నార—ఎవనియాజ్ఞచే బ్రహ్మవిష్ణు మహేశ్వరులు లోకములను సృజింపను, పాలింపను, సంహరింపను గర్తలగుచున్నారో అట్టి పురాణపురుషునకు నమస్కరించుచున్నాను. పితామహా ! ఏది సమస్త పాపములను బోఁగొట్టి పుణ్యమును శుభములను గలిగించి లోకులను గృతార్థులను జేయునో అట్టికథ చెప్పుమనఁగా బ్రహ్మ యిట్లనియె.

బ్రహ్మ—నారదా ! రహస్యమును, సంతోషమును గలిగించు నదియు, పాపములను బోఁగొట్టి పుణ్యమును గలిగించునదియు, ప్రాచీన మైనదియు, శివునిమాహాత్మ్యమును దెలుపునదియు, విన్నవారిని కృతార్థులను జేయునదియు నగు దేవాంగచరిత్రమును జెప్పెదను విను ము. సచ్చిదానందస్వరూపుఁడును శాశ్వతుఁడును సర్వలోకములకుఁ బ్రభువును, సర్వవ్యాపియు, పరాత్పరుఁడును, అప్రమేయుఁడును, నిర్గుణుఁడును నగు పరమశివుఁ డొకప్పుడు సృష్టి చేయవలయు నని తలంచెను. ఆతనియిచ్ఛవలన త్రిగుణాత్మికయగు శక్తి పుట్టినది. ఆమె దివ్యజ్యోతి యై వెలుఁగుచుండఁగా శివుఁడు చూచెను. ఆదిశక్తియు లోకముల కాధారభూతురాలును నగు నామెను శివుఁడు చూడఁగానే రజోమూర్తియగు నామెవలన నేను బుట్టితిని. సాత్త్వికమూర్తివలన విష్ణుఁడు పుట్టెను. తా

మనమూర్తివలన మహాబలుఁడగు కాలరుద్రుఁడు పుట్టెను. అనిచెప్పఁగా విని నారదుఁ డిట్లనియె.

నార — దేవా! ఆ ప్రకృతివలనఁ బుట్టి నీవేమేమిచేసితివి. నీయిచ్ఛ యెట్లుండెను. నీవెట్లు సృష్టికర్తవైతివి? ఆయాసంగతులు విస్తరించి చెప్పుమనఁగా బ్రహ్మ యిట్లనియె.

బ్రహ్మ — నారదా! బాగుగా నడిగితివి. చెప్పెదను వినుము. అట్లుపుట్టి నేను శివునిగూర్చి తపస్సుచేసితిని. నాతపస్సునకు సంతోషించి శివుఁడు ప్రత్యక్షమాయెను. నే నతనిని పెక్కువిధముల స్తుతిచేసితిని. నాస్తుతికి శివుఁడు సంతోషించి యిట్లనియె.

శివు — చతుర్ముఖా! నీతపస్సునకు మెచ్చితిని. నీయిష్టమైన వరము వేఁడుము. ఇచ్చెదను. అని యనఁగానే సంతోషించి యిట్లంటిని. దేవా! నీయాజ్ఞప్రకారము నేను లోకములను సృజింపఁదలంచుచున్నాను. అనఁగానే విని యతఁ డట్లేయగుఁగాకయనెను. మఱియు, చతురాననా! ఇదిమొదలు నీవు చరాచరప్రపంచమును సృజింపుము. అని యాశివుఁ డదృశ్యుఁడాయెను. నే నాతనియనుగ్రహమువలన నీచరాచరప్రపంచమును సృజించితిని. దేవతలు మనుష్యులు మొదలగు నా సృష్టిలోనివారందఱును పశువులవలె వస్త్రములులేక దిగంబరులై తిరుగుచుండిరి. స్త్రీలకుఁ గాని పురుషులకుఁ గాని మానసంరక్షణము లేకపోయినది. అందుచే గొంగడులు చర్మములు, ఆకులు మొదలగువానిచే మానమును గాపాడుకొని మొదలిడిరి. ఇట్టి ప్రజలను జూచి నేను జాలిసిగ్గుపడి యందఱకును ముఖ్యాలంకారమగు వస్త్రములను సిద్ధముచేయురీతిని దెలిసికొనుటకై కైలాసమునకుఁ బోతిని. అచ్చట దేవతలు మొదలగువారు ఆకులు మొదలయినవి కప్పుకొని సేవించుచుండఁగా వజ్రసింహాసనముపైఁ గూర్చున్న శివుని దర్శించి యనేకవిధములుగా స్తుతిచేసితిని. నాస్తుతులకు సంతోషించి శివుఁడిట్లనియె. బ్రహ్మా! నీకును నీవు సృజించిన ప్రపంచమునకును క్షేమమేకదా! నీవు చరాచరప్రపంచమును సృజించితివిగాని వారు వస్త్రములు లేనికారణమును బట్టి దిగంబరులై మాచుట కసహ్యముగాఁ గనుపట్టుచున్నారు కావున వారి



యలంకారమునకును మానసంరక్షణమునకును వస్త్రములను నిర్మించువానిని సృజింపుము. లోకము మిక్కిలి యసహ్యముగా నున్నది. నీవుదిచేతనే యాలోచించుము. అనుశివునిమాటలు విని, చేతులుజోడించుకొని యిట్లంటిని. దేవా! దేవరయాజ్ఞప్రకారము లోకమును సృజించితినిగాని వస్త్రములను సిద్ధముచేయువానిని సృజింపఁజాలను. పుట్టించువాఁడవును పెంచువాఁడవును సంహరించువాఁడవును నీవేకదా! నీకింకరుఁడనగు నాకిట్టియసాధ్యమైనపని యేల చెప్పెదవు? అనినేనఁగానే శివుఁడిట్లనియె. బ్రహ్మా! ఏమి ఆశ్చర్యమైనసంగతి చెప్పుచున్నావు? లోకమును సృజించిననీ కిది యేమాత్రపుకష్టము? అని యాయన యన్నాఁడు. అపుడు నేను మరల నిట్లంటిని. సర్వజ్ఞుఁడవగు నీతో నేమి చెప్పవలయును? నాకేది శక్యమో యేదిశక్యముగాదో నీకే తెలియును. పూర్వపుసృష్టిలో దేవతలు మొదలగువారికి వస్త్రములను నిర్మింపను మను వుండెడివాఁడు. అతఁడు నీసాయుజ్యమును బొందియున్నాఁడు. అతఁడే తప్ప మఱియెవ్వరును నీపనిచేయఁజాలరు. కావున నాయందును దేవాదులయందును దయయుంచి వస్త్రములను సిద్ధముచేయువానిని నీవే సృజింపుము. అని యారకయుంటిని. తరువాత శివుఁడు సంతోషించి మనసులో నాలోచింపఁదొడఁగెను. క్షణకాల మచ్చట నిశ్శబ్దముగా నుండెను. ఇట్లు శివుఁడు మనసులో నాలోచింపఁగానే యొకానొక మహాజ్యోతి ప్రత్యక్షమై వెంటనే పురుషాకారమును ధరించెను. అతఁడు జటావల్కలములను దండాజినకమండలువులను ధరించి వ్రేళ్ళకు దర్భలు పెట్టుకొని రుద్రాక్షకేయూరములును హారములును కంకణములను శరీరమున నలంకరించుకొని సర్వకర్మములకును సాధకమయిన యజ్ఞోపవీతముతో కోటిసూర్యప్రకాశమానుఁడై యింద్రియనిగ్రహము గలిగి నీతిమంతుఁడును బుద్ధిమంతుఁడును జ్ఞానవంతుఁడునునయి యగపడెను. మఱియు నతఁడుదారమైనగుణములు గలవాఁడును సత్యమే పలుకువాఁడును, దృఢవ్రతుఁడును చాతుర్యము యుక్తి గలవాఁడును కుశలియు కీర్తియే యలంకారములుగాఁ గలవాఁడునునై యందఱకును నాశ్చర్యమును గలిగించెను. తరువాత శివుఁడందఱును వినునట్లుగా నితఁడు దేవలుఁడని నాచే నామ

కరణము చేయఁబడినవాఁడనెను. తరువాతను దేవలుఁడు చేతులు జోడించుకొని శివునియెదుట నిలువఁబడి యనేకవిధములుగా నాయనను స్తుతి చేసి దేవా! నన్నెందులకు సృజించితివి. నేను జేయఁదగిన దేదియైన నున్నచో సెలవిమ్ము. ఏదో గొప్పకార్యము లేనిచో నశించుస్వభావము గల యీనాదేహమును సృజింపవు. దేహధారులకు సదా దుఃఖమేకాని సుఖమన్నమాట కలలో దొరకినమాటయేకదా! ఈదేహము పంచభూతాత్మకము. ఇందుఁ బంచప్రాణము లున్నవి. పదియింద్రియములు గలవు. మనోబుద్ధిచిత్తాహంకారములతోఁ గూడినది. ఇరువదినాలుగు తత్త్వములు గలసి దేహమని చెప్పఁబడుచున్నది. నిత్యుఁడగు జీవుఁడీ శరీరములో నున్నాఁడు. దేహసంబంధమునుబట్టి జీవుఁడు సుఖదుఃఖముల ననుభవించుచుండును. అజ్ఞానమను త్రాటితోఁ గట్టుబడి దుఃఖమే యనుభవించుచున్నాఁడు. ఇట్టిదియని చెప్పరాని యజ్ఞానమువలన నవివేకము, అవివేకమువలన అభిమానము దానివలనఁ గామము క్రోధము లోభము మదము మత్సరము అనునంత శ్శత్రువులును, ఈర్ష్యాదులును బుట్టుచుండును. అందు మనస్సు వాక్కు శరీరము కర్తృత్వమును బొంది మూఁడువిధములయిన కర్మమునుజేయును. అది ముగియువఱకును అనుభవించి తీఱవలసియే యుండును. సంసారసముద్రములో మునిఁగియున్న జీవునకు నివారింపరానికర్మమువలన నొడ్డుదొరకుట యసంభవము. దుష్కరమైన కర్మముల ననుభవించుజీవునకు సుఖమెక్కడిది? కావున నిందితమైన యీదేహమును నేనెట్లు భరింపఁగలను? నన్నెందులకుఁ బుట్టించితివి? నే నేమిచేయవలయును? అని యిట్లు దేవలుఁడు విన్నవింపఁగా శివుఁ డిట్లనియె. నాయనా! నీవు విచారింపకుము. నిన్ను లోకోపకారమునకై సృజించితిని. నీ వాఱుజన్మములవఱకును లోకములోఁ గీర్తిని వ్యాపింపఁజేసి యేడవజన్మమున నాసాయుజ్యమునుబొందెదవు. ప్రకృతము నేను జెప్పఁబోవుదానిని వినుము. పూర్వము నావలన వేదములు పుట్టినప్పుడు వానితోఁగూడ సర్వలోకాలంకారములగు దారములుగూడఁ బుట్టినవి. అదిమొదల వవి విష్ణునినాభీకమలమునం దున్నవి. నీ వావిష్ణునియొద్దకుఁ బోయి యాతంతువులను సంగ్రహించి నీనేర్పుకొ



లఁదిని, వానిని దివ్యవస్త్రములుగాఁ జేసి మానసంరక్షణార్థ మందఱకును నిచ్చి యీదేవాంగముల నలంకరింపుము. దానివలన నీకుఁ గీర్తియు దేవాంగుఁ డనునామమును గలుగును. అని యిట్లు శివభగవానుఁడు చెప్పినమాటలువిని యాదేవలుఁడు తనవర్తనమునుగూర్చి యిట్లడిగెను.

దేవ—దేవా! ఇటుపయిని నాప్రవర్తనవిషయమై చెప్పుము. నే నెచ్చటికిఁ బోయియుండవలయును? మహేశ్వరా! నావంశమం దెట్టివారు పుట్టుదురు? వారిప్రవర్తన మెట్లుండును? ఆయీసంగతులన్నియుఁ జెప్పుమన శివుఁ డిట్లనెను.

శివు—దేవలా! ముందుసంగతి వినుము. సర్వరత్నమయము, భోగాయతనము, ఓషధులతో నిండినది, నానావృక్షములుగలది, అనేకపర్వతములు మొదలగువానితో నిండి యేడుద్వీపములు తొమ్మిదిఖండములుగలభూమి యున్నది గదా! అందు జంబూద్వీపము గలదు. అందు దేవతలందఱకును వాసయోగ్యమయిన మేరుపర్వతముగలదు. అది యుమ్మెత్తపువ్వువలె బంగారువికారముగా నున్నది. దాని యౌన్నత్యము ముప్పదిరెండులక్షలయోజనములు. పాతాళములోఁ బదియాఱులక్షలయోజనములవఱకును పాతుబడి యున్నది. ఆపర్వతమునకు దక్షిణభాగమున భరతఖండము గలదు. అందు సర్వసౌఖ్యనిధానమగు నగరదేశ మున్నది. ఆదేశములో బహు విస్తారముగల యామోదపట్టణము గలదు. అది స్వర్గమును మించి యున్నప్పుడు దానిని వేఱుగా వర్ణింపనేల? నీవాపట్టణమునకు రాజవై రాజ్యమేలుచుండుము. ఇఁక నీవంశమువారిసంగతి యడిగితివి వినుము. నీవారందఱును ఉదారులు, సత్యము తప్పనివారు, పరోపకరణపరాయణులు, బుద్ధిశాలులు, సదాచారసంపన్నులు దేవతలయందును బ్రాహ్మణులయందును భక్తి గలవారు, పరాక్రమవంతులు, నేర్పరులు, అయి యుందురు. ఇఁక నీవు వేగముగా విష్ణునియొద్దకుఁ బోయి ముందుపని చూడుము.

బ్రహ్మ—ఇట్లు శివుఁ డాజ్ఞాపించినతోడనే మంచిదే యని యంగీకరించి సంభ్రమముతో నతనికి నమస్కరించి విష్ణుని జూచుటకై పాలసముద్రమునకుఁ బోయెను.

ఇట్లు బ్రహ్మాండపురాణములోని యుత్తరఖండమున బ్రహ్మానారద సంవాదమున దేవాంగసంభవ మనునది మొదటియధ్యాయము.

---

రెం డ వ అ ధ్యా య ము.

బ్రహ్మ—నారదా! దేవలుఁడు పోవునపుడు పార్వతికి నమస్కరించి యిట్లనెను. దేవీ! నన్ను సాదరముగాఁ జూడుము. నీవు లోకముల కీశ్వరివి. నేను శివునియాజ్ఞాప్రకారము సంతోషముగాఁ బాలసముద్రమునకుఁ బోవుచున్నాను. నాయం దనుగ్రహదృష్టి యుంచుము. లోకము లన్నియు నీయధీనములు. అనియనఁగానే పార్వతి యిట్లనియె. నాయనా! దేవలా! నీవు పొమ్ము. అవసరము తటస్థించునపుడు నాయము చేసెదను. నిన్ను శత్రువులు బాధించినపుడు నన్ను స్మరింపుము. నేను బ్రత్యక్షమై నీశత్రువులను సంహరింతును. అని దేవి చెప్పఁగానే సంతోషించి దేవలుఁడు పాలసముద్రమునకుఁ బోయి దానియొద్దనొక చక్కని సువర్ణాశ్రమమున నుండెను. నర్తించుటకు వాక్కులు చాలని యాయాశ్రమములో నుండి విష్ణుమూర్తిని బ్రసన్నుని జేసికొనుటకై యథావిధిగా నియమము నవలంబించి తపస్సుచేసెను. అతనితపస్సునకు మెచ్చి విష్ణువు ప్రసన్నుఁడాయెను. దేవలుఁడు విష్ణు ననేకవిధములుగా స్తుతిచేసెను. అతనిస్తుతికి సంతోషించి మందస్మితసుందరవదనారవిందుఁడై గోవిందుఁ డిట్లనియె. మహాభాగా! బాగు! బాగు! నీతపస్సునకు సంతోషించితిని. నీయిష్టమయిన వరము నడుగుము, ఇచ్చెదను. అని చెప్పఁగానే దేవలుఁ డిట్లనెను. దేవదేవా! నీవు సంతోషించుటవలన నేను కృతార్థుఁడ నయితిని. శివుఁడు నన్ను వస్త్రములను నిర్మింపు మన్నాఁడు. నీయొద్ద నున్న తంతువులు నా కిమ్ము. నే నంధులకై వచ్చితిని. నీదర్శనమువలన నాకోరిక నెఱవేఱినది. అనఁగానే మంచిదే యని తంతువులు నా దేవలుని కిచ్చెను. ఇట్లు చిరకాలమునుండి తననాభిపద్మములో నుంచుకొనియున్న దారముల నిచ్చి యుచ్చక్రధరుఁడు దేవలునితో నిట్లనియె. ఓ దేవలమునీ! ఇవి పూర్వము సృష్టిసమయమున నే పుట్టినవి. అదిమొదలు నేను వీనిని నానాభిపద్మమునం దుంచి దాచుచుంటిని. నీవలన నిన్నాళ్ళకు వీనికి విని



యోగము గలిగినది. ఇవి పట్టుకొనిపోయి నీ వేర్పఱుకొనుదినిని విలువలేని వస్త్రములను సిద్ధముచేసి దేవతలు మొదలగువారి నలంకరించి. హరిమానము గాపాడుము. నీవు పోవునపుడు దారిలో రాక్షసులు మునివేషములతో వచ్చి నిన్ను వంచించి దొంగిలింపఁగలరు. నీ వావిషయమై జాగ్రత్త గలిగి నీపరాక్రమమంతయుఁ జూపి యుద్ధముచేసి వారిఁద్రుంచును జంపుము. ఇట్లు చెప్పి వెంటనే తనచక్రమునుండి చక్రమును సృజించి యాతనికిచ్చెను. చక్రము పుచ్చుకొని సంతోషించుచుఁ జేతులు జోడించి దేవలుఁ డిట్లనియె. ప్రభూ! నీవు నాయం దనుగ్రహించి యంతయుఁ జెప్పితివి. నీదయవలన నీకు వస్త్రములను నేసెదను. నీయాజ్ఞను శిరసావహించి దేవతలందఱకును వస్త్రము లిచ్చెదను. అని చెప్పి దేవలుఁడు భక్తిగా నారాయణు నియెదుట నిలువఁబడి చిత్తము స్వామీ! యని నమస్కరించెను. భగవంతుఁ డప్పుడే యంతర్ధానమాయెను. అక్కడనుండి తిన్నఁగా దేవలమహాముని జంబూద్వీపమునకు వచ్చెను. ఉప్పుసముద్రమునొద్ద నొక నొక కృత్రిమమయిన యాశ్రమమును జూచెను. మాయచేఁ జేయఁబడిన యాయాశ్రమము సంగతి యెంతవింతగా నుండునో చదువరులే యూహింపఁగలరు. అట్టి యాశ్రమమును జూచి "ఈయాశ్రమ మెవరిదోకదా! ఇది నామనస్సును హరించినది. ఈయాశ్రమముయొక్క యజమానుని తపోమహిమ యెటువంటిదయి యుండునోకదా!" యని యనుకొనుచు మెల్లఁగా నందులోనికిఁ బోయెను. అందొక చోట కపటమంతయు శరీరమును ధరించి కూర్చుండియున్నదో యన్నట్లు మునియొక్కఁ డక్కడ నున్నాఁడు. తన్ను మించిన శిష్యులు పరివేష్టించియున్నారు. కపటమంత్రములను జపము చేయుచున్నాఁడు. చూచుటకు మహామునివలె నున్నాఁడు. ఇతనిజూచి నాయనా! నీ వెవరు? నీపేరేమి? నీవిచ్చటికి వచ్చిన పనియేమి? అని యతి ప్రేమగా నడుగఁగా దేవలుఁ డన్నాఁడు. మహాభాగా! నేను దేవలుఁడను పేరుగలవాఁడను. ఈశ్వరుని మానసపుత్రుఁడను. శివభగవానుఁడు నాకు వస్త్రములు నేయుమని యాజ్ఞాపించెను. విష్ణునిదగ్గఱకుఁ బోయి దారములు దెచ్చుచున్నాను. అను నతని మాటలువిని కపటముని యిట్లనియె. నాయనా! నిన్నుఁ జూచి చాల

సంతోషించితిని. నీవు మార్గాయాసము తగ్గించుకొని రేపో యెల్లుండియో పోవుదువుగాక యనెను. మంచిదేయని యారాత్రి దేవలుఁడు కృతాతిథ్యుఁడై శయనించెను. రాత్రిగురువుగారు శిష్యులు రాక్షసులై దేవలుని జంప నుద్యుక్తులైరి. వీరికుటిలము తెలిసికొని విష్ణుమూర్తియిచ్చినచక్రమును వాండ్రపయిఁ బ్రయోగించెను. కోటిసూర్యప్రకాశమానమగు నాచక్రము కొందఱురాక్షసులను సంహరించినది. కొందఱు పదిదిక్కులకును ముందే పాఱిపోయిరి. ఎట్లో తప్పించుకొని తరువాత వజ్రముష్టి ధూమ్రవక్త్రుఁడు, ధూమ్రాస్యుఁడు, చిత్రసేనుఁడు, పంచసేనుఁడు అను నైదుగురు రాక్షసులేకమయి యితనితో యుద్ధముచేయ మొదలిడిరి. రాక్షసులు బాణవర్షముగురిపించి లోకమంతయుఁ జీకటిమయము చేయుచున్నారు. కోపించి దేవలుని ఛిన్నభిన్నముగఁ జేయుచున్నారు. చక్రము వాండ్ర నేమియుఁ జేయఁజాలకపోయినది. వాండ్రదెబ్బలకు దేవలుఁడు తాళఁజాలకపోయినాఁడు. ఈ చరాచరప్రపంచమున కీశ్వరియగు చండికను మనస్ఫూర్తిగాఁ దలఁచుకొన్నాఁడు. అనేకవిధములుగా నాయమ్మను స్తుతిచేసినవాఁడు. భక్తపరాధీనురాలు పాపము! దేవి హఠాత్తుగ నావిర్భవించినది. ఇట్లు ప్రసన్నురాలయిన యాయంబతో సవినయముగా నిట్లని విన్నవించెను. అమ్మా! చండికా! నీకొక్క నమస్కారము. అమ్మా! నేను నేఁడు నీపుణ్యమూర్తిని గనులారఁ జూడఁజాలితిని. నాదికదా! అదృష్టము. అంబా! యీరాక్షసులు చూచితివిగదా! నన్నెట్లు బాధించుచున్నారో! ఈ మాటలువిని యెంత పర్వతరాజపుత్త్రియయినను, ఆఁడుదిగనుకఁ జటుక్కున మనసుకరఁగినది. ప్రసన్నురాలై దేవలునితోఁ బరమేశ్వరి యిట్లన్నది. వత్సా భయపడకు. నీకు క్షేమమేయగును. ముహూర్తమాత్రము నా బలముచూడు. ఈ రాక్షసులను శూలముతోఁ బొడిచిచంపెదను. నేఁడు వీండ్ర రక్తము బొట్టు పెట్టుకొనియెదను. అని చండిక యొక్కసారి పెద్దనవ్వు నవ్వినది. నాలుగుభుజములు, పెద్దనాలుక, ఎఱ్ఱనికన్నులు, మహాబలముగలదై చేతులతో శూలము, చక్రము, గద మొదలగు నాయుధములు ధరించి కోటిసూర్యప్రకాశమానమగు కిరీటము శిరోభాగమున వెలుఁ



గుచుండఁగా గాటుకబొమ్మవలె నాయమ్మ ప్రత్యక్షమై యొక్క దెబ్బతో రాక్షసులు తమ యబ్బలదగ్గఱకుఁ బోవునట్లు చేయఁగల నిబ్బరముగల శూలమును గొబ్బునఁ ద్రిప్ప మొదలిడినది. వాండ్రును సామాన్యులు గారు. ఇట్లు భయంకరాకారముతో దేవి వచ్చియుండుట చూచి యెట్లయినను దేవిని జంపుదమను తెంపుతో యుద్ధమునకు సన్నద్ధులయిరి. దేవిదివ్యకిరీటపుఁ గాంతులచేతనే స్తంభించిపోయిరి. ఒక్కహుంకారము చేయునప్పటికి మూర్ఛపోయిరి. అప్పుడు ఘోరరూపిణి యగు వీరమాత తనయాయుధములన్నింటిని వాండ్రపయిని బ్రయోగింపవలసి వచ్చినది. కొందఱు కాందిశీకులయిరి. ఎట్లో ఆమైమగురుగడ్డ రాక్షసులను యమునియింటికిఁ బంపివేసినది. దేవలుఁడప్పుడైదురంగులుగల వాండ్రరక్తములోఁ దనయొద్దనున్న దారములు దడిపి యయిదురంగులనూలు సిద్ధముచేసికొనెను. చూడమనఁగాఁ గిరీటము, కిరీటమునుండి బయలుదేఱిన కాంతులచే రాక్షసులందఱును స్తంభించిరి. గనుకఁ జౌడేశ్వరియని యాత్రిభువనేశ్వరి పేర్పడ్డది. ఆమె ప్రసన్నచిత్తురాలై దేవలునితో నిట్లన్నది. వత్సా! ఇక నీయిష్టమువచ్చినచోటికిఁబొమ్ము. నీవునన్నుఁ దలంచినతోడనే ప్రత్యక్షమగుచుందును. అని చెప్పి యాయంబ వెంబడినే యంతర్ధానమయిపోయినది. దేవలమహాముని త్రిన్నగాను నూలుపట్టుకొని శివునిసెలవుప్రకారముగా నామోదపట్టణమునకుఁ బోయెను.

నార:—పితాజీ! ఆవజ్రముష్టి మొదలయిన యయిదుగురు రాక్షసులును ఎవరికొడుకులు? విష్ణుచక్రముగూడ వారి నెందులకుఁ జంపఁజాలకపోయినది! వారెక్కడివారో కాని యసామాన్యులవలె నున్నారు. వారిసంగతి కొంచెము విస్తరించి చెప్పుము.

బ్రహ్మ:—నారదా! దేవి యుగ్రరూపముతోఁ బ్రత్యక్షముగాఁగానే యామెను జూచి "మనము చాలమందిమి గుమిగాఁ గూడితిమేని జయింపవచ్చును" అని వెఱ్ఱియాలోచన నిర్ణయించుకొని చతురంగబలముతోడను బయలుదేఱిరి. వారియాటోపము వ్రాయఁదరముగాదు. దేవితో యుద్ధముగదా! వాండ్రు దేవిని సామాన్య మయినయాఁడుది యనియే తలఁచియుండురు. గాలి కెగురుచుండు గడ్డలచప్పుడు, కాహాళము

లను వాద్యముల చప్పుడు, గుఱ్ఱముల హేషలు, ఏనుఁగుల ఘీంకారములు, రాక్షసుల మేఘగర్జనలు, పిడుగులవంటి ధనుష్టంకారములు దిక్కులను జెవుడెత్తించినవి. అయ్యా! రాక్షసబలములను జూచినది. మఱింత కోపము దెచ్చుకొన్నది. గద చేతితో గిరగిరఁద్రిప్పి రాక్షసులను మొత్త మొదలుపెట్టినది. ఒక్కొక్క దెబ్బకుఁ బలుమందిగాఁ జచ్చిరి. వాంద్రసంద అను దిలలవలె ఖండించినది. కొన్ని యేనుఁగులు గదాఘాతములచే దంతములు విఱిగియుఁ గుంభస్థలములు పగిలియు నేలఁగూలినవి. కుంభములనుండి జల్లున ముత్తెములు రాలినవి. గదచే, నెముకలువిఱిగి గుఱ్ఱములు చచ్చినవి. రథములు పొడిపొడియయిపోయినవి. రాక్షసులశిరస్సులు బ్రద్దలయినవి. బలవంతుఁడగుమానిసి కఱ్ఱతోఁ గుండలదొంతిని బగులఁగొట్టినట్లు రాక్షసులశిరస్సులు దేవి గదతోఁ గొట్టుచున్నది. సారథులు చచ్చిరి. అప్పుడు కత్తి చేతఁబట్టుకొని యేనుఁగులతొండములు కంఠములు ఖండింప మొదలిడినది. దేవేంద్రుఁడు వజ్రాయుధముతోఁ గొండల ఱెక్కలు నఱికి పడఁగొట్టినట్లు రాక్షసులను బడఁగొట్టినది. ప్రళయకాలమున యముఁడు దండపాణియయి ప్రజలను సంహరించులాగున నాలుగు చేతులతోను శూలము, కత్తి, గద, చక్రము పట్టుకొని యొక్కమ్మాఱుగా రాక్షసులను జంప మొదలిడినది. ఒక్కొక్కసారి కత్తి పట్టుకొని వజ్రపాణియగు నింద్రునివలె రాక్షసులను వెంటాడించినది. ప్రళయమున భైరవునివలె శూలముతో రాక్షసులను జీల్చినది. చక్రముతోడ ననేకులను ఖండించి యమునియింటికి విందునకుఁ బంపినది.—ఘోరరూపిణియగు చండిక యీరీతిగాఁ జాలమంది రాక్షసులను జంపి మిగిలినవారిని బరుగెత్తించినది. రాక్షసరక్తము వఱదలై వెల్లువలై ప్రవహించుచున్నది. ఆరక్తమంతయుఁ ద్రావినది. వాంద్రప్రేఁగులు మెడలో వైచుకొన్నది. చూడశక్యముగాకుండ ఘోరరూపిణియై ప్రళయకాలమేఘములవలె గర్జించినది. చావఁగా మిగిలినరాక్షసు లందఱును నాలుగు దిక్కులకును బాఱిపోయిరి. ఇట్లు రాక్షసు లందఱును జచ్చిపడియుండుట చూచి భూతభేతాళ ఢాకినీ శాకినీ గణములు వచ్చిపడినవి. మాంసమును దిని రక్తమును ద్రావి సంతుష్టిని బొందుచున్నవి. దేవి ననేకవిధములుగా స్తుతిచేయుచుఁ బిచ్చి పట్టినట్టు తాండవముచేసినవి. పాటి



పోయిన రాక్షసు లీసంగతియంతయుఁ, దమవారగు నితర రాక్షసుల తోడను జెప్పిరి. పూర్వము ప్రళయము దటస్థించినపుడు ప్రపంచమంతయు జలమయియుండఁగా, భగవంతుఁడగు విష్ణుమూర్తి శేషశయ్యపై నిమోగనిద్ర ననుభవించుచుండఁగా నాయన దేహమునఁ జెమట పట్టినది. అప్పుడా చెమటవలన వజ్రముష్టి మొదలగు, నాయయిదుగురు రాక్షసులును బుట్టిరి. గోవిందుఁడు నిద్రపోవుచుండుట చూచి యతనిఁ జంప నుద్యుక్తులయిరి. తరువాతను విష్ణుఁడు మేల్కొని వారితో ఘోరముగ యుద్ధము చేసెను. అప్పుడు వారు చేసిన బాహుయుద్ధమునకు సంతోషించి శౌరి వారితో నిట్లనియె. రాక్షసులారా! మీరుచేసిన యుద్ధమునకుఁ జాల సంతోషించితిని. మీయిష్టమయిన వరము వేఁడుఁడు. అనఁగానే యారాక్షసు లతనితో నిట్లనిరి. దేవా! నీకు మాయందు దయయున్నచో మాకు నీచక్రముచేఁ జావులేకుండ వరమిమ్ము. అనియడుగఁగానే విష్ణుఁ డట్లే యిచ్చితి ననెను. అది మొదలు వజ్రముష్టి మొదలగు వారు నిర్భయులై తమ పౌరుషము నాశ్రయించి పాతాళమునకుఁ బోయి యందు సుఖముగానుండిరి. తరువాత నొకప్పుడా రాక్షసులు భార్గవాశ్రమమునకు వచ్చిరి. ఆశుక్రాచార్యుని యాశ్రమములో నాతనికూఁతురు, దేవయానయనుదానిని జూచిరి. సర్వాంగసుందరియగు నాసుందరినిజూచి వారందఱును మోహమునొందిరి. ప్రేమపూర్వకముగా నామెయొద్దకుఁ బోయి వినయముగా నిట్లనిరి. సుందరీ! నీకు మేలగుఁగాక. హితకరమయిన మాపలుకాలింపుము. మేము ముల్లోకములయందును పేర్పడిన రాక్షసులము. మాయయిదుగురిలో నీ యిచ్చకువచ్చినవానిని వరింపుము. అనియిట్లు వారు చెప్పిన మాటలువిని యారమణి మిక్కిలిని గోపించి యిట్లన్నది. ఓరిదురాత్ములారా! గురుపుత్రియన్నసంగతి యయినను నాలోచింపక యిట్లనఁజొచ్చితిరిగా! బలముచేగర్వించి మీరు మతిలేక నోరికివచ్చినమచ్చునఁ బ్రేలుచున్నారుగా! నన్నడుగుటకు మీకు నోరెట్లువచ్చినది? దుర్బుద్ధులారా! నాబోఁటి బోటినిదే మీయాటోపము నణఁగించును. నాశాపము దప్పనిది. మీబలతేజము లాయుబలవలన నశించుఁగాత. అనియిట్లు వారిని శపించి తనయింటికిఁ బోయినది. ఇట్లు గురుపుత్రిచే శపింపఁబడి యారాక్ష

ములు శమదమాదిసంపన్నులయి శివుని దపస్సుచే సంతోషింపఁజేసిరి. శివుఁడు ప్రసన్నుఁడయి యెదుట సాక్షాత్కరించెను. వారాయన నిట్లు యాచించిరి. దేవా! మాయందు దయయుంచి మార్గ మధ్యమునందును ధరించువాఁగున వరముదయచేయుము. అని కోరఁగానే యట్లేయగునని వారికి వరమిచ్చి యచ్చటనే యంతర్ధానమాయెను. వారే కాలము సమీపించియుండుటచే నిప్పుడీలాగున దేవలమహామునిని జంపవచ్చిరి. చౌడేశ్వరిచే మహాబలవంతులగునా రాక్షసులు చంపఁబడిరి. దేవలుఁడు వారిర క్తములో నాదారములు ముంచి యయిదురంగులు గలవాని నిగాఁ జేసెను. వారికీశ్వరుఁ డిచ్చిన వరము సఫలమయినది.

ఇది బ్రహ్మాండపురాణములోని యుత్తరఖండమున బ్రహ్మనారద సంవాదమున దేవాంగచరిత్రమునఁ జౌడేశ్వరీవరప్రసాదము, రాక్షసోపాఖ్యానము నన్నది రెండవ యధ్యాయము.

మూఁడవ అధ్యాయము.

తరువాత నా దేవలుఁ డతిసంతోషముగా నామోదపట్టణమునకుఁ బోవుటకు బయలుదేఱి మార్గమధ్యమున ననేకదేశములను దుర్గమములగు నడవులను కొండలను పుణ్యపుణ్యములగు నదులనుదాటి కొన్నాళ్ళకామోదపట్టణము ప్రవేశించెను. మహాత్ముఁడగు దేవలునిరాక తెలిసికొని శివునియాజ్ఞప్రకార మచ్చటికి సంతోషముగా నందఱును సమాగతులయిరి. రాజులు మంత్రిపుత్త్రిలు, మహాబలులగు భటులును వణిజులును గాయకులు నర్తకులు గొప్పవాద్యఘోషములతో నాదేవలుని పురోహితపురస్కారముగా నెదుర్కొనిరి. వారందఱు నెదుర్కొని గౌరవించుటచే దేవలుఁడు మిక్కిలి సంతోషించెను. దేవరా! యీపట్టణము తమది. మమ్ములనందఱను యథాన్యాయముగాఁ బరిపాలింపుము. మేమందఱము నీవారము. ఇంక సంతోషముగాఁ బట్టణములోఁ బ్రవేశించి యేలుకొనుము. దేవదేవుండగు శివునియాజ్ఞ యిట్టిది. ఇట్లందఱును విన్నవించినతోడనే దేవలుఁడు సంతోషపూర్వకముగాఁ బట్టణములోఁ బ్రవేశించుట కంగీకరించెను. అప్పుడు శంఖములు మొదలగు వాద్యములు మ్రోఁగించిరి. ఆచప్పుడు దశదిశలను వ్యాపించినది.



అతఁ డామోదదాయకమగు నాయామోదపట్టణములోఁ బ్రవేశించెను. ఆపట్టణమునకు బంగారుప్రాకారము కలదు. బంగారుగోపురములతో నలంకరింపఁబడినది. కందకములు పాతాళలోకమువఱకును వ్యాపించియున్నవి. మఱియు నాపురిలోని జెండా లాకాశమునంటుచున్నవి. నదులలో బంగారుపద్మములు విరాజిల్లుచున్నవి. నానావిధములయిన యుద్యానవనములతో నలరారుచు నాకాశమున సంచరించు సూర్యచంద్రాదులకు విశ్రాంతిని గలిగింపఁజాలు మేడలతో నొప్పుచున్నది. అందలి యుద్యానములు నందనవనములతో స్పర్ధ చేయుచున్న వన్నఁజాలదా యింకవాని రామణీయకమేమని వర్ణింపనగును. అచ్చటి వేశ్యల లావణ్యమునకుఁ బరాజితలై యిప్పటికిని భూమియందచ్చరలు దిరుగమానిరి. ఆపట్టణముసొంపు చూచి దేవగంధర్వాదులు స్వర్గము నువిడిచి సర్వభోగములతోఁ గూడియున్న యాపట్టణమునసే వాసముచేయుచుందురు. ఏవీథిని జూచినను రథములే. ఎక్కడఁజూచినను గుఱ్ఱములే. ఏతోఁటలో జూచినను కొండలవంటి యేనుఁగుగున్నలే. ఇట్లు సర్వాంగసుందరమైన యాపట్టణములోఁ బ్రవేశింపఁగానే దేవలునకు బ్రాహ్మణస్త్రీలు నీరాజనముపట్టిరి. మంగళకరమయిన పాటలు పాడిరి. ఆయామేడలయందు నిలువఁబడి పూవులు పేలాలు చల్లిరి. వేత్రహస్తులై పరిచారకులు ముందునడుచుచున్నారు. బ్రాహ్మణులందఱును స్వస్తిపాత్రములతో వెంట నడువ మొదలిడిరి. ఇట్లు పురస్త్రీల నేత్రోత్పలములచేఁ బూజింపఁబడుచు దేవలుఁ డంతఃపురములోఁ బ్రవేశించెను. తరువాతను మంత్రులు మొదలగువారు పుణ్యతీర్థములజలము దెప్పించి మంగళవాద్యఘోషములతో మంచిదినమున మంచిముహూర్తమున నభిషేకించిరి. తరువాత నిట్లభిషిక్తుఁడైన యా దేవలుఁడు మంత్రులు మొదలగు పౌరులతోఁ గూడి సంతోషించుచు దేవతలతోఁ గూడిన దేవేంద్రునివలె నలరారుచుండెను. మంత్రులు రాజపుత్త్రులు మొదలగువారు దేవలుని రాజునుగా నభిషిక్తునిజేసి సంతోషపూర్వకముగా నమస్కరించి రాజముద్రిక యాతనిచేతి కిచ్చిరి. ఆఱుకోట్లసువర్ణములరాఁబడి యున్నదని తెలిపిరి. ఆదేశపుమర్యాద లన్నియు విన్నవించిరి. ఆయుత్సవసందర్భమున నూఱగ్రహారములు శివభక్తుల కిచ్చెను. ఉత్సవార్థము వచ్చిన బ్రాహ్మ

ణులు మొదలగువారికి ధనము కొట్లుపగులఁగొట్టి పంచిపెట్టించెను. ప్రజా
త్యర్థులు మొదలగువారిని పెక్కురీతుల సంతోషపఱిపించెను. తరువా
తను పరిచారకులను రాజకీయపురుషులను బిలిపించి వారివారిని దగురీతి
ని గౌరవించి యుండఁగుఁబంపెను. ఆదేవలునకు నలుగురు మంత్రులుండిరి.
సుబుద్ధి, కార్యదక్షుఁడు, నీతిమంతుఁడు, దీర్ఘదర్శనుఁడు నని వారిపేళ్ళు.
వారు న్యాయమార్గప్రవర్తకు లయి రాజ్యభారమును సమముగా నవ
లంబించి రాజున కెంతయు సంతసమును గలిగించుచుండిరి.

నారద—తండ్రీ! పితామహా! పూర్వ మాయామోదపట్టణము
లో భద్రబాహునికుమారుఁడు సునాభుఁ డనువాఁడు తేజస్వియుఁ బరా
క్రమశాలియు నుండెడువాఁడుగదా! అతనిచరిత్ర మెట్టిది? వానిప్రభావ
మెట్టిది? ఆరాజకుమారుఁడు దేవలమునికి రాజ్యమిచ్చుటకుఁగల కారణ
మేమి? అతనిరాజ్యమును దేవలునకు శివుఁడేల యిప్పించెను? ఇదియం
తయు నాయందు దయయుంచి విస్తరించి చెప్పుము.

బ్రహ్మ—నారదా! నీయడిగినయట్లే యామోదరాజయిన సు
నాభునికథ చెప్పెదను వినుము. అట్లుపట్టాభిషేకము కాఁగానే సునా
భుఁడు దేవలునియొద్దకు వచ్చియిట్లనియె. స్వామీ! దేవలభూపాలా!
ఇంక మేము సెలవు పుచ్చుకొనియెదము. మాకనుజ్ఞనీయవలయును. అను
నతనిపలుకు విని దేవలుఁడిట్లనియె. రాజా! ఎచ్చటికిఁ బోయెదవు? ఇది యే
మి యిట్లు చెప్పుచున్నావు? మనమందఱమును గలిసి యిచ్చటనే యుంద
ము. అను దేవలునిమాటలువిని సునాభుఁ డిట్లనియె. ఇఁకనిటుపయి నిటనుం
డఁదగదు. మనస్సు త్వరపెట్టుచున్నది. నీదయవలన దుస్తరమయిన శాప
సముద్రమును దాటితిని. నీయనుజ్ఞను బొందిపోయెదను. ఇట్లు చెప్పఁగా
నాశ్చర్యపడి యతనిచరిత్ర మిట్లడిగెను. రాజా! నేను జాల నాశ్చర్యపడు
చున్నాను. నిన్నెవ్వరు శపించిరి. అదియెట్టిది? యథార్థము వినిపింపుము.
అనియడుగఁగా సునాభుఁడు దనపూర్వవృత్తమును జెప్పనారంభించెను. దే
వలరాజేంద్రా! నీయడిగిన సంగతి వినుము. నేను రుక్మరథుఁడను గంధర్వ
రాజకుమారుఁడను, మాతండ్రి వీర్యవంతుఁడు, సత్యవాది తపోనిధి యని
లోకములయందుఁ బ్రసిద్ధినిబొందెను. అతఁడు మయూరియను నా
మెయం దెనిమిదవవసువుచేఁ బుట్టింపఁబడినవాఁడు. అతనిపట్టణము



మహేంద్రగిరికందరమున నుండెడిది. సర్వభోగాఢ్యమైన యాపట్టణములో
నుండి గంధర్వులను బాలించుచుండెను. అతనికిఁ బద్మకోమలయను భార్య
గలదు. ఆమె పారిజాతాద్రినాథుఁడగు హేమమాలికూఁతురు; తండ్రిని జ
యించి మాతండ్రి యామెను దెచ్చుకొనెను. నేనామెకును నతనికిని నౌ
రసుండనగు కుమారుఁడను. అని చెప్పిన సునాభునిమాటలు విని యతని
తండ్రిచరిత్రమును విననలరిచినవాఁడై యిట్లనియె. రాజా! నీతండ్రివరా
క్రమాదికము వినిపింపుము. నేనెంతయు గుతూహలముతో విన గోరుచు
న్నాను. అతఁడు మయూరియనునామెయం దెట్లు వసువుచే గలిగెను?
అని యట్లు దేవలుఁడడుగఁగా సంతోషించి తనతండ్రివృత్తాంతము నిట్లని
యాసునాభుఁడు చెప్పమొదలిడెను. దేవలమహారాజా! నీయడిగినయట్లు
మాతండ్రియగు రుక్మరథుని సంగతి యంతయుఁ జెప్పెదను, సావధానచి
త్తుఁడవై వినుము. అని సునాభుఁ డిట్లు చెప్పఁదొడంగెను.

ఇది శ్రీబ్రహ్మాండపురాణములోని యుత్తరఖండమున బ్రహ్మనా
రదసంవాదమున దేవాంగచరిత్రమున దేవాంగుఁడను పేరుగల దేవలుని
పట్టాభిషేక మనునది మూఁడవయధ్యాయము.

## నాలుగవ అధ్యాయము.

సునా—దేవలా! వినుము. పూర్వము సావిత్రుఁడను నెనిమిదవ
వసువు ప్రతిదినమును భక్తిశ్రద్ధాతాత్పర్యములతో శివునినుపాసించుచుం
డెడివాఁడు. అతఁడొకనాఁడు బాగుగా నలంకరించుకొని విమానమునెక్కి
కైలాసమునకుఁబోయి యచ్చటఁ జంద్రపుష్కరమను పేరుగల యొకస
రోవరమును జూచెను. అందలి పద్మములను సంగ్రహించుకొనుతలం
పున నొడ్డునకుఁ బోయెను. ఆసరస్సు పద్మములతోను రాజహంసల
తోను చక్రకారండవాది జలపక్షులతోను జలకుక్కుటములతోను నిం
డియున్నది. అందలిపద్మములలోని మకరందమును ద్రావి తుమ్మెదలు
మత్తిల్లి ఝుమ్మని ధ్వనిచేయుచున్నవి. శైవాలచికురయు, పద్మవక్త్రి
యు, పద్మదళేక్షణయు, చక్రస్తనియు, బిసభుజయు, సైకతశ్రోణియు నగు
నాసరసిని యూర్మిమాలా విరాజితను శ్రీనివలె దర్శనీయమునుగాఁ జూచెను.
మఱియు నద్దానియొడ్డున ననేకములగు పుష్పఫలాదులతో నిండారి

యుంసులతావృక్షాదికమును జూచెను. తద్రామణీయకముచే నాకర్షింపం
బడిన మనస్సుకలవాఁడై యందలి మందమారుతమునకు సంతోషించు
చు క్షణకాలమచ్చట నుండెను. ఇంతట మన్మథుఁడతనిపైని బుష్పబాణ
ములఁ బ్రయోగించెను. ఆతఁడు కామజ్వరపరీతాంగుఁడై దీనమయి
నచిత్తముతో నిట్లు విలపించెను. మారా! నిష్కారణముగా నన్నెందు
లకు బాధించెదవు! నీబాణములు పుష్పములుగావు. మండుచుండు నగ్ని
కణములు. మిక్కిలి వాఁడియయినవి. మీఁదనుండునవి తుమ్మెదలుగావు,
ధూమమని భావించెదను. వాయుదేవా! సానరాతియొరపిడిని రాలిన
కణములవంటిపరాగముల నెందుకుఁ జల్లెదవు? మన్మథా! నీవిపూవుబా
ణములని ప్రవాదముమాత్రమే కాని యాలోచించిచూడఁగా విషగులని
తోఁచుచున్నవి. కాకున్నచో నాహృదయము నిట్లు భేదించి దహింపఁగల
వా? ఇట్లు మన్మథాదుల నుపాలంభించుచు దుఃఖసంతప్తచిత్తుఁడై యటు
నిట్టుఁ దిరుగుచున్న యొక యాఁడునెమలిని జూచెను. కామమోహితుఁడ
గు నావసు వప్పుడద్దానిని దనమాయాప్రభావమున యువతీరత్నముగ
గాఁజేసి రమించెను. దానియందుఁ దనతేజస్సుచే దశదిశలను వెలిఁగింపఁజా
లిన యొకకుమారుఁడు గలిగెను. ఆస్త్రీ యెప్పటియట్లు నెమలియై యా
యడవిలో సంచరించుచుండెను. కృతార్థుండగు నావసు వాకుమారునిఁ
దనవిమానముపై నుంచుకొని స్వర్గమునకుఁబోయి వానిని దనయిద్దఱు
భార్యలకును నిచ్చెను. అతఁడు దేవతలచే రుక్మరథుఁడని పిలువఁబడు
చుండెను. వయస్సువచ్చిన యారుక్మరథుఁడు తపస్సు చేసికొనుటకై మ
హేంద్రపర్వతమునకుఁబోయెను. అట్లుపోయి యొకపవిత్రస్థలమునఁ గూ
ర్చుండి నియమ మవలంబించి లోకకర్తయగు బ్రహ్మనుగూర్చి తపస్సు
చేసెను. అతనితపస్సునకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమాయెను. ఏభూత
ముచేతను జావులేకుండ నతనికి బ్రహ్మవరమిచ్చెను. అతఁడు వరదాన
గర్వితుఁడై యంతటను దిరుగుచుండెను. అతఁడొకప్పుడు విశ్వకర్మదగ్గ
ఱకుఁబోయి, యిట్లనియె. విశ్వకర్మా! నాకు మహేంద్రపర్వతముపై
నొకపట్టణమును నిర్మింపుమనఁగానే విశ్వకర్మ కోపించి యతనివాక్య
మును దిరస్కరించి గర్హించెను. తరువాతను రుక్మరథుఁడును గోపించి
యుద్ధమునకు సిద్ధపడెను. ఇద్దఱకును ఘోరయుద్ధము జరిగినది. రుక్మర



థునిచేఁ బ్రయోగింపఁబడిన బాణములకుఁ దాళఁజాలకయు నతనివరప్ర
భావమును దెలిసికొన్నవాఁడగుటచే దుర్జయుఁడని యెఱిఁగియు నతనితో
విశ్వకర్మ సఖ్యము చేసికొనెను. తరువాత నతఁడు చెప్పిన చొప్పున మ
హేంద్రపర్వతముపై రమ్యమయిన యొకపట్టణమును నిర్మించెను. ఆపట్ట
ణముపేరు లక్ష్మీవర్ధనము. ఆలోచింపఁగా నాపట్టణమట్టిది. అందుండి
మాతండ్రి రుక్మరథుఁడు గంధర్వులను బాలించుచుండెను. మఱియు నతఁ
డనేకులగు రాక్షసులను యుద్ధములలోఁ జంపెను. దేవతలతనిని రాక్ష
సులతో యుద్ధము సంభవించినపుడు సహాయార్థము గోరుచుండెడివా
రు. అతఁడొకప్పుడు గంధర్వులతోఁ బారిజాతపర్వతమునకు వేటకుఁబో
యెను. అతఁడక్కడ నొకదివ్యమయిన కొలనుచూచెను. ఆకొలనిలోఁ
జెలికత్తియలతోఁగూడి విహరించుచున్న యొకానొక సుందరినిజూచి
యిట్లనియె. సర్వలక్షణసంపన్నురాల వగు నోసుందరీ! నీపేరేమి? నీ
వెవ్వనితనయవు? అనియడుగఁగానే యామె గంధర్వరాజగు హేమ
మాలియనువానికూఁతు ననియు, మాతండ్రి యీసమీపముననే విలా
సనగర మనుపట్టణములో నున్నాఁడనియు నాపేరు పద్మకోమల యని
యుఁ జెప్పి యప్పుడే తన చెలికత్తెలతోఁగూడఁ బట్టణమునకుఁ బోయి
నది. తరువాతను రుక్మరథుఁ డామెయందాసక్తచిత్తుఁడై తనమంత్రు
లను హేమమాలియనువానియొద్దకుఁ బంపెను. వా రాతనియొద్దకుఁ
బోయి తమప్రభువునానతి విన్నపించిరి. ఆమాటలు విని మదించియున్న
యాతఁడు వారిని దూలనాడెను. మంత్రులారా! కుత్సితజన్మముగల
మీరాజున కుత్తమురాలగు నాకుమారితె నెట్లు పెండ్లిచేయఁదగును?
నాకూఁతురు దేవగంధర్వాదులచేఁ గోరఁదగినది. మిమ్ముల నాదుర్బుద్ధి
యెట్లుపంపెను? పంపెను బో! మీరెట్లు సిగ్గువిడిచి యిచటికివచ్చితిరి?
స్వయంవరమునకుఁ దగిననాకూఁతు నెన్నటికిని మీరాజున కీయఁజాల
ను. అనిచెప్పి వారిని నిరాకరించి పంపెను. మంత్రులువచ్చి జరిగినసం
గతి తమరాజుతోఁ జెప్పిరి. ఆమాటలువిని కోపించి రాజు మంత్రులతో
నిట్లనియె. మంత్రులారా! నే నిపుడే విలాసనగరమును భస్మముపాలు
చేసి యాహేమమాలిని సంహరించెదను. అనిచెప్పి రథమెక్కి త్వరిత
ముగా బయలుదేఱి యచ్చటికిఁ బోయి శత్రుభయంకరమగు ధనుష్టం

క్కారమును జేసి, హేమమాలిని యుద్ధమునకుఁ బిలిచెను. అతనిరాక దెలిసికొని హేమమాలి కోపించి యుద్ధమునకు సిద్ధుఁడయి వచ్చెను. వారిద్దఱును ఘోరయుద్ధము చేసిరి. రుక్మరథుఁడుప్రయోగించిన భాణములచేతను హేమమాలి మూర్ఛిల్లెను. తరువాతను రుక్మరథుఁడు హేమమాలికి శైత్యోపచారములు చేయఁగా నతఁడు కొంచెము తెలివొంది తన కుపచారములు చేయుచున్న రుక్మరథునిజూచి సంతోషించి యిట్లనియె. బాగు! బాగు! మహాభాగా! రుక్మరథా! నీకు నాకుమారిత నిచ్చెదను బరిగ్రహింపుము. ఇట్లని యతనితో సంధిచేసికొని యతనిని దనపట్టణములోనికిఁ దీసికొనిపోయి పద్మకోమలయను తనకూఁతు నిచ్చి పెండ్లిచేసెను. తరువాత రుక్మరథుఁడు సంతోషించి యామెను వెంటఁబెట్టుకొని లక్ష్మీవర్ధనమను పేరుగల తనపట్టణములోఁ బ్రవేశించి యెప్పటియట్లు సుఖముగా నుండెను. నేను రుక్మరథునివలన నాపద్మకోమలయందుఁ బుట్టితిని. నాపేరు స్వర్ణకేతుఁ డని వ్యవహరించుచుండెడి వారు. రాజేంద్రా! నేనొకసారి చిత్రరేఖయను భార్యతోఁగూడ విమానమెక్కి కైలాసమునకుఁ బోతిని. దానిగుహలోఁ బార్వతీపరమేశ్వరులు క్రీడించుచుండిరి. నాకుఁ దెలియక యావనములోఁ బ్రవేశించితిని. నన్నుఁ జూచి శంకరుఁడు కోపించి "బుద్ధిహీనుఁడా! నీవిపు డెందులకు వచ్చితివి. నాశాపమువలన సామర్థ్యముపోయి మనుజుండవై పుట్టుము. ఈనీభార్య మనుష్యజన్మములో నీకు భార్యయగుఁగాక." అని యిట్లు శపింపఁగా నే మిక్కిలి వణఁకుచు శివునిపాదములపైఁ బడి "శివభగవానులవారూ! తాము దయాసముద్రములు. నాయజ్ఞానమును మన్నించి నా కీశాపము పోవుట యెప్పటికో సెలవీయవల్లయును. అగ్నిజ్వాలవంటి యీశాపమును నే నెట్లు భరింపఁగలను? నాకిది యెట్లు శాంతించును?" అని ప్రార్థింపఁగా శివుఁ డిట్లనియె. లోకోపకారమునకుఁగా నే నెపుడు దేవాంగుఁడను పేరుగల మునీశ్వరుని సృజింతునో అతఁడెప్పుడు నీవుండుపట్టణమునకు కర్తవ్యుఁడై వచ్చునో అప్పుడు నీ కీశాప మను ఘోరమగు పాపము తొలఁగిపోవును. ఇట్లు చెప్పి శంకరుఁడు దేవితోఁగూడ నచ్చటనే యంతర్ధానమాయెను. నే నామోదరాజగు భద్రబాహుని కిందుమతియందుఁ బుట్టితిని. నాకు సునాభుఁడని పేరుపెట్టెను. ఇది కలావతి



యను పేరుగలది. కాశిరాజుకూఁతురు. మాతండ్రియే నాకీతరుణిని బెండ్లి చేసెను. ఇది నాసంగతి. నీవడిగితివి గనుక విస్తరించి చెప్పితిని. నాయనా! దేవలమునీ! నీదయవలన నేను దుస్తరమయిన శాపసముద్రమును దాఁటితిని.

బ్రహ్మ—ఇట్లు చెప్పి సునాభుఁడును భార్యయు మానుష దేహములువిడిచి దివ్యరూపములను ధరించి దివ్యములగు నలంకారములను బూలమాలలను ధరించి విమానమెక్కి ప్రేమగా దేవలు నోదార్చి తమ స్థానమునుగూర్చి పోయిరి. తరువాతను దేవలుఁడు వారిశరీరములకు సత్క్రియలుచేసెను. నారదా! నీయడిగినట్లు సునాభచరిత మంతయుఁ జెప్పితిని. ఇంక నేమి వినవలతువో చెప్పుము.

ఇట్లు శ్రీ బ్రహ్మాండపురాణములోని యుత్తరఖండమున బ్రహ్మ నారదసంవాదమున దేవాంగచరిత్రములో సునాభాఖ్యాన మనునది నాల్గవయధ్యాయము.

---

అయిదవ యధ్యాయము.

బ్రహ్మ—తరువాతను వస్త్రనిర్మాణవిశారదుఁడగు దేవలుఁడు మంత్రులను బిలచియిట్లనియె. మంత్రులారా! నేను శీఘ్రముగా వస్త్రములు నేయవలసియున్నది. కావున నేతసామానులు సిద్ధముచేయఁదగియున్నది. నేనిపుడు మేరుపర్వతమునకుఁ బోయి వచ్చెదను. అచ్చటను దష్ట్రికుమారుఁడు మయుఁడున్నాఁడు. అతనియొద్దకుఁ బోయి నేతకుపయోగించు సామగ్రిదీసికొనివచ్చెదను. అను దేవలునిమాటలువిని మంత్రులిట్లనిరి. మహారాజా! నీవొక్కరుఁడవును నచ్చటికి వెళ్ళవలదు. మేముగూడఁ జతురంగ బలముతో వచ్చెదము. ఈవిషయమై యేయభ్యంతరమును జేయఁదగదు. అనుమంత్రులమాటలు విని దేవలుఁ డిట్లనియె. మంత్రులారా! మీరట్లుచెప్పకుఁడు నేను జెప్పునది వినుఁడు. నీతిగా మీరీరాజ్యమును బాలించుచునుండుఁడు. మీరుగూడ నాతో వచ్చినయెడల నిక్కడఁ బాలించువా రెవరు? కావున మీరాక నాకిష్టములేదు. ఆమయమహాప్రభుదగ్గఱనుండి నేతసామగ్రిదీసికొని వేగమ వచ్చెదను. అని చెప్పి సపరివారముగా మంత్రులను మరలించి తానొక్కరుఁడే పోవ

నుద్యుక్తుఁడాయెను. ధనుర్బాణములు పట్టుకొని యామేరుపర్వతమున కేఁబోయెను. పోవుచు నతఁడు దారిలో గార్గ్యమహాముని యాశ్రమమును జూచెను. నిర్మలజ్ఞానవంతుఁడును, మునిశ్రేష్ఠుఁడునగు గార్గ్యుని దర్శనముసకై యాశ్రమములోనికిఁ బోయెను. అతఁడును దేవలునిరాక విని యెదుర్కొని పూజించి యిట్లనియె.

గార్గ్య—మహాభాగా! నీకు స్వాగతము. దేవలా! నీకుఁగుశలమేకదా! నీరాజ్యములో సుభిక్షముగదా! నీప్రజలందఱును క్షేమముగా నున్నారా? అనునతని మాటలు విని దేవలుఁ డిట్లనియె. తపోధనా! మీయనుగ్రహమువలన మేమందఱమును క్షేమముగానే యున్నారము. మారాజ్యమునంతటను సుభిక్షమే. అని చెప్పఁగానే గార్గ్యుఁడు చాల సంతోషించెను. దేవలునిచేఁగూడఁ గుశలాదు లడుగఁబడి యథాన్యాయముగఁ జెప్పెను. తరువాత నచ్చటికి వెళ్లుచున్నావనియు నచ్చటికిరాఁ గారణమేమనియు నడుగఁగా సంగతియంతయుఁ జెప్పెను. తరువాత నాగార్గ్యుఁ డాతిథ్యమిచ్చి గౌరవించెను. దేవలుఁ డిష్టాలాపములతో నారాత్రి యచ్చటనేకడపి మఱునాఁటియుదయమునఁ గాల్యకృత్యములు నెఱవేర్చుకొని గార్గ్యునియొద్ద సెలవుపుచ్చుకొని బయలుదేఱి దారిలో ననేకములయిన దేశములను నదులను గొండలను వనములను దుర్గమప్రదేశములనుదాఁటి నిర్మానుష్యము సింహశార్దూలభేరుండఖడ్గగోమృగసంకులము, లులాయద్విపభూయిష్ఠము, భల్లూకశరభాకులము, వరాహగవయాకీర్ణము, చమరీసంచారసంకులము, కురంగయూథసంబాధము మఱియు నితరములయిన వన్యజంతువులచే నిండి నానావృక్షలతాగుల్మపరివృతమునగు ఘోరమయిన యరణ్యమునుజూచెను. ఇట్టిమహాఘోరమును దుస్తరమును నగు నాయడవిలోఁబడి పోవుచుండఁగా నొకసింహము దేవలునివాసనపట్టి జడలుజాడించుచు నెగిరి తోఁకయాడించుచు నోరుదెఱచుకొని గర్జించుచు నతనిజంపుటకై పరుగెత్తుకొనివచ్చుచుండెను. దానిరాకను దేవలుఁడుజూచి పరాక్రమవంతుఁడు గనుక ధనుస్సెక్కుపెట్టి యగ్నిజ్వాలలవంటి బాణములచే దానినిమర్దించెను. మఱియు రెండుభల్లములచే ఫాలమునఁగొట్టెను. దెబ్బలు లెస్సగాఁదగులుటచే నాసింహము వ్యాకులపడి ప్రళయకాలపు మేఘగర్జనలవలె సం



దఱకును భయము గలుగునట్లుగా గర్జించినది. తరువాతను దేవలుఁడు మంత్రించుకొని దానినోటినిండ బాణములు పడునట్లుగాఁగొట్టెను. మఱియొక బాణముచే గంఠము గుఱిచేసికొట్టెను. ఆదెబ్బతో సింగము రక్తముకక్కుకొనుచుఁ గ్రిందఁబడిచచ్చెను. తరువాతను దివ్యగంధములందుకొని దివ్యపుష్పములమాలలు దివ్యాభరణములు ధరించి యొక మహాపురుషుఁడు విమానముమీఁదనుండి యగపడెను. అతనినిజూచి దేవలుఁడాశ్చర్యపడి "పురుషవ్యాఘ్రా! నీవెవరు? నీవృత్తాంతమెట్టిది? నీసంగతినాకుఁ జాలనాశ్చర్యమును గలిగించుచున్నది." కావునఁ జెప్పుము. అనియడుగఁగానే యాపురుషుఁడు "రాజేంద్రా! సాధు! నీవలనఁ బవిత్రుఁడనై శాపమను సముద్రమును దాఁటితిని. పావనా! నీవలననేను గృతార్థుండను ధన్యుఁడను నయితిని. రాజోత్తమా! నావృత్తాంతమును జెప్పెదనాలింపుము. నేను జిరకాలమునుండి దుస్తరమగు నీశాపసముద్రములో మునిఁగియున్నాను. పుణ్యమూర్తివగు నీవువచ్చి నన్నొడ్డుచేర్చితివి. అని యాపురుషుఁడు చెప్పుచుండఁగా దేవలుఁడు మరల నిట్లనియె. పురుషశ్రేష్ఠా! నీవెవరో చెప్పుము. నామనస్సు మిక్కిలి విస్మయావిష్టమయి యున్నది. వేగముగా నీవృత్తాంతమునుజెప్పి నాయాశ్చర్యమును దొలఁగింపుము. అని మాటిమాటికి నడుగుచున్న దేవలునిమాటలు విని యక్షుఁ డిట్లనియె.

యక్షు—రాజేంద్రా! నాకథయంతయుఁ జెప్పెదను వినుము. నేను గుబేరునియనుచరుఁడను. నాపేరు కపింజలుఁడు. నేనొకసారి వేఁటాడుకోరికతోఁ బెక్కురుయక్షులతోఁగూడి యొకవనములోఁ బ్రవేశించి యనేకములగు దుష్టమృగములను జంపుచు నాయడవిలోఁ దిరుగుచుండఁగా నాదగ్గఱనుండిపోవుచు నొకలేడియగపడినది. నన్నుఁజూచి భయపడి పాఱిపోమొదలిడినది. నేనును దైవప్రేరణచే దానివెంటఁబరుగిడితిని. అది యెటు పరుగుపెట్టుచున్నదో నేనును నట్లేపరుగెత్తితిని. ఎంతగురిగాఁ గొట్టినను నాబాణముదానికిఁ దగిలినదేకాదు. ఇట్లెంతసేపటికిని గురి కందకపోవుటచే నాకుమిక్కిలి కోపమువచ్చినది. గొప్పబాణమును బ్రయోగించితిని. అది దానిపృష్ఠదేశమునందు నాటినది. అయినను లేడి పాఱిపోవుచునే యున్నది. అట్లుపరుగెత్తి తిన్నఁగా గౌతమాశ్రమము

లోఁ బ్రవేశించినది. ఇంతలో గౌతముఁ డచ్చటికివచ్చెను. రక్తముస్రవించుచుండఁగా భయపడి పరుగున వచ్చిన లేడిని వెంట ధనుర్బాణములు చేతఁబట్టుకొని పరుగునవచ్చుచున్న నన్నును గౌతముఁడు చూచెను. దయాళుఁడగు నాముని నాపైఁ గోపించి యిట్లనియె.

గౌత — దుర్మార్గుఁడా! మాయాశ్రమమృగమును జంపవచ్చితివిగా! పాపాత్మా! మాయాశ్రమములోనికి వచ్చియున్న యీలేడిపిల్లను జంపుటకు వెంటఁ బరుగెత్తివచ్చితివంటరా! ఓరిదురాత్మా! యీ కారణమున ఘోరారణ్యములో సింహమవయి ఘోరముగా జంతువులను భక్షించుచుఁ బాపము సంపాదించుకొనుచు నుండుము. అని యిట్లా ముని శపింపఁగానే నేను మిక్కిలి భయపడి యతనిని "మునీంద్రా! నాయపరాధమును మన్నించి శాపాంతమును దయచేసిచెప్పు" మని యనేకవిధములుగాఁ బ్రార్థింపఁగా "శివునిమానసపుత్త్రుఁడగు దేవలుఁడు దేవాంగుఁడని పేరుపడినవాఁడు సకలలోకములకును మానమును గాపాడువాఁడువచ్చి నీశాపమును దొలఁగించును. అంతవఱకును నీవరణ్యములో నుండుము. అని చెప్పి యాగౌతముఁ డెందేనిఁబోయెను. నేను వెంటనే సింహమునయితిని. మహాత్మా! చిరకాలమునుండి శాపదగ్ధుఁడనయి యీయడవిలోఁ బడియుండి యిపుడు నీదయవలన ముక్తకలుషుఁడనయి పవిత్రమయితిని. ఇది నావృత్తాంతము. ఇచ్చట కుత్తరముగా వామదేవాశ్రమము గలదు. అది మిక్కిలి మనోహరమయినది. అచ్చటికిఁ బోయి యామహానుభావుని జూడఁగలవు. అని దేవలునితోఁ జెప్పి క్షేమముగా నుండుమని పరమానందము నొందుచు నాయకుఁడుతనయింటికిఁ బోయెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని యుత్తరఖండమున బ్రహ్మనారదసంవాదమున దేవాంగచరిత్రలో యక్షోపాఖ్యానమనునది యైదవయధ్యాయము.

---

## ఆఱవ యధ్యాయము.

తరువాత నాదేవలుఁడు వేగముగా నాయడవిదాటి గంగాతీరమునఁ బ్రవేశించెను. ముల్లోకములను బవిత్రము చేయునదియు, దివ్యమైనదియు,



పాపములను మేఘములకు గాలివంటిదియు, శివునిజటాజూటమున విహరించునదియు, విశదకాంతిగలదియు, పాతాళమువఱకును వ్యాపించియున్నదియు, పెక్కుజలజంతువులతోఁ గూడి యున్నదియు, పూలమాలవంటి తరంగములతో నిండియున్నదియు, అందందుఁ దలలుపైకెత్తు జలజంతువులచే గంగలో స్నానముచేసినవారి పాపములు నశించునని చెప్పుచున్నట్లు గనుపడుచున్నదియు, తనలో స్నానముచేసినంతమాత్రమున సమస్తపాపములను హరించి మనుష్యులను సర్వసౌఖ్యములను గలిగించువైకుంఠమునకుఁ బంపజాలునదియు, తన్ను సందర్శించినమాత్రముననే వారిపాపములను దూదిని నిప్పువలె భస్మముచేయుచు వెంటనే పరమపదమునకుఁ బంపునదియు నగుగంగనుజూచెను. మఱియు నాగంగ పాపహారియగు తనప్రవాహములో స్నానముచేసిన వారిబ్రహ్మహత్యాదికములగు ఘోరపాపములను దూరముగాఁ జేయును. అందు మునిఁగినవారిని మహాపాతకములు కాలినయినమును బ్రాణులు ముట్టఁజాలనియట్లుగానే ముట్టఁజాలవు. ఆగంగాతీరమునందు మూఁడురాత్రులు నివసించి స్నానపానాదులచే లోపలివెలుపలిపాపములను బోఁగొట్టుకొని యుత్తమలోకములకుఁ బోవుదురు. మఱియుఁ బుణ్యపుణ్యంబులగు నాగంగోదకములచేఁ బితరులకుఁ దర్పణాదులుచేసినచో వారును, వారివంశములోఁ బుట్టినవారును, వారిమిత్రులును, బందుగులును, గురువులును, ప్రభువులును, ఇంకను వారికిష్టులును దమతమవారలతోఁ గూడ దుస్తరములగు నరకముల నతిక్రమించి యానందభరితులయి నృత్యముచేయుచు శాంకరలోకమునకుఁ బోయి నిత్యమును సంతోషించుచుందురు. మఱియు నాగంగానదిని మునులు యోగులు బ్రహ్మవాదులు మొదలగువారు ముక్తినిగోరుచు నాశ్రయించియుందురు. అటువంటిగంగానదిని జూచి దేవలుఁడు తనయాహ్నికకృత్యములను దీర్చుకొని శీఘ్రముగా నచ్చటినుండి బయలుదేఱి తిన్నఁగా వామదేవాశ్రమమునకుఁబోయెను. అది ఫలములచేతను పుష్పములచేతను నిండియున్న వృక్షములుగలదై పద్మినీహార నిబిడములగు చెరువులతోఁ గూడి, వైరములెఱుఁగని నానాజంతుసంతానముచే నలరారుచు లెక్కకు మిక్కిలియగు పక్షులరొదలచే శ్రావ్యమయి తపస్సు చేసికొనువారికి సంతో

వమును గలిగించుచు నావామదేవమహామునియొక్క తపోమహత్త్వమునకు నాదర్శమై యొప్పుచున్నది. ఆదేవలుఁ డిట్టి యాశ్రమమును జూచి మిక్కిలి సంతోషించుచు స్వాధ్యాయపరాయణులగు శిష్యులచే సేవింపఁబడుచున్న వామదేవుని జూచెను. మఱియు వేదవేదాంగముల యథార్థ మెఱిఁగినవాఁడును, పరమపావనుఁడును, నిష్కల్మషుఁడును, వినయాచారసంపన్నుఁడును, జ్ఞానవిద్యావిచారుఁడును, తేజోరాశియు, మండుచుండు నగ్నిహోత్రమువలె దురాధర్షుండును నయి యొప్పాఱుచుండెను. ఇట్టి వామదేవమహామునికి నమస్కరించి యతనిచే క్షేమాదు లడుగఁబడి యతనిసన్నిధిలోఁ గూర్చుండి దేవలుఁ డిట్లనియె. మునీంద్రా! యిపుడు మీదర్శనముచేతను బవిత్రుఁడనయితిని. జ్ఞానభూషణా! నేను ధన్యుఁడనయితిని. అని యీరీతిగా నతని గొనియాడుచు మరల నిట్లనియె.

దేవ—మునిభగవానులవారూ! తమయందఱకును గుశలమే కదా! తపోనిధీ! మీతపశ్చర్య సులభముగా జరుగుచున్నదికదా! అని యడిగినవిని వామదేవుఁ డిట్లనియె.

వామ—మహాబాహుఁడవును, అమితవిక్రమశాలివియు నగునో దేవలా! యేమనిచెప్పఁగలను? మేమందఱమును నింతవఱకును సుఖముగాఁ గాలముగడుపుచుంటిమి. మాతపస్సులు స్వాధ్యాయములు యజ్ఞములు నిర్విఘ్నముగా జరుగుచుండెను. మా కేవిధమయినభయమును లేకుండెను. కాని ప్రస్తుతము మాతపస్సులు మొదలగువానికి విఘాతము తటస్థించినది. ఇపుడు మాయాశ్రమమునకు మహాభీతి కలిగినది. ఇపు డిచ్చటిమునికుమారులకుఁ జాలపీడకలిగినది. ఆశ్రమ మృగములకు నాశము సంభవించినది.

బ్రహ్మ—నారదా! ఇట్లు వామదేవముని చెప్పఁగావిని దేవలుఁడు వినయముగా నిట్లడిగెను.

దేవ—మునిచంద్రా! మీతపోవనమునకు బాధగలిగించు పాపాత్ముఁడెవఁడు? వాఁడెచ్చటనుండును! వానిపేరేమి? వాఁడురాక్షసుఁడా? భేతాళుఁడా? మనుజుఁడా? చెప్పుఁడు. వాఁడియగు నాబాణములచేతను వానిని జంపి యమునియింటికిఁబంపి మీబాధ తొలఁగించెదను.



బంగారుపుంఖములు గలిగి పిడుగులతో సమానములైన నాబాణములచే వానిశిరస్సు నిపుడే నిస్సంశయముగా ఖండించెదను. అని యిట్లు దేవలుఁడు చెప్పఁగానే వామదేవముని చాలసంతోషించి యిట్లనియె.

వామ—దేవలా! చెప్పెదను వినుము. ఇచ్చటి కర్ధయోజన దూరమందు దుర్మార్గుఁడు కుండికుఁడను రాక్షసుఁడు గలఁడు. వాఁడు గొప్పబలము గలవాఁడు. కొండగుహలో నుండును. వానిని జూచి ప్రాణులన్నియు భయంపడి పాఱిపోవుచుండును. వానిని మేము తపోబలముచేతను శిక్షింపఁ జేయుదుముగాని తపస్సు పోవునని శాంత మవలంబించి యుంటిమి. నీవు మహాబలవంతుఁడవగు రాజవు. బ్రాహ్మణులకుఁ గలిగిన సంతాపమును హరించుట రాజులకు ముఖ్యధర్మము. బ్రాహ్మణులను రక్షించుటకంటె రాజులకు గొప్పధర్మములేదని కదా పెద్దలు చెప్పుదురు! ఆర్తులు, దుర్బలులు, తపస్విలు అగు బ్రాహ్మణులకుఁ దప్పక యభయమియ్యఁదగినది యనియు నది పరమధర్మమనియు మన్వాదులగు పెద్దలచేఁ జెప్పఁబడి యున్నది. బ్రాహ్మణులకు సంతోషము గలిగించుటవలనఁ గలుగుపుణ్య మనంతము. బ్రహ్మహత్యకంటె మించినపాపమును, బ్రాహ్మణరక్షణకంటె మించిన పుణ్యము లేదందురు. బ్రాహ్మణులతో ద్వేషించినపాపాత్ముని దుఃఖమున కంత ముండఁబోదు. అట్లు ద్వేషించిన పరమ పాపాత్ముఁడు ఘోరనరకముల ననుభవించి తరువాతను నీచయోనులయందుఁ బుట్టుచుండును. బ్రాహ్మణులను రక్షించిన ధర్మాత్ముఁడు భూలోకమున సమస్తసుఖము లనుభవించి తరువాతను స్వర్గమునం దుత్తమభోగముల ననుభవించును. ఆ పుణ్యము క్షీణించినతోడనే యారోగ్యవంతుఁడై ధనవంతులు కులీనులు మొదలగు నుత్తములయిండ్లఁ బుట్టును. అతని కెప్పుడును సుఖమే కాని దుఃఖ మన నెట్టిదో తెలియదు. బుద్ధిమంతుఁడయి యీశ్వరప్రీతిగా బ్రాహ్మణులకు దృప్తి గలుగఁజేసినవాఁడు పునరావృత్తిరహితమయి శాశ్వతమయిన పదమును గూర్చిపోవును. ఏ కారణముచేతన యనగా బ్రాహ్మణులకుఁ దృప్తిని గలిగించినవాఁడు దేవతలందఱను దృప్తిని బొందించినపుణ్యమును బొందును. హవ్యకవ్యములకు దేవతలందఱును దృప్తిని బొందుదురు. వేదవిదుఁడగు బ్రాహ్మణుని

యవయవములయందు సమస్తదేవతలును నివసించియుందురు గనుకను మఱియు నతని దేహము నాశ్రయించి సమస్తపుణ్యనదులును తీర్థములును ఉండును గనుకను బ్రతిదినమును నతఁడు పూజింపఁదగినవాఁడు. వేదవేత్తలగు బ్రాహ్మణులకు సంతోషముగాఁ బ్రతిదినమును నమస్కరించుచుండుట మంచిది. అతనికి నమస్కరించినచో సర్వదేవతలకు నమస్కరించినట్లగును. రాజా! ధర్మమాచరింపఁదలఁచినవారు తప్పక బ్రాహ్మణులను సంతోషపఱచవలయును. అందువలన గొప్పధర్మము లభించును. వేయేల? మహామతీ! ముఖ్యమయిన సంగతి చెప్పెదను వినుము. వేలకొలఁది యశ్వమేధములు, కోట్లకొలఁది గంగాస్నానములును బ్రాహ్మణరక్షణమునకు పదియాఱవ వంతును బోలవు. కావున నో దేవలా! మేము రాక్షసునివలనఁ జాల భయపడుచున్నాము. అట్టి పరమపాపాత్మునిని నీ బాహుబలము నాశ్రయించి చంపుము. వానిని జంపి మాబాధను నివర్తింపఁజేయుము. నీవు సాధువుల కుపకారము చేయునిమిత్తమై యీశ్వరునిచేఁ బుట్టింపఁబడినవాఁడవు గదా! ఆ రాక్షసుఁడు దుర్బలులగు మునులను సదా బాధించుచున్నాఁడు. వాని కెవ్వనివలనను భయము లేదు. ప్రాణికోటిని భక్షించుచున్నాఁడు. నీకు తక్క మఱొకనికి సాధ్యము గాదు. వాని నెట్లయినను జంపుము.

బ్రహ్మ—నారదా! యిట్లు వామదేవుఁడు చెప్పిన మాటలు విని దేవలుఁ డిట్లనియె.

దేవ—మునీంద్రా! ఇపుడు పాపాత్ముఁడగు నా రాక్షసుని జంపెదను. మీరందఱును నిర్భయులరయి యుండుఁడు. అని చెప్పి యుద్ధసన్నద్ధుఁడై వామదేవుని యనుమతిని బొంది వానిని జంపుటకు బయలుదేఱి యా రాక్షసుఁడు నివసించు గుహాద్వారమును సమీపించెను. అది మిక్కిలి భయంకరమును, అసహ్యకరమును, దుఃఖమును, ఆశ్చర్యమును గలిగించునదియునై యున్నది. అటువంటి రాక్షసనివాసమును జూచి దయావంతుఁడగు దేవలుఁడు దుఃఖించుచు మాటిమాటికిని దలపోయుచున్నవాఁడై అకటా! పాపాత్ముఁడగు రాక్షసుఁ డెన్ని జంతువులను నిత్యమును వధించుచున్నాఁడో? అని యాలోచించి, శీఘ్రముగా ధనుస్సునెత్తి పిడుగు చప్పుడువంటి టంకారములచే రాక్షసుని



క్షోభింపఁజేసెను. రాక్షసుఁడు నుగ్రమైన తేజస్సుగల యా దేవలుని ధనుస్సు చప్పుడు విని క్షోభించి కొండగుహలోనుండి బయటికి వచ్చెను. కాటుకకొండవంటి యాకారముగల యా రాక్షసుఁడు రక్తముతోఁ దడిసియుండు తన శూలమును గిరగిరఁ ద్రిప్పుచుఁ గన్నులెఱ్ఱఁ జేసికొని జుట్టు విఱియఁబోసికొని దేవలునిమీఁదికిఁ బరుగెత్తుకొని వచ్చెను. మహాబలశాలియగు దేవలుఁడును తీక్ష్ణములగు బాణములచేతను రాక్షసుని గట్టిగాఁ బీడించెను. ఆ రాక్షసుఁడు బలవంతుఁడగు దేవలునిచేతను బాగుగాఁ గొట్టఁబడినవాఁడై మిక్కిలిని గోపించి పెద్ద అంకెలు వైచెను. ఆ చప్పుడు పదిదిక్కులను నిండినది. శూలముచేఁ దన్నుఁ గొట్టుటకై యతివేగముగా వచ్చుచున్న రాక్షసుని మూఁడు బాణములచేతను గొట్టి మరల మూఁడు బాణములు ప్రయోగించి వాని శూలమును ఛేదించెను. శూలము ముక్కలు కాఁగానే పండ్లు పటపట కొఱుకుచు నా రాక్షసుఁ డొక చెట్టు పెల్లగించి రాజుమీఁదికి విసరెను. దేవలుఁడు వచ్చుచున్న వృక్షమును బొడిపొడిగాఁ జేసి రాక్షసునివైపు చూచి యిట్లనియె. దురాత్ముఁడా! నీ శూలము పోయినది. నీవు ప్రయోగించిన వృక్షమును ముక్కముక్కలు చేసితిని. ఇఁక నేమి చేయనుంటివో చేయుము. దుర్బలులగు మునీశ్వరులను భక్షించి మిక్కిలిని గర్వించియుంటివి. నీ కెవ్వరివలనను భయమున్నట్టు తోఁచదు. నీవు చాలఁ బాప మార్జించితివి. దానికి సమయము తటస్థించినది. నిమిషమాత్రములో నా బాణములచే నీ గర్వమును బోఁగొట్టెదను. అని యిట్లు దేవలుఁడు చెప్పుచుండఁగా రాక్షసుఁడు కోపముగలవాఁడై యొక పెద్దరాయి తీసి "చావుము" అని రాజుమీఁదను విసరెను. ఆ వచ్చుచున్న శిలను వజ్రమువంటి బాణములచేతను బొడిగావించి యా రాక్షసుని సర్వాంగములయందును బాణములను నిండించెను. తరువాతను రాక్షసుఁడు కోపపూరితుఁడయి "ఓరీ! మూఢుఁడా! కాలచోదితుఁడవయి నాకంటఁబడితివి. ఇఁక నెక్కడకుఁ బోయెదవు? ఇపుడు నిన్ను వజ్రసదృశమయిన నా పిడికిలితోఁ బొడిచి చంపి నీ రక్తము ద్రావి తృప్తిని బొందెదను" అని చెప్పి మీఁదికిఁ బిడికిలిపట్టి పరుగెత్తుకొని వచ్చుచున్న రాక్షసునిపై నొక వాఁడి బాణమును బ్రయోగించి యా చేయి ఖండించెను. మఱి

ఘుక బాణముచేతను రెండవ చేయిగూడ ఖండించెను. ఇట్లు రెండుచే
తులును దెగిపడిపోవుటచే బలవంతుఁడగు రాక్షసుఁడు నోరు తెఱచికొ
ని కోఱలతో వానిని బీడింతునుగాక యని వచ్చుచుండఁగా నంతట దే
వలుం డర్ధచంద్రాకారముగల బాణము ప్రయోగించి రాక్షసునిశిరస్సు
తెగఁగొట్టెను. వానిశిరస్సు వజ్రాయుధముచేఁ గొట్టఁబడిన కొండశిఖర
మువలె నేలఁగూలినది. తరువాతను విమానమెక్కి దివ్యరూపధరుఁడగు
నొకానొకపురుషుఁడు తనతేజస్సుచే దశదిశలను వెలిఁగించుచు దేవలుని
కగపడెను. అతనినిజూచి యాశ్చర్యపడి నీవెవరు ? అని దేవలుఁడడిగె
ను. ఇట్లడుగఁగా నతఁడిట్లనియె. రాజేంద్రా ! సాధు ! సాధు ! పవిత్రుఁడ
నయితిని. నీధర్మమున దుస్తరమయిన శాపసముద్రమును దాఁటితిని.
నా శాపాగ్నిహోత్రమును జల్లార్పితివి. నావృత్తాంతమంతయుఁ జెప్పెద
నాలింపుము. నేనిక్ష్వాకుపుత్త్రుఁడగు విశాలునికుమారుఁడను. నేను మహా
బలపరాక్రమములు గలవాఁడను. నాపే రుగ్రధన్వ యందురు. నేను బా
గుగా రాజ్యమేలితిని. నాపట్టణము విశాలయను పేరుగలది. నేను రా
జ్యమేల్చు కాలమునందు వికటుఁ డనుపేరు గల రాక్షసుఁడు దేశముల
ను బాధించుచు మునీంద్రులను భక్షించుచున్నవాఁడు. నేనాసంగతి దెలి
సికొని యాపాపాత్మునిజంపి యందఱకును సంతోషమును గలిగించితిని.
రాజా ! ఆపాపరాక్షసునితమ్ముఁడు కర్కశుఁడను పేరుగలవాఁడు నా
తో యుద్ధముచేయఁజాలక కపటోపాయము నవలంబించి మాయింట వం
టలవాఁడై యుండెను. నాకాసంగతి యనుమంతయుఁ దెలియదాయె
ను. ఇట్లుండఁగా నొకనాఁడు దుర్వాసోముని భోజనార్థియయి మండు
చుండునగ్నివలె మాయింటికి దయచేసెను. పాపాత్ముఁడగు నారాక్షసుఁ
డు మనుష్యమాంసమును వడ్డించెను. క్లేశసంకీర్ణమయిన మనుష్యమాం
సమునుజూచి యాయన్నమువిడిచి కోపపరీతాత్ముఁడై యాముని "దు
రాత్ముఁడవగు రాజాధమా ! నాకుఁ మనుష్యమాంసమునేటికిరా వడ్డిం
పఁజేసితివి ? " అని నేనెంతగా బ్రతిమాలుకొనుచున్నను నామాటవిని
పించుకొనక "పాపాత్మా ! నాకు మనుష్యమాంసమును బెట్టించినందు
లకు ఫలముగా దురాచారుఁడవై మనుష్యమాంసము దినుచుండుము."
అని నిర్దోషుఁడనని మొఱవెట్టుచున్నను నన్ను శపించెను. ఆశాపమువిని



మిక్కిలిని బరితపించినవాఁడనయి భయపడి "మునిచంద్రా ! నాయందు
దయదలఁచుము. నాశాపమున కంతమును గల్పించుము." అని య
నేకవిధములుగాఁ బ్రార్థింపఁగా నప్పు డతఁడు "శివునిమానసపుత్త్రుఁడగు
దేవాంగుఁ డనునతఁడు సమస్తమైనవారికిని మానసంరక్షకుండై యుండు
పుట్టఁగలఁడు. అతఁడువచ్చి నీశాపమును దొలఁగించును. అంతవఱకును
నీవు రాక్షసుఁడవై యుండుము" అని చెప్పి యాముని యంతర్ధానమా
యెను. వెంటనే నేను రాక్షసుఁడనయిపోతిని. చిరకాలమునుండి శాపద
గ్ధుఁడనయి యీయడవిలోఁ బడియుంటిని. నేను భక్షించినజంతుజాల
మునకు లెక్కయే లేదు. రాజేంద్రా ! యిన్నాళ్ళకు నీవలన సమస్తపాప
ములు పోయి పవిత్రుఁడ నయితిని. ప్రభూ ! నావృత్తాంతమంతయు నీ
యడిగినయట్లు చెప్పితిని. నేను నీయొద్ద ననుజ్ఞాతుఁడనయి పోయెదను.
నీకెప్పుడును మేల మగుఁగాక.

బ్రహ్మ — నారదా ! అతఁ డిట్లు చెప్పి పరమసంతోషమును
బొంది దేవలోకమునకుఁ బోయెను. మహాశూరుఁడగు దేవలుఁడు వా
మదేవమహామునిసన్నిధికి వచ్చెను. ఆమునిచే విశేషముగా సత్కరింప
బడి యతనియొద్ద సెలవుపుచ్చుకొని యచ్చటనుండి క్రమముగా మేరు
పర్వతమునకుఁ బోయెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని యుత్తరఖండమున బ్రహ్మ
నారదసంవాదమున దేవాంగచరిత్రమున రాక్షసశాప
విమోచన మనునది యాఱవయధ్యాయము.

## ఏడవ యధ్యాయము.

తరువాతను దేవలుఁడు మేరుపర్వతమును సమీపించి మయుని
యింటికిఁబోయి యతనిచే సత్కరింపఁబడి యానందమును బొందుచు
నుండఁగా మహాబలుఁడగు నామయుఁడు దేవలునిఁ జూచి యిట్లనియె.
రాజేంద్రా ! మహామతీ ! ఇచ్చటికి వచ్చినకార్య మేమి ? నీ వొక్కరుఁ
డవును వచ్చుట చూడఁగా నాకు మిక్కిలి యాశ్చర్య మగుచున్నది. అ
నుమయునిమాటలు విని దేవలుఁ డిట్లనియె. ఓయీ ! మయుఁడా ! నా
రాకకుఁ గారణము వినుము. నేను వస్త్రములు నేయుటకు సామగ్రికై

19

వచ్చితిని. నీవు నేర్పరివి, ప్రాజ్ఞుడవు, సమర్థుడవు. కావున నో ప్రభూ! నీవు నాకు నేతసామగ్రిని సిద్ధముచేసి యిచ్చిపంపుము. నేనుశీఘ్రముగా దేవాదులకు వస్త్రములు నేసి యీయవలసి యున్నది. అని దేవలుడు చెప్పగా నే మయుడు మంచిదే యని క్షణకాలములో నేతసామగ్రి నంతయు సిద్ధముచేసెను. అతడు వజ్రమయమయి సుందరముగా నుండు వస్త్రమును జుట్టుసాధనమును, మధ్య మధ్యను రత్నములతో బొదుగఁబడిన వైడూర్య మణివికారమైన చట్టింపుపలకను, వజ్రమయము దంతమయమునగు సూదిని, మరకతమణివికార మయి పుష్పరాగము బుబువ్వలచే నలంకృతమయి గోమేధికములు కంఠభాగమునందుఁగల నేతకఱ్ఱను, గరుడపచ్చతోడి నాడిక్రోవిని వజ్రమయ మయిన కీలనుజేసెను. చుట్టునట్టి యావజ్రమయమయిన కీలయందొక్కొక్క పలక యొక్కొకరత్నముచే ప్రకాశించునదిగాఁజేసెను. ఈరీతిగా వస్త్రములనుజుట్టుసాధనమును నిర్మించెను. వజ్రపుబిడియు వజ్రకీలయుఁ, రత్నపుప్పవిరాజితము, అయోమయియు, హేమపట్టయునగు చూబిక త్తినిజేసెను. ఇట్లు మయుఁడేకవిధములయిన నేతసామగ్రిని సిద్ధముచేసి దేవలునకిచ్చియిట్లనియె. రాజేంద్రా! పూర్వమును గలిగించునట్టి వీనిప్రభావమును వినుము. అనేకవస్త్రము లీవేష్టనికిఁజుట్టినను నిది పరిపూర్తినిబొందదు. దీనిప్రమాణ మట్టిది. మఱియు నీసూదియు నేతకఱ్ఱయు నీయనుబంధ ప్రమాణముచే రత్యముగానుండఁగలవు. ఇందు సందియము లేదు. ఈ నాడిక్రోవిచీలలు, నీతలంచినట్లు కాఁగలవు. లోకులమానమును గాపాడెడు మహానుభావా! పంచవిధములయిన రంగులుగలనూలు కండెల యందుఁ జుట్టియున్నను వానిలోనుండి ప్రకృతమున కుపయోగించురంగులుగలనూలే బయటికి వచ్చుచుండును. మఱియు నైదురంగులనూలు చుట్టియున్న యాసాధనమునందలి మైదుదారములును ప్రకృతమున కుపయోగించు నట్లగుచుండును. అన్నియు వేఱువేఱుగా నే ప్రకృతము ననుసరించి వచ్చుచుండును. ఐదువిధములగు కండెలును నొకేమాదిరిగా దిరుగుచుండును. అని వానివానిసంగతు లన్నియుఁజెప్పి హేమపట్టయు, వజ్రమయియు, అష్టఘంటావిరాజితయు నగు నొకమహాశక్తి నా దేవల రాజునకిచ్చెను. తరువాతను దేవలుఁడా మయునిభూషించి



యత్తనిచే భూషితుఁడై తనపట్టణము ప్రవేశించెను. అనుబంధములయొక్క మనోహరమయిన ప్రమాణము తనయిష్టాధీన మగుటంజేసి తానే కట్టెను.

మునులు.—సూతా! దేవలుఁడే యనుబంధమును గట్టెనని చెప్పితివి. మయుఁడెందులకుఁగట్టి యీయకపోయెను? నేత సామగ్రియంతటిలో ననుబంధముగట్టుటయే కఠినముగదా! అట్టియనుబంధము గట్ట నేర్పరియయిన దేవలునికి మయుఁడిచ్చిన సామగ్రిమాత్రము నిర్మించుటకు శక్తిలేకపోయెనదా? తానే స్వయముగా నెఱిగినవాఁడు మయుని యాచించుట కేలపోయియుండెను? యథార్థ మెఱిఁగినవాఁడవు గనుక మాసందియములఁ దీర్పవలయు నన సూతుఁ డిట్లనియె.

సూతు.—మునులారా! అనుబంధముగట్టుట దేవలునికి శంకరానుగ్రహమువలన సిద్ధించియున్నది. మఱియు నేతసామగ్రియంతయు నిర్మింప దేవలుఁడు శక్తిగలవాఁడే. అయినను దనచే సింహమునకును రాక్షసునకును శాపవిమోచనము చేయవలసి యుండుటంజేసి సామగ్రిని సంపాదించుమిషచే మయునిదగ్గఱకుఁ బోవలసివచ్చినది. బ్రహ్మతో సమానమయిన సామర్థ్యముగల యాదేవలునకు మూఁడులోకములయందును సాధ్యముగానిది యొకటియుండునా? ఇట్లు యావత్సామగ్రియు సిద్ధముచేసికొని యాదేవలుఁడు భక్తితో జౌడేశ్వరియనుపేరుగల చండికాదేవిని మనస్సులో దలంచెను. ఇట్లు దేవలుఁడు స్మరించినంతనే యాదేవి దేవలునికిఁ బ్రత్యక్షమయి ప్రీతిపూర్వకముగా నిట్లనియె. వత్సా! దేవలా! నన్నెందులకు స్మరించితివి? అని యడుగగా నతఁడిట్లనియె. దేవేశీ! నీదర్శనముచేతనే ధన్యుఁడనయితిని. నీదయవలన నామనోరథము సఫలమయినది. నేను శివునియాజ్ఞవలన వస్త్రములు నేయుటకుఁ గోరుచున్నాను. భక్తవత్సలురాలవగు నో దేవీ! నీకటాక్షమువలననే నేసినవస్త్రము లక్షయములగుఁగాక. నేను మూఁడులోకములవారికిని వస్త్రము లీయవలసియున్నది. వారివారికోరిక ప్రకారము వస్త్రములు సిద్ధముచేసి యీయవలెను. అట్లుచేసి కృతార్థుఁడను గావలయును. కనుక నట్లు నాకు వరమీయవలయును. అని యిట్లతఁడు కోరఁగా నే యామె ప్రేమపూర్వకముగా నిట్లనియె. రాజేంద్రా! నీవు కోరినట్లే

యగును. ఇదిగో నేనిచ్చుకంకణమును జేతికి ధరించి నీనేర్పుకొలఁదిని నానావర్ణములుగల వస్త్రములను నేయుము. ఒక్కొకరంగుగల నూలుతో నొక్కొకవస్త్రమునేయుము. అవియన్నియు నక్షయములగును. నీవెట్టివస్త్రములు నేసినను నవి యక్షయములే యగును. మచ్చునకుఁగా నొక్కొక్కటిమాత్రము నేయుము. అని చెప్పి కంకణమిచ్చి రాజును సంతోషపెట్టి యచ్చటనే యంతర్ధానమైనది. తరువాతను దేవలుఁడు సిద్ధాంతులను బిలిపించి మరచిముహూర్తము నేర్పటిపించి బ్రాహ్మణుల నుబిలిపించి స్వస్తియనముచేయించి వారికి దక్షిణలిచ్చి సంతోషపెట్టెను. తరువాతను నేతకుపక్రమించుచు నాయంబ యిచ్చిన కంకణమును జేతికిధరించెను. బుద్ధిశాలియగు నాదేవలుఁడు విలువగల వస్త్రములను నిర్మించెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని యుత్తరఖండములో బ్రహ్మనారదసంవాదములో నేతసామగ్రిని సంపాదించుట, చౌడేశ్వరియిచ్చిన వస్త్రాక్షయవరప్రదానము నన్నది యేడవయధ్యాయము.

---

## ఎనిమిదవ యధ్యాయము.

స్సూతు—అంత నాదేవలుఁడు తననేర్పుందఱకును వెల్లడియగునట్లు నానావిధములయిన రంగులుగల వస్త్రములను నేసెను. ఆవస్త్రములకుఁ గనుమను గన్నులవంటివియు, హంసవంటివియు, చంద్రునివంటివియు, నక్షత్రములవంటివియు బుట్టలుఁగలుగునట్లుగా నానావిధములయిన రంగులనూలుతోను నేయఁ బ్రారంభించెను. మఱియు మఖ్బరంగుగలవస్త్రములను మఱియు ననేకవిధములుగల వస్త్రములను నేయుచుండెను. ఇట్టులనేకవస్త్రములు నేసి యవిపట్టుకొని తిన్నఁగా విష్ణుమూర్తిదగ్గఱకుఁ బోయి యతనికిఁ బీతాంబరము నిచ్చెను. తెల్లనివస్త్రమును లక్ష్మికిచ్చెను. ఎఱ్ఱనివస్త్రమును భూదేవికిచ్చెను. మఱియు నచ్చట నున్న వారందఱకును వారివారికోరిక కనుకూలమయిన వస్త్రములను బ్రీతితో నిచ్చెను. అచ్చట శ్వేతద్వీపములో నున్న వైష్ణవులందఱును బలువిధములయిన వస్తువాహనాదులిచ్చి దేవలుని సత్కరించిరి. మఱియు లక్ష్మీనారాయణులుగూడ నతనిని విశే



షముగా గౌరవించిరి. ఇట్లచ్చట సత్కరింపఁబడి యక్కడనుండి బ్రహ్మలోకమునకుఁ బోయి బ్రహ్మకు రక్తాంబరమును సరస్వతికి శ్వేతాంబరమును సావిత్రికిఁ బీతాంబరమును గాయత్రికి రక్తాంబరమును బ్రజాపతికిఁ దెల్లని వస్త్రమును పులస్త్యుని కాకుపచ్చనివస్త్రమును మఱియు నచ్చటనున్న గంధర్వులు కిన్నరులు సిద్ధులు సాధ్యులు మహర్షులు చారణులు మొదలగువారికి వారివారియిష్టప్రకారము కోరినవస్త్రములనునిచ్చి బ్రహ్మకు నమస్కరించి యిట్లనియె. స్వామీ! యీకమీఁదను మావంశస్థులందఱకును వస్త్రములు నేయుటకుఁదగినట్టుగా నూలుదొరకునట్లు చేయుఁడు. అనియడుగఁగా విని బ్రహ్మ యిట్లనియె. దేవలా! నీవంశమువారి కందఱకును నూలు దొరకునుపాయమును జెప్పెదను వినుము. మాని, అభిమాని యనుపేరుగల వీరిద్దఱును విష్ణునినాభీకమలమునందున్నవారు. ఈస్త్రీ లిద్దఱును ముందు ముందు భూమిపై వృక్షములయి పుట్టెదరు. ఆచెట్లవలనఁ గావలసినంత నూలు దొరకుట కేవిధమయిన యభ్యంతరమును గలుగ కుండును. అని యిట్లు బ్రహ్మచెప్పఁగానే విని సంతోషించి యాయనచే ననుజ్ఞాతుఁడై స్వర్గమునకు వచ్చి దేవేంద్రునికిరక్తాంబరమును, శచీదేవికిఁబీతాంబరమును జయంతునికిఁ దెల్లనివస్త్రమును నిచ్చి మఱియు నచ్చటనున్న యెనమండ్రువసువులకును ద్వాదశాదిత్యులకును, ఏకాదశరుద్రులకును వారువారు గోరినప్రకారమయిన వస్త్రముల నిచ్చెను. మఱియు బ్రహ్మఋషులకును దేవర్షులకును మిగిలిన దేవతలకును గంధర్వులకును మంచిమంచివస్త్రములిచ్చి వారందఱిచేతను వస్తువాహనాదులచే సత్కరింపఁబడెను. మఱియు నాదేవతలందఱును వివిధములైన యస్త్రములుగూడ నిచ్చిరి. తరువాత నప్సరస్త్రీలందఱకును గోరినప్రకారము దివ్యమైన వస్త్రములిచ్చెను. అచ్చటనుండి మేరుపర్వతమునకుఁ బోయి యచ్చటనున్న దేవతలు, విద్యాధరులు, గంధర్వులు, సిద్ధులు, చారణులు, సాధ్యులు, కింపురుషులు, యక్షులు, కిన్నరులు, గరుడులు, మునులు మొదలగు యావజ్జనమునకును దెల్లనివి, యెఱ్ఱనివి, పచ్చనివి, నల్లనివి, యింకను బలురంగులు గలిగినవియు నగు వస్త్రములనిచ్చి వారిచే దానమానాదులచే సత్కృతుఁడై మయునిసన్నిధికిఁబోయి యతనికోరినవస్త్రములిచ్చి య

తనిచే ననేకములగుసాయుధములు మొదలగువానిచే సత్కరింపఁబడి యచ్చటినుండి మహేంద్రపర్వతమునకుఁ బోయి యచ్చటనున్న వారందఱకును వస్త్రములిచ్చి వారిచే సత్కృతుఁడై మలయాద్రికిఁబోయెను. అచ్చటివారినిగూడ వస్త్రములతో నలంకరించెను. తరువాతను సహ్యపర్వతమునకుఁబోయి యచ్చటనుండెడు కిన్నరాదులగువారికి మంచిమంచి వస్త్రములిచ్చి యచ్చటినుండి కృతసత్కృతియై హిమవత్పర్వతమునకుఁ బయనమాయెను. అచ్చట నున్నవారినందఱను వస్త్రములచే సంతోషపఱిచి యచ్చటినుండి వింధ్యపర్వతమునకుఁ బోయి యచ్చటివారికి వస్త్రములిచ్చి యచ్చటినుండి బయలుదేఱి ఋక్షవంతమను పర్వతమునకుఁ బోయి యచ్చటనుండు విద్యాధరాదులగువారికి వస్త్రములు బహుమానముచేసి పారిజాతపర్వతమునకుఁ బోయి యచ్చటి గంధర్వసమూహమునకును సాధ్యులకును విలువగలవస్త్రములిచ్చి సంతోషపెట్టెను. మఱియు నచ్చటనున్న మునులకును, అడవివాండ్రకును మహాత్ములకును వారువీరను భేదములేకుండ మానసంరక్షణను గోరువారందఱకును వస్త్రములనిచ్చెను. ఇట్లు స్త్రీలకును బురుషులకును వస్త్రములిచ్చి యగ్నిహోత్రుని పట్టణమునకుఁబోయి యతనికి నల్లనివస్త్రమునొసంగెను. ఆతనిచే సత్కృతుఁడై యమునిపట్టణమునకుఁబోయి యతనికిని యతనిభృత్తులకును నల్లనివస్త్రము లిచ్చెను. అక్కడినుండి నైరృతి పట్టణమునకుఁబోయి యతనికిఁ బీతాంబరమునిచ్చి యచ్చటినుండి వరుణలోకమునకుఁబోయి యాతనికిఁ దెల్లనివస్త్రమునిచ్చెను. మఱియు నావరుణునిలోకములో నున్నవారినందఱను వస్త్రదానముచే సంతోషింపఁజేసి వరుణాదులగువారిచే రత్నములు హారములు మొదలగువానిచే సత్కృతుఁడయి యచ్చటినుండి వాయులోకమునకుఁబోయి యతని కాకుపచ్చనివస్త్రమునిచ్చి యతని యనుజ్ఞనుబొంది యలకాపట్టణమునకుఁబోయి యచ్చటనున్న కుబేరునికి విచిత్రవర్ణములగలవస్త్రములను నలకూబరునికి దివ్యవస్త్రములను నిచ్చెను. కుబేరాదులు దేవలునికి రత్నకుండలములను కోటిసూర్యప్రకాశమానమగు కిరీటమును మఱియు నెన్నేని నగలను సమర్పించి గౌరవించిరి. అచ్చటినుండి బయలుదేఱి యాశానునిదగ్గఱకుఁ బోయి యతనికిఁ దెల్లనివస్త్రమును ప్రమ



థులు మొదలగు భూతగణములకు విలువగల యనేకములగు వస్త్రములను నిచ్చి వారందఱచేతను లెస్సగా సత్కరింపఁబడెను. ఇట్లు ధర్మాత్ముఁడును, కీర్తివంతుఁడును నగు దేవలుఁడు సర్వలోకములవారిని వస్త్రములచే సంతోషపఱిచెను. అతఁడు మూఁడులోకములలో నుండువారికిని మానము గాపాడెను. దేవాంగములను వస్త్రములచే నలంకరించినవాఁడగుటచే నతనికి దేవాంగుఁడనియే పేరు ప్రసిద్ధికెక్కినది.

ఇట్లు బ్రహ్మాండపురాణములోని యుత్తరఖండములో బ్రహ్మనారదసంవాదమున దేవాంగదేవలోకవస్త్రప్రదానమన్నది యెనిమిదవ యధ్యాయము.

---

## తొమ్మిదవ యధ్యాయము.

సూతు—తరువాతను రాజర్షియగు దేవలుఁడు భూలోకమునకు వచ్చి పృథుచక్రవర్తిచేఁ బాలింపఁబడుచున్న జంబూద్వీపములోని వజ్రపట్టణములోఁ బ్రవేశించి పృథుచక్రవర్తికిని నచ్చటనుండువారికిని యథేష్టముగా వస్త్రములనిచ్చెను. ఆ చక్రవర్తియు వస్తువాహనాదులచే దేవలుని సంతోషింపఁజేసెను. పిదపఁ బ్లక్షద్వీపమునకుఁబోయి శూరసేనుఁడను రాజునకును బట్టణములో నుండువారికిని గోరెనప్రకారము వస్త్రములిచ్చి వారిచే గౌరవింపఁబడి కుశద్వీపమునకుఁబోయెను. అచ్చట రాజగు కుశియనువానికి వస్త్రములిచ్చి యాతనిచే సభ్యాదులచే గౌరవింపఁబడెను. అచ్చటినుండి క్రౌంచద్వీపమునకుఁబోయి యమితౌజసుఁడగు హేమాత్ముఁడను రాజునకును వానిప్రజలకును నానావిధములయిన వస్త్రములను నిచ్చి వారందఱచేతను మౌక్తికములు, ఇంద్రనీలములు గుఱ్ఱములు గజములు భూషణములు మొదలగువానిచే సత్కరింపఁబడి శాకద్వీపమునకుఁబోయెను. అచ్చటిరాజగు నభిరామునకుఁ గావలసిన వస్త్రములిచ్చి యాతఁడు రథములు వాహనములు పల్లకీలు నగలు మొదలగువానిచే సత్కరింపఁగా సంతోషించి యాతనిదగ్గఱ ననుజ్ఞాతుఁడై శాల్మలద్వీపమునకుఁ బోయెను. దేవలుఁ డాద్వీపాధిపతియగు శాలిహోత్రునకు వస్త్రములిచ్చి కృతసత్కృతియై యచ్చటినుండి పుష్కలద్వీపమునకుఁబోయి యాద్వీపాధిపతియగు భానుమంతునకు సొగసయిన

22

వస్త్రములిచ్చి యతనిచే గౌరవింపఁబడి మరల జంబూద్వీపమునకువచ్చెను. మఱియు జంబూద్వీపములోనున్న యంగవంగకళింగాది యావద్రాజులకును వస్త్రములనిచ్చి సంతోషపఱిచెను. నానాదేశేశ్వరులగు రాజులచేతను సమర్పింపఁబడిన యేనుఁగులు, గుఱ్ఱములు, రథములు, భూషణములు, పల్లకీలు, బంగారు, రత్నములు, ముత్యములు, వస్త్రములు, గోవులు, ధనము, దాసీగణము, ఇతరదానములు, మొదలగువానిచే సత్కరింపఁబడి రాజశేఖరుండగు నాదేవలుఁడు పరమానందభరితుఁడాయెను. వేయేల ? ఈజంబూద్వీపములోనున్న నాలుగుజాతులవారికిని గోరినవస్త్రము లిచ్చి సంతసింపఁజేసెను. ఆయాప్రముఖులవలన నీయఁబడిన రథములు మొదలయిన కానుక లసంఖ్యము లయిపోయినవి. అయినం గొంతవఱకు వానిసంఖ్య చెప్పెదనాలింపుఁడు. ఒకకోటిరథములు రెండుకోట్లు గోరథములు, (బండ్లు) రెండుకోట్లు మదపుటేనుఁగులు, నాలుగుకోట్లుగుఱ్ఱములు,ఒక్కకోటి లెక్కగల పల్లకీలు పదికోట్లుదాసీజనములు,ముప్పదియాఱులక్షలు దాసులు, నయియుండును. వీరినందఱను గ్రమముగా నామోదపట్టణమునకుఁ బంపించి తానుపాతాళలోకమునకుఁ బోయెను. అది సర్పములపడగలయందలి రత్నములకాంతులచేతను నాగకన్యకలచేతను బ్రకాశించుచున్నది. పాతాళలోకమునకు రాజగు వాసుకియొద్దకుఁబోయి యతనికి నానావర్ణములుగల వస్త్రములిచ్చెను. చిత్రసేనుఁ డనువానికి దివ్యములయిన వస్త్రములిచ్చెను. తక్షకునకు నెఱ్ఱనివస్త్రములను నల్లనివస్త్రములను, ఐరావతుఁడనువానికిఁ దెల్లనివస్త్రములను సౌరభేయుఁ డనుసర్పమునకుఁ బీతాంబరమును మఱియు నితరులగు నాగులకు వారివారియిష్టమునకు వచ్చినవియు నగు వస్త్రములను నిచ్చెను. వాసుకి మొదలగువారును అమూల్యము లగు రత్నములను దేవలునకిచ్చిరి. మఱియు మిగిలిన నాగోత్తములందఱును దమకుఁ గలిగినమంచిమంచి రత్నములను దెచ్చి దేవలునికి సమర్పించిరి. తరువాతను శేషుఁ డుండుచోటికిఁ బోయి యతనికి నానావర్ణవిరాజమానములగు వస్త్రముల నిచ్చెను. మఱియుఁ దత్ స్త్రీలకును గోరినప్రకారముగానే వస్త్రముల నొసంగెను. ధృతరాష్ట్రుఁడు మొదలగు శేషునిమంత్రులకును వారిభార్యలకును గావలసిన వస్త్రము



లను సమర్పించెను. ఇంకను నాగలోకములోనున్న నాగులకందఱకును యథేష్టముగా వస్త్రదానముచేసి వారిచే బహుమానపూర్వకముగా నీయఁబడిన యనేకములగు మణులు భూషణములు మొదలగువానిచే గౌరవింపఁబడినవాఁడై సంతోషించెను. తరువాతను శేషుఁడు దేవలునియందుఁ జాల గౌరవముగలిగి తనకూఁతును జంద్రరేఖయనుదాని నిచ్చి వివాహముచేసెను. తరువాత నాదేవలుఁడు శేషుఁ డిచ్చినరత్నములు మొదలగు కానుకలను స్వీకరించి యామించుబోడిని వెంటఁబెట్టుకొని భూలోకమునకు వచ్చెను. ఇట్లు మూఁడులోకములలో నుండువారి మానమును కాపాడి తనదేశములో నుండువారికిఁగూడ ననేకములగు వస్త్రముల నిచ్చెను. దేవలునిమంత్రులు బ్రాహ్మణులు రాజులు వైశ్యులు శూద్రులు మొదలగువారు తమరాజిచ్చిన వస్త్రములనుకట్టుకొని అపరిమితసంతోషమును బొందిరి. ఇట్లు దేవాంగుఁ డగుదేవలమహారాజు మూఁడులోకములవారికిని వస్త్రములనిచ్చి మానమును గాపాడి సంతోషించుచుఁ గీర్తివంతుఁడై సుఖముగా నుండెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములో బ్రహ్మ నారదసంవాదములోని దేవాంగచరిత్రములో దేవాంగమర్త్య పాతాళలోకవస్త్రప్రదానమన్నది తొమ్మిదవయధ్యాయము.

---

పదియవ యధ్యాయము.

సూతు——తరువాతను దేవలుఁ డమూల్యము లయిన దివ్యవస్త్రములను బట్టుకొని వెంటనే పరమేశ్వరుని జూచుటకై కైలాసమునకుఁ బోయెను. వర్ణనాతీత మయిన యాకైలాసపర్వతమును జూచి చాలసంతోషించి క్రమముగా బంగారుప్రాకారములు గలదియు, రత్నములతోఁ గట్టఁబడినగోపురములుగలదియు, ఆకాశమునంటుచుఁ జంద్రకాంతమణినిర్మిత మయిన మేడలుగలదియు, ధూపాదుల పరిమళముతో నిండియున్నదియు, కస్తూరిపూఁతలుగలదియు, సూర్యచంద్రాదులకాంతులఁ దిరస్కరించు కాంతులుగలదియు, నగునాశంకరుని దివ్యభవనమును జూచెను. ఆమందిరములోనున్న సేవాలయములో నదివఱకే యష్టదిక్పతులు, ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు,

అష్టవసువులు, సిద్ధులు, చారణులు, గంధర్వులు, విద్యాధరులు, ఉరగులు, కిన్నరులు, గరుడులు, యక్షులు, సనకాదిమునులు, సాధ్యులు, కింపురుషులు; అప్సరస్సంఘములు, కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, జాబాలి, జమదగ్ని, వసిష్ఠుఁడు,శుకుఁడు, హారీతుఁడు, వామదేవుఁడు, పరాశరుఁడు,కణ్వ కుత్స శతానందులు, శైబ్యగౌతమశక్తులు శాండిల్యుఁడు, చ్యవనుఁడు,ఉద్దాలకుఁడు, భృగువు, అగస్త్యుఁడు, పులస్త్యుఁడు,పులహుఁడు, మార్కండేయుఁడు, ఔర్వుఁడు, దుర్వాసుఁడు, విశ్వామిత్త్రుఁడు మొదలగువారిచే సేవింపఁబడుచుఁ బార్వతితోఁగూడ రత్నసింహాసనముపైఁగూర్చుండి నిండుకొలువున్న వెండికొండదొరను శంకరునిచూచెను. కుమారస్వామియు, విఘ్నేశ్వరుఁడు, వీరభద్రుఁడు, అనేకులు ప్రమథులు, వేత్రహస్తుఁడై నంది యాసభలోనుండి శంకరునియాజ్ఞను బరిపాలించుచుండిరి. ఇటువంటి శంకరభగవానునిఁజూచి దేవాంగుఁడగు దేవలుఁడు హర్షపులకాంచితశరీరుఁడై సాష్టాంగనమస్కారము చేసి యనేకవిధములుగా స్తుతిచేయ మొదలిడెను. దేవలుఁడు భక్తిపారవశ్యముచే ననేకవిధములుగా స్తుతిచేసియిట్లనియె. మహాదేవా! జగన్నాథా! నీయనుగ్రహమున వస్త్రములను నేసితిని. అనిచెప్పి విచిత్రములైన యనేకవస్త్రములు శంకరునికి సమర్పించెను. ఆవస్త్రములను జూచి శివుఁడు చాలసంతోషించి యాదేవాంగమునిని బ్రీతిగా నలంకరించి తరువాతను బార్వతియుఁ దానును వస్త్రములను గట్టుకొనిరి. ఇట్లు వస్త్రములను ధరించి పార్వతీపరమేశ్వరులు మిక్కిలిని సంతోషించి మరల నాదేవలమునిని భూషించిరి. తరువాతను గణపతిదగ్గఱ కేఁగి యాతనికి దివ్యమయినవస్త్రముల నిచ్చెను. భృంగిమొదలగువారికి వారువారుకోరినప్రకారము దివ్యాంబరము లిచ్చెను. పిదప నామోదపురాధిపతి యగు దేవాంగరాజు విలువగలవస్త్రముల స్వీకరించి శంకరునియాజ్ఞాప్రకార మంతఃపురములోనికిఁ బోయి మహాదేవియగు భద్రకాళికి రక్తాంబరము నిచ్చెను. కుమారస్వామి భార్యయగు దేవసేనకు తెల్లనివస్త్రము నిచ్చెను.తరువాతనుతెసయిష్టదేవతయగు చౌడేశ్వరికిదివ్యాంబరములీయనుత్సుకుఁడై యామెను భక్తిపూర్వకముగా స్మరించెను. ఆయంబయు భక్తపరాధీనురాలు గావున వెంటనే యతనికిఁ బ్రత్యక్షమయినది.



ఇట్లు ప్రత్యక్షమయిన యాదేవి ననేక విధములుగా స్తుతిచేసి చేతులు జోడించుకొని వినయముగా నిట్లనియె. అంబా! చౌడేశ్వరీ! శివా! శంకరీ! నీయనుగ్రహమువలన నేననేక విధములయిన వస్త్రములను సిద్ధముచేయఁ గలిగితిని. భక్తవత్సల వగునోదేవీ! మూఁడులోకములవారికిని యథేష్టముగా వస్త్రముల నిచ్చితిని. తల్లీ! దాసుఁడు నేసినవస్త్రములను నీవు ధరింపఁదగినదానవు. అని యాయంబకు దివ్యమయిన వస్త్రములిచ్చెను. ఆదేవాంగుని యందలిప్రీతిచే జౌడేశ్వరి వస్త్రములను ధరించి దేవలు నోదార్చి యచ్చటనే యంతర్ధాన మయినది.

మునులు—సూతా! మేము పార్వతియే చౌడేశ్వరి యనితలంచుచున్నాము. బుద్ధిమంతుఁడగు దేవలుఁ డీశ్వరసన్నిధిలోనే యామెకు వస్త్రముల నిచ్చినవాఁడుగదా మరల నేల యిప్పుడిచ్చెనో? పార్వతికిని జౌడేశ్వరికిని భేదమని యిపుడు మరలనిచ్చెనో లేక యామెయందుఁ దనకున్న భక్తిచే నిచ్చెనో మాకుసందియము గలుగుచున్నది. గనుక నీవు యథార్థమును జెప్పుము. అనవిని సూతుం డిట్లనియె. మునులారా! మీరన్నది నిజమే. దుర్గాచౌడేశ్వరులకు భేదమేలేదు. దేవాంగుఁడు తనకు వరములన్నిచ్చెనను భక్తిచేతను మరల నామెకు వేఱుగావస్త్రములనిచ్చెను. కాని యామె వేఱైన దనుబుద్ధిచే నీయలేదు. శంకరునికి భార్యగనుక శంకరియనిపించుకొన్నది. పార్వతియే చౌడేశ్వరి. చౌడేశ్వరియే పార్వతి. యథార్థ మాలోచింపఁగా వారియిద్దఱకును భేదమేలేదు. తరువాత నాదేవాంగుఁ డాపర్వతమునందున్న కన్నియలకందఱకును యథేష్టముగా వస్త్రములనిచ్చెను. మఱియు శివునిద్వారపాలకులగు చండప్రచండులకు రక్తాంబరమును శ్వేతాంబరమునునిచ్చి శివుని ధ్యానించి యాయనయనుమతిపై నిగొలువుకూటమునం బ్రవేశించెను. అప్పు డచ్చటఁ గృతస్థల; ఉర్వశి, రంభ, మేనక, పుంజికస్థల, తిలోత్తమమొదలయిన యప్సరసలు నాట్యముచేయుచుండిరి. వారంద్రు నాట్యముచేతను, అంగవిక్షేపములచేతను, భావబోధకములయిన పాటలచేతను, అభినయాదులచేతను శివునిసంతోషపఱిచిరి. శివుఁడు వారిద్రవివశయమై ప్రసన్నుఁడయి దివ్యాంబరము లీయఁదలఁచి దేవలునిమొగము వైపుచూడఁగానే యతఁడాయన యభిప్రాయమును దెలిసికొని దివ్యముల

24

యిన వస్త్రముల నంతలోనే సిద్ధముచేసియిచ్చెను. అట్టియద్భుతమైన పనిచూచి యింద్రాదులగు దేవతలందఱును మిక్కిలి యాశ్చర్యమును బొందిరి. మహాదేవుఁ డావస్త్రములనుదీసి యింద్రాదిదేవతలకును, ఋషులకును, గంధర్వులకును సిద్ధులకును నిచ్చి తరువాత నాసభలోనున్న సర్వాప్సరసలకును నిచ్చి సంతోషపెట్టెను. తరువాతను శివభగవానుఁడు సుచంద్రకమను ఖడ్గమును వృషభధ్వజమును దేవలునికీయఁగా భక్తిచేఁ బరిగ్రహించినయతనితో నిట్లనియె. దేవాంగా ! సర్వశత్రువులను సంహరింపఁగల యీధ్వజముచే ముల్లోకములయందును జయమును బొందెదవు. మఱియు నెల్లప్పుడు సుఖివై యుండుము. అప్పుడు దేవాంగముని స్వామిపలుకును శిరసావహించెను. తరువాతను శంకరుఁడు సూర్యునిజూచి యిట్లనియె. సూర్యుఁడా ! నీతోఁబుట్టువు దేవదత్తయను కన్య నీదేవాంగరాజున కిమ్మనఁగా సూర్యుఁడు సంతోషించి దేవా ! మాకును నట్లేకోరికయున్నది. ఆమెకు దగినవరుఁ డీతఁడేయని మేమును నిర్ణయించుకొంటిమి. తమదయవలన మాకోరినకోరిక పూర్తియగును. అని యిట్లు సూర్యుఁడు చెప్పఁగానే యాసభలోని వారందఱును సాధు ! సాధు ! అని యుగ్గడించిరి. తర్వాతను బార్వతియు నట్లేచేయుమని సూర్యున కాజ్ఞాపించినది. సూర్యుఁడు వల్లెయనెను. తనమాట నెరవేఱిచినందులకు శివుఁడును సంతోషించెను. ఇంద్రాదిదేవతలును సంతోషించిరి. ఇట్లు శివుఁడు రాక్షసులకుఁదక్కఁ దక్కినవారి కెల్లరకును వస్త్రములిచ్చి సభ చాలించి పార్వతితోఁగూడ నంతఃపురములోనికిఁబోయెను. తరువాత శివునిసేవింపవచ్చిన యింద్రాదులందఱును దమతమయిండ్లకుఁబోయిరి. దేవాంగుఁడును దనయామోదపట్టణమువైపు బయలుదేఱెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరిత్రములో
దేవాంగశంకరవస్త్రప్రదాన నంది ధ్వజసంపాదన
మన్నది పదియవ యధ్యాయము.

---

పదునొకండవ యధ్యాయము.

తరువాతను దేవలుఁడు కైలాసపర్వతమునుండి బయలుదేఱి యామోదపట్టణమునకు వచ్చుచు దారిలో నొక సరస్సును జూచెను.



అతఁడచ్చటశివపూజచేయుతలంపుతో స్నానముచేసెను. నిత్యకర్మములన్నియుఁ బూర్తిచేసికొని పద్మాదులగు పుష్పములచే స్వామినిబూజించి యతిభక్తిగాఁ బ్రార్థించుచుఁ దనపట్టణమునకుఁబోవ నుద్యుక్తుఁడాయెను. ఇంతలో సర్వవిమోహినియగురంభ సుందరుఁడగు దేవాంగుని బూర్వమునుండియు మోహించి యుండుటంజేసి సమయము కనుఁగొనుచుండెను. ఇన్నాళ్ళకు దానికంటి కేకాకిగా దేవలరాజగపడెను. సర్వాంగసుందరియగు రంభ కొంచెము పయ్యెదచెంగుజార్చి స్తనములను జూపుచు హావభావవిలాసములచే మోహింపఁ జేయుచు మందగమనముతో దేవాంగునియొద్దకు వచ్చినది. ఇట్లు వచ్చినరంభను జూచి దేవాంగుఁ డిట్లనియె. రంభా ! నీవెందులకు వచ్చితివో చెప్పుము. చెలికత్తెనైనను వెంటఁదీసికొనిరాకుండ నేకాకినివై వచ్చుటకుఁ గారణమేమి ? అని దేవలుఁ డడుగఁగా రంభ మోమువంచుకొని చిఱునగవు ముఖము నలంకరింపఁ బాదాంగుష్ఠముచే భూమిని గీయుచు నిట్లనియె. రాజేంద్రా ! దేవాంగమునీ ! నీవు మన్మథునితో సమానమైన యాకారము గలవాఁడవు. పూర్వమే వెండికొండయందు నిన్నుఁజూచి మోహించితిని. ఎంతమరల్చుకొందమన్నను నామనస్సు మరలకుండనున్నది. కావున నోదేవా ! నీవు నామనోరథమును దీర్పకతప్పదు. జాగు సేయకుము. నేనిఁక మరుబారిని సైపఁజాలను. అని యిట్లుచెప్ప రంభమాటలువిని చెవులుమూసికొని శివ శివా ! యని ప్రాజ్ఞుఁడును జితేంద్రియుఁడును గనుక దానితో నిట్లనియె. రంభా ! నీవును గొంచెము గొప్ప ప్రాజ్ఞురాలవు. నీవంటిది వచ్చి నన్నిట్లనఁగూడునా ! ఎట్లుచూచినను మావంటివారి కిటువంటిపని యోగ్యమయినదిగాదు. కావునఁ గామినీ ! నీకోరిక పూర్తిసేయుటకు సాధ్యపడదు. నేను విరాగినని యెఱుఁగవా ? అట్టి నన్నెందులకుఁ గోరితివి ? దేవాదులు నీకోరికను బూర్తిచేయువారు లేకపోయిరా ? కనుక వారి యొద్దకుఁబోయి సుఖమునుబొందుము. ! అంతియేకాని మాబోఁటివలన నీకేపాటిసంతోషము గలిగెడిని ? ఇటువంటిపనిచేసినచో మావంటివారికిఁ దేజోహానియు, కర్మలోపమును గలుగును. అదిగాక వేశ్యలతోడిసహవాసము సత్పురుషులకుఁ బాపమును గలిగించునది యందురు. అందఱచేతను నిందితురాలగువేశ్య చెడుస్వభావముగల వారిచేత



25

నే యనుభవింపఁ దగియుండును. కామవశంవదులై యుక్తాయుక్తములు తెలియక యోగ్యులును, అయోగ్యులునుగూడ భ్రాంతిచే వేశ్యలననుభవింతురు. అట్లనుభవించిన వారందఱును పాపాత్ములే యగుదురు. ఏమోయగుఁగాక. నీవు వేశ్యవుగనుక నిన్ను నేను విడిచితిని. నాచే నీ కేవిధమయిన ప్రయోజనమును లేదు కనుక నీయిష్టమువచ్చినచోటికిఁ బొమ్ము. నేనును వేగముగా నామోదపట్టణమునకుఁ బోవలసియున్నది. సుందరీ! నావలన నీమనోరథము నెఱవేఱదు గావున, నీవు తిన్నగా స్వర్గమునకుఁ బొమ్ము.

సూతు—ఇట్లు దేవాంగుఁడు చెప్పఁగానే యారంభ కోపము వినయమును దోఁప తలపంకించుచు నిట్లనియె. రాజేంద్రా! ఏ మట్లంటివి? బాగు బాగు! మంచిమాటయే చెప్పితివి. బుద్ధిమంతుఁడ వగుని విట్లనరాదు. నన్ను సాధారణస్త్రీని జూచినట్లు చూడఁదగదు. నేను రంభను. త్రిలోకసుందరిని. అట్టినేను నిన్ను మోహించి వచ్చితిని. అట్టినన్ను నీ విట్టిమాటలా అనఁబూనితివి? మహామతీ! నీవు గణికవు నిందితురాలవునని యేమేమో యంటివిగా! యథావిధిగా యజ్ఞములు చేసినవారికి నాసంభోగమే ఫలమని పుణ్యాత్ములగు ఋషులు చెప్పఁగా వినవె? మఱియు, వేదములయందును జెప్పఁబడియే యున్నది. ఇదియైనను వినలేదా? అందును విశేషముగాఁ బావనురాల నగునన్నుమాత్ర మవమానింపకుము. ముల్లోకములయందును నాతో సమానురాలయిన యందకత్తె లేదుసుమా! పరాశరుఁడు, అత్రి మొదలగుమహామునులుగూడ నా మొగము చూచి మోహాగ్రస్తులై తమతమ తపస్సులను బాడుచేసికొనిరి. వేయేలా? యెట్టిదృఢచిత్తులయినను నన్నుఁ జూచి మోహమును బొందకపోరు. జితేంద్రియులమని పేరుపొందిన మహామహులను యోగులను నిర్మలచిత్తులను నిర్మలజ్ఞానభూషణులను నేను నిరసించినదానసుజుమా! నన్నుఁ జూచినవారెట్టివారయినను విటశేఖరులు కాకతీరదు. అట్టి రూపవంతురాలను, పవిత్రురాలను, లోకసుందరిని నిన్నుఁ గోరివచ్చినదానను అగునన్ను నీ వేమి స్వీకరింపకున్నావు? ఎంతో పుణ్యము చేసిననే కాని నాసంభోగము లభింపదు. అట్టియనన్యదుర్లభను, నింధితురాలని తృణీకరింపఁజూచుచుంటివిగా. కోరివచ్చిన



దాన నని యవమానింపకుము. పురుషులలో జయంతుఁడు, రతిరాజు, వసంతుఁడు, నలకూబరుఁడును స్త్రీలలో నేనును జక్కనివారల మని పరిగణింపఁబడి యున్నాము. వారు నీలోఁ బదియాఱవవంతైనను జక్కఁదనముగలవారుగారని నాకుఁ దోఁచినది. కావుననే నిన్నుఁ జూచినది మొదలు నామనస్సు నీయందుఁ జిక్కుకొన్నది. నాకు స్వాధీనముగాకుండ నున్నది. ఎప్పుడు దేవాంగుని జూచెదను? ఎప్పుడతఁడు నామనోరథమును దీర్చును? అని యెదురుచూచుచుంటిని. రహస్యముగా నీముఖచంద్రు నెప్పుడు చూచెదను? నాకట్టిసమయ మెప్పుడు సమకూడును? అని యిట్లు నిన్నే చింతనచేయుచు నీమాటలే తలఁచుకొనుచు నెట్లో యింతకాలమును వెళ్ళించితిని. పండుకొన్నప్పుడుగాని నడుచుచుండునప్పుడుగాని కూర్చుండునపుడుగాని మాటలాడునపుడుగాని మఱి యేవిధమయిన పనులు చేయునపుడుగాని నిన్ను మఱవలేదు. నిన్నుఁ జూచినదే మొదలు మన్మథుఁడు రాత్రింబవళ్ళు నన్ను మిక్కిలిని బాధించుచున్నాఁడు. వాని బాణములు పూవులనుమాటమాత్రమే. కాని యవి యగ్నిగుళికలని తోఁచుచున్నది. అవి తగులుటయే మొదలు నాదేహ మంతయు జ్వరితమయి యున్నది. మహాప్రభూ! నన్నా మన్మథచండాలుని బాణములకు గుఱి సేయకుము. నాయందు దయ యుంచి వెంటనే నాతాపమును జల్లార్పుము. నీయధరామృతము ద్రావనిమ్ము. నాయంతస్తాపము తీఱును. నేనిట్లు యాచించుచుండఁగా నిరాకరించుట తగదు. దయానిధీ! స్త్రీని బాధించుటయే మంచిదని యెంచితివా? నీయధరపల్లవముగ గాఢాలింగనము దయచేయుము. ఆహా! నీమనస్సు వజ్రముచేఁ జేయఁబడినదియా? కావుననే నే నింతగా బ్రతిమాలుకొనుచున్నను కరఁగకుండ నున్నది. మూఁగవలె మాటలాడవేమి? త్రిలోకసుందరి యనిపించుకొన్న రంభ వచ్చి నిన్నింతగా బ్రతిమాలుట? అవునని కాని కాదని కాని పలుకరాదా? అందునకును యోగ్యత లేదా? పోనిమ్ము. పొమ్మని చెప్పినచోఁ బోవుదును. అని రచమి దీనదీనముగా యాచించుచున్నరంభను జూచి నవ్వుచు దేవాంగనతరుఁడిట్లనియె. సుందరీ! నేను మొదటనే చెప్పితిని. నే నిటువంటివాని చె అని పల నంటిని. ఈదేహము మలమూత్రనిధానము. మిక్కిలి నిందితము నశ్వరము. బహురోగపూరితము. ఇట్టి దేహమునకు

స్థిరమయినసుఖ మెక్కడిది ? తెలివిగలవాఁ డెవఁడయినను నిట్టితుచ్ఛభోగముల కాసించునా ? ఆసించునుపో ! మతింత పాపమే సంభవించును గాని యేమిలాభ మున్నది ? కావున దప్పక విడుచుకోఁ దగినదియే కాని యంగీకరింపఁ దగినది కాదు. ఏమూఢుఁడు తనస్త్రీని విడిచి యితరస్త్రీలను గామించునో వానిపుణ్యము లన్నియు నశించును. అన్యస్త్రీలను గోరువాఁడు ఘోరములగు నరకముల ననుభవించును. బుద్ధితక్కువవాఁడై మతిచలనముచేతను పరస్త్రీలను గౌగిలించుకొన్నచో యమకింకరులచే మిక్కిలిగా బాధింపఁబడుచుండును. అట్టివానిచేఁ గాల్చిన యినుప ప్రతిమను గౌగిలింపఁజేతురు. మోహముచే నెవఁడు పరస్త్రీహస్తమును స్వీకరించునో వానిని తేళ్ళగోతులోఁ బడఁద్రోయుదురు. పరస్త్రీలను ముద్దుపెట్టుకొన్న దుర్మార్గునిచే విషపూర్ణములయిన పాములను ముద్దులాడింతురు. కామమోహితుఁ డయి యెవఁడు పరస్త్రీని జూచునో వానికన్నులు సూదులతోఁ బొడుతురు. వేయేల ? పరస్త్రీప్రసంగముచేతను పాపము వృద్ధి యగును. అన్నిపాపములలోను పరస్త్రీగమనము వలనఁ గలిగినపాపము గొప్పది. దేనికయినను ప్రాయశ్చిత్త మున్నది గాని పరస్త్రీగమనపాపమునకుఁ బ్రాయశ్చిత్తమే లేదు. కావున నే నిటువంటిపాపపుఁబని కంగీకరింపను. నే నట్టిదానను, ఇట్టిదానను, నాభోగము నటువంటివారు, ఇటువంటివారు గోరుదురు అని యేమేమో వ్యాఖ్యానము చేయుచున్నావు. కాని యాలోచింపఁగా నది యంతబాగుగా లేదు. ప్రీతిగాఁ జూచినను జెడ్డది యే యగునీదేహమునకు మురిపియనఁగా నేమున్నది ? దేహమే నిత్యము గానప్పుడు నీవంటిదానిభోగముమాత్ర మెట్లు నిత్య మగును ? నీచే భంగపడినవారితో నా కెట్లుసామ్యము చెప్పవచ్చును. ఎవరియిష్టము వారిది. తాముతాము చేసికొన్నపుణ్యములో పాపములో తామే యనుభవింతురు. కావున నొకరు చేసిరిగదా యని మతొకరు చేయరాదు. నీతోఁ బెక్కుమాట లాడనేల ? మూఢురాలగాఁ జెప్పినను నేను విననని నీయిచ్చకు వచ్చినమచ్చునఁ బొమ్మంకరించిని యిట్లు దేవాంగమహాముని నిరాకరించినతోడనే యారంభ యదు శోకపరీతచిత్తురాలై యతని నిందించుచు నిట్లనియె. ఛీ ! మూఢుఁడా ! ఇంతకఠిన



చిత్తుఁడ వని యనుకోనైతిని. నీనిత్యానిత్యవివేకము కాల్పనా ? నీజ్ఞాన మెందుల కుపయోగించును ? నీవు నిజముగా బురుషుఁడవేనా ? ఇట్టి నీరసహృదయమునకు నావంటిదానిభోగ మెట్లబ్బఁగలదు ? ఎంతో రసికశేఖరుఁ డైననే కాని యెంతో పుణ్యము చేసిననే కాని నాపొందు దొరకదు. నీవు వట్టిబుద్ధితక్కువవాఁడ వనియు నీరసుఁడ వనియు నిపుడు దెలిసికొంటిని. నే నింత దైన్యముగా బ్రతిమాలుకొన్నను నన్ను గ్రహింపక పోతివిగదా ! కావున నీవు శత్రువులచేఁ జిక్కి దైన్యమును బొందెదవుగాక. వారు నిన్ను బంధింతురుగాక. దుర్బుద్ధీ! నే నిచ్చినశాపము నీ కమోఘ మగుఁగాక. నీపౌరుష మంతయు నెందులకును బనికి రాకుండఁ బోవునుగాక. నీవిటుపయి నయిదువేలసంవత్సరములు శూద్రుఁడ వయిపోవుదువుగాక. అటుపయిని మరల బ్రాహ్మణుఁడ వగుదువు. అని యిట్లు శపించి రంభ యతనిని విడిచి పోయినది. తరువాతను దేవాంగుఁడును గొంతవడుకుఁ జింతించి చేయునది లేక " యీశ్వరాజ్ఞ యిది " యని నిశ్చయించుకొని తనపట్టణమువైపు బయలుదేఱెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములో దేవాంగచరితమున దేవాంగునికి రంభాశాపప్రదాన మన్నది పదునొకొండవ యధ్యాయము.

---

## పండ్రెండవ అధ్యాయము.

తరువాతను సూర్యుఁడు తనచెలియలికి వివాహము చేయ నిశ్చయించుకొన్నవాఁడై బ్రహ్మయొద్దకుఁ బోయి యిట్లనియె. దేవా ! దేవదత్త యనుపేరుగల నాచెల్లెలిని దేవాంగుని కిచ్చి వివాహము చేయ నిశ్చయించితిని. కావున నీసిద్ధాంతప్రకారముగా మంచిముహూర్తము నాలోచించి చెప్పుము. నీవు మాకుఁ బ్రభువవుగదా ! అని చెప్పిన సూర్యుని జూచి బ్రహ్మ యిట్లనియె. ఓ సూర్యుఁడా ! నేఁటి కెనిమిదవనాఁడు వైశాఖశుక్ల పంచమీదినమున సోమవారమునాఁడు రాత్రి యేడుగడియలు దాటినతరువాతను ధనుర్లగ్నమున వివాహము చేసినచో శుభావహ మగును. అని బ్రహ్మ చెప్పఁగానే మంచిదే యని యంగీకరించి దేవరా ! తాము సపరివారముగ వివాహమునకుఁ దప్పక దయచేయవల

27

య నని చెప్పి యచ్చటినుండి కైలాసమునకుఁ బోయి శంకరునితో నిట్లనియె. మహాదేవా! తమయనుమతిని శిరసావహించి మాచెల్లెలిని దేవాంగమహారాజున కిచ్చి పెండ్లి చేయ నిశ్చయించితిని. రాఁబోవుపంచమీనాదినమున వివాహము గనుక మీరు దంపతులు సపరివారముగా దయచేసి వివాహమహోత్సవము యథావిధిగా జరపించి వధూవరులను దీవించి నన్నానందింపఁజేయుదురుగాక. అనఁగానే వారు మంచిదే యనిరి. తరువాత సూర్యుఁడు కుమారస్వామిని వీరభద్రుని నందిని మఱియు మిగిలినప్రమథులను బ్రయత్నపూర్వకముగాఁ బిలిచి యచ్చటినుండి తిన్నఁగా శ్వేతద్వీపమునకుఁ బోయెను. అట్లు పోయి విష్ణుమూర్తిని జూచి యిట్లనియె. నారాయణా! రాఁబోవుపంచమీసోమవారమునాఁడు నా చెల్లెలు దేవదత్తను దేవాంగుని కిచ్చి వివాహము చేయుటకుఁ బెద్దలచే నిర్ణయింపఁబడినది గనుక మీరు దంపతులు సపరివారముగా దయచేసి వివాహమహోత్సవము యథావిధిగా జరిపించి వధూవరుల నాశీర్వదించి నన్నానందింపఁజేయునది యనఁగానే యాయనయు నంగీకరించెను. తరువాతను లక్ష్మీదేవిని భూమిని పరివారమును వేఱువేఱుగా నాహ్వానించి యక్కడనుండి స్వర్గము ప్రవేశించి శచీసహితుఁడయిన యింద్రుని మిగిలిన దేవతలను బిలిచెను. జయంతుఁడు మొదలగువారిని మిగిలిన దేవతులనుగూడఁ క్షేమపూర్వకముగా వివాహమహోత్సవమునకుఁ దప్పక రావలసిన దని కోరెను. మఱియు నచ్చట నున్నబ్రహ్మర్షులను, దేవర్షులను, ఆదిత్యులను, రుద్రులను, గంధర్వులను మిగిలిన దేవయోని విశేషులను బిలిచి తనలోకమునకు వచ్చెను. నందుఁడు, ఉపనందుఁడును నువా రిద్దఱు సూర్యునిమంత్రులు గలరు. వారు సూర్యునియాజ్ఞవలన దిక్పతులు మొదలగు నందఱను బిలిచి యాసంగతి సూర్యునితోఁ జెప్పిరి. అంత నక్కడ దేవాంగుఁడు సుబుద్ధి కార్యదక్షుఁడు ననుతన మంత్రులను బిలిచి యిట్లనియె. ఓ మంత్రులారా! మీరిద్దఱును సూర్యునియొద్దకుఁ బోయి వివాహలగ్న మెప్పుడు నిర్ణయింపఁబడినదో తెలిసికొని వేగముగ రండు అని చెప్పఁగానే వారును సూర్యునిదగ్గఱకు బయలుదేఱిరి. త్రోవలో మంచిశకునములు కనుపడినవి. వారు రాఁగానే సూర్యుఁడు తగురీతిని గౌరవించెను. వారు ముగ్గురును వివాహమునుగూర్చి



మాటలాడుకొనిరి. సూర్యుఁడు బ్రహ్మచే నిర్ణయింపఁబడిన ముహూర్తమునంగతి యంతయుఁ జెప్పెను. ఆమాట విని మంత్రులు వేగముగాఁ దమరాజుతో నాసంగతి చెప్పటకై యామోదపట్టణమువచ్చిరి. తాము వెళ్ళినపని యంతయుఁ దమరాజుతోఁ జెప్పిరి. తరువాత నక్కడ సూర్యుఁడు తనమంత్రియైన వీరమార్తాండునితో నిట్లనియె. ఓయీ వీరమార్తాండా! నీవు శీఘ్రముగా నామోదపట్టణమునకుఁ బోయి నేఁటికి మూఁడవనాఁడు పంచమీసోమవారమున వివాహముహూర్తమని దేవలునితోఁ జెప్పి యతనిని సపరివారముగాఁ దోడుకొని రమ్ము. అనఁగానే మంత్రి చతురంగబలముతోఁ గూడి యామోదపట్టణమునకుఁ బోయెను. సూర్యునిమంత్రి వచ్చి యున్నాఁ డన్న సంగతి విని దేవాంగుఁడు తనమంత్రులను బిలిచి యెదుర్కొనుటకుఁ బంపెను. వారును వేగముగా వాద్యఘోషపురస్సరముగాఁ బోయి యెదుర్కొని వీరమార్తాండుని బట్టణములోనికిఁ దీసికొనివచ్చెను. క్రమముగ నతఁడు దేవాంగునియంతఃపురములోనికిఁ దగుసత్కారముతోఁ బోయి దేవాంగునితో నిట్లనియె. రాజా! నేఁటికి మూఁడవనాఁడు పంచమీసోమవారమున వివాహముహూర్తము నిర్ణయింపఁబడినది గనుక నాతోఁగూడ సపరివారముగా బయలుదేఱి రమ్ము. అని చెప్పి యతనిమంత్రుల నందఱను వేఱువేఱుగాఁ బిలిచి యందఱమును గలసియే వెళ్ళుద మని యనుచున్న వీరమార్తాండుని జూచి దేవాంగుఁ డిట్లనియె. మహాభాగా! నీ విప్పుడు వెళ్ళుము. రేపు తెల్లవాఱు జామున బయలుదేఱి మేమందఱమును వచ్చెదము. అనఁగానే యతఁడు మంచిదే యని యింటికిఁ బోయి వృత్తాంత మంతయు సూర్యునితోఁ జెప్పెను. తరువాతను సూర్యుఁడు విశ్వకర్మదగ్గఱకుఁ బోయి “మామా! మా దేవదత్తకు వివాహము తటస్థించినది గనుక వేగముగాఁ గల్యాణమంటపము సిద్ధముచేసి యిమ్ము.” అని చెప్పఁగానే యతఁడు శుభకరమయిన వివాహమంటపము సిద్ధముచేసి యిచ్చెను. అది హేమప్రాకారనిలయము. పగడముల స్తంభములతో శోభితము. వజ్రపు పలకలతోఁ గప్పఁబడినది. మఱియు మంచిపుష్పజాలతోఁ బనివాని తనమంతయుఁ జూపి సిద్ధముచేయఁబడినది. మఱియు రత్నాలవలభులు, పుష్పరాగములతలుపులు గలిగి వివిధరత్నములచే స్థగితమయి యనేక

మంచసంకీర్ణమయి బలుద్వారములతోఁ గూడి యద్వితీయముగా శోభించునట్లు చేయఁబడినది. ఆమంటపము సుమారుగా నొకయోజనము వెడల్పుగల్గునట్లుగా నిర్మింపఁబడినది. దానిమధ్యమున ముత్యాలతో నొకమంటపమును నిర్మించెను. దానిక్రిందను నలుపలకలుగా నొకయరుగు కట్టెను. వధూవరుల నిమిత్తమయి దానియందు రెండుపీఠములు కల్పించెను. మఱియు బ్రాహ్మణులకొఱకు నెన్నో పీఠములు నిర్మించెను. అంతటను నానారత్న వినిర్మితములయిన సింహాసనములు ఉన్నతములు హ్రస్వములునయి యుండునవి కల్పించెను. ఈరీతిగాఁ దనపనివానితన మంతయుఁ జూపి చేసినమంటపమును దెచ్చి విశ్వకర్మ తనయల్లుఁడగు సూర్యునికి సమర్పించెను. దానిని జూచి సూర్యుఁడును జాల స్తుతిజేసెను. తరువాతను దేవాంగుఁడు కైలాసమునకుఁబోయి తనవివాహమునకు(బ్రి?)భువగు శంకరభగవానుని బిలిచి శ్వేతద్వీపమునకుఁబోయి విష్ణుని బిల్చి యచ్చటనుండి స్వర్గమునకుఁబోయి యింద్రుని బ్రహ్మను దిక్పాలురను వివాహార్థము వచ్చుటకై ప్రార్థించెను. మఱియు భూలోకములోనుండు రాజులను మంత్రులను సపరివారముగాఁ బిలిచెను. తరువాతను దేవాంగుఁడు తెల్లవాఱుజామునఁ జతురంగబలసమేతముగా బ్రాహ్మణులను పురోహితులను బురస్కరించుకొని మంగళవాద్య ఘోషములతో వందిమాగధులు స్తుతిచేయుచుండఁగాఁ బయలుదేఱి సూర్యలోకమునకుఁ బోయెను. తరువాతను బ్రహ్మాదిదేవతలు శివుఁడు ప్రమథగణములు విష్ణువుమొదలగు భాగవతులును దేవలునివివాహము చూచుచుటకై సంతోషముతో సూర్యలోకమునకు వచ్చిరి. తరువాతను మహాతేజశ్శాలి యగుసూర్యుఁడు దేవతలయందఱ యెదుటకును దేవదత్తను దీసికొనివచ్చి దేవాంగుని కిచ్చెను. త్రిలోకసుందరి యగునాబాల ముల్లోకములను మోహింపఁజేయుచు నుండెను. మఱియు నామె సర్వాంగసుందరి యగుటచే బ్రహ్మప్రయత్న పూర్వముగా సృజించిన ట్లున్నది. శచీదేవి యింద్రునకుంబలె నామె దేవాంగునకుఁ దగి యున్నది. తరువాత నాదేవలమహారాజు బ్రహ్మ మొదలగు దేవతలసమక్షమున నామెకంఠమునందు మంగళసూత్రమును గట్టెను. బ్రాహ్మణులు మంత్రములు చదువుచు నక్షతారోపణము చేసిరి. సువా



సినులు మంగళగానములు పాడుచు నీరాజనము పట్టిరి. ఇంద్రునియాజ్ఞచేతను కల్పవృక్షము కామధేనువు చింతామణి యందఱకును భోజనమును సమకూర్చినవి. ఈరీతిగా నాలుగుదినములు వివాహమహోత్సవము జరిగినది. తరువాతను దేవాంగరాజు సంతోషించుచు నుత్సవోపయోగములయిన దివ్యవస్త్రములను ముందుగాఁ బార్వతీపరమేశ్వరుల కిచ్చెను. తరువాత బ్రహ్మ విష్ణువు మొదలగు ముఖ్యదేవతల కిచ్చి యనంతరము పెండ్లికి వచ్చినవారందఱకును వారివారి యోగ్యతకుఁ దగినవస్త్రముల నిచ్చెను. పిమ్మట నొకదివ్యాంబరమును భైరవున కీయఁబోఁగా నతఁడు పుచ్చుకొనక మిక్కిలి కోపించి శిరస్సు కంపించుచు దేవలున కిట్లనియె. రాజా! యింతసేపటికా నేను నీ కగపడితిని? అందఱకును ముందుగా వస్త్రము లిచ్చి తరువాతను గద్దా మిగిలినగుడ్డముక్క నా కీయ వచ్చితివి. మొదటనే నా కీయవలదా? నే నిపుడు పుచ్చుకోను. దత్తశేషము నాకుఁ దగదు. అని యతఁడు తన కిచ్చినవస్త్రమును జింపి జమ్మిచెట్టుపైని పడవైచి నాకు దివ్యమయినవస్త్ర మింకొకటి యిమ్మనెను. అది విని దేవాంగుఁడు "నే నిచ్చినవస్త్రము నీరీతిగాఁ జేసితివి గావున మఱి నీ కీయఁగూడదు. నీయిష్టము వచ్చినచోటికిఁ బొమ్ము." అనఁగానే దుష్టాత్ముఁడగు భైరవుఁడు పరమేశ్వరునియొద్దకుఁ బోయి యాయనకు నమస్కరించి యిట్లనియె. దేవా! దేవాంగుఁ డందఱకును వస్త్రము లిచ్చి నన్ను మఱచిపోయి తుదకు మిగిలినది నాకీయ వచ్చెను. అని చెప్పఁగానే శివుఁడు దేవాంగుని జూచి వీనికి స్వచ్ఛమయిన దివ్యవస్త్ర మిమ్మనెను. అప్పుడు దేవాంగుఁడు శివునకు నమస్కరించి దేవా! నేను దివ్యవస్త్రము నీయఁగా దానిని జింపి జమ్మిపైని వైచియున్నాఁడు. చిత్తగింపుఁ డనఁగానే భైరవుఁ డీశ్వరునివంకఁ జూచి "అయ్యా! అతఁ డిచ్చినవస్త్రమును నేను గోపించి చింపి జమ్మిచెట్టుమీఁదను వైచినను నాకు మంచివస్త్ర మీయకపోయెను." అని యనుచున్న భైరవునిజూచి శివుఁడు "నీవు కోపించి యిట్లు చేసితివి గనుక నెప్పుడును జమ్మిక్రిందనే యుండుము" అని వానిని శపించెను.

తరువాత సూర్యుఁడు తనచెల్లెలగు దేవదత్తకును మఱిదికిని వెక్కుమదపుటేనుఁగులను గుఱ్ఱములను రథములను, ఆభరణములను



29

దాసీదాసజనమ్మును గానుకగా నిచ్చెను. వివాహము పూర్తికాఁగానే బ్రహ్మాదిదేవత లందఱును దమతమమందిరములకుఁ బోయిరి. దేవాంగమహారాజును దనభార్యను బరివారమును వెంటఁబెట్టుకొని ఛాయాదేవియొద్దను సూర్యునియొద్దను సెలవు పుచ్చుకొని యామోదపట్టణమునకు వచ్చి యెప్పటియట్లు సంతోషముగలుగునట్లు ప్రజలనందఱను బరిపాలించుచు దేవదత్తయను భార్యంగూడి యింద్రుఁడు శచీదేవితో బలెనే చిరకాలము సర్వసుఖముల ననుభవించుచుండెను. ఎవఁడు భక్తిశ్రద్ధాతాత్పర్యములతో నీదేవాంగమహారాజువివాహవృత్తాంతమును వినునో చదువునో వినిపించునో యతఁడు సకలమనోరథములను బొందును. మఱియు నీదేవాంగమహారాజుయొక్క వివాహకథను జదివినపుడు వస్త్రములను మంగళసూత్రమును దానము చేసినవారికి శివునియనుగ్రహము వలన నెల్లసుఖములును గలుగును.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమున దేవాంగుని వివాహమన్నది పండ్రెండవ యధ్యాయము.

---

## పదుమూఁడవ యధ్యాయము.

సూతు — మునులారా! తరువాతను దేవాంగుఁడు యథావిధిగాఁ బ్రజలను పాలించుచుండెను. అతఁ డింద్రుఁ డమరావతిని బాలించునట్లు పాలించుచుండఁగాఁ బ్రజలందఱును గడుపునఁ బుట్టినబిడ్డలవలె సంతోషించుచుండిరి. ప్రజలు నానాఁటికి వృద్ధి నొందుచుండిరి. భూమి ఫలవంత మయినది. గుణవంతుఁడగు పెనిమిటి దొరకినప్పుడు స్త్రీ సంతోషించునట్లు భూమి సంతోషించుచుండెను. కాలము తప్పక వానలు కురియుచుండెను. ఏజంతువునకును బీడలేదు. ప్రజలు విద్యావినయసంపన్నులైరి. బ్రాహ్మణాదులు తమతమవర్ణధర్మముల నాచరించుచుండిరి. అందఱును మంచివారు. గోపోషణమం దాసక్తులు. సదాచారతత్పరులు. పురాణములయం దాసక్తి గలవారు. అందఱికిని జ్ఞానమునం దభిలాష యెక్కుడాయెను. మఱియు నాతనిరాజ్యమందుదుర్మార్గులు, దుఃఖితులు, దరిద్రులు, కుంటివాండ్రు, గ్రుడ్డివాండ్రు, రోగులు, గొడ్డువాండ్రు మొదలగునింద్యులు లేరు. పిన్నలకుఁ బెద్దలు ఉత్తరక్రియలు చేయునవసరము



తటస్థింపలేదు. పతివ్రతాధర్మము బాగుగా నుండెను. ఎక్కడఁ జూచినను కలహమనుమాటయే లేదు. మత్సరము లేదు. లోభితన మెట్టిదో అతనిప్రజలకుఁ దెలియదు. ఆకస్మికభయాదులు లేనేలేవు. అందఱును సంతోషించుచు నన్యోన్యప్రేమగా నుండెడివారు. ఇట్లు సర్వానందకరముగా రాజ్య మేలుకొనుచుండఁగా నాదేవాంగమహారాజునకు దివ్యాంగుఁడు, విమలాంగుఁడు, ధవళాంగుఁడు నను ముగ్గురు కొడుకులు పుట్టి యగ్నిహోత్రత్రయమువలె వారు పెరుఁగుచుండిరి. తలిదండ్రులు లాకొడుకులచేఁ జాల సంతోషమును బొందుచుండిరి. దేవాంగుఁడు సకాలమున వారికి జాతకర్మాదిక్రియలు నిర్వర్తించుచుండెను. వారు సర్వవిద్యలును నేర్చుకొనిరి. ధర్మాసక్తులు; వారుక్రమముగా యౌవనవంతులయిరి. వారికి మేనమామయగు సూర్యునికుమారితలను స్వర్ణప్రభ, పద్మాక్షి, చపలాక్షి యనుబాలికలను దెచ్చి తండ్రి వివాహములు చేసెను. దేవాంగుఁడును దేవదత్తయును కుమారులను గోడండ్రను జూచుకొని చాల సంతోషించుచుండిరి. తరువాతను దేవాంగుఁడు పెద్దకుమారుఁడగు దివ్యాంగునికి యౌవరాజ్యపట్టాభిషేకము చేసెను. అతఁడు బుద్ధిమంతుఁడు గనుక మంత్రులతోఁగూడి యథావిధిగా రాజ్య మేలుచుండెను.

మునులారా! దేవాంగుఁడు శేషునికూఁతురగు చంద్రరేఖయందు సర్వలక్షణసంపన్నుఁడును ధర్మాత్ముఁడును మహాబలుఁడును నగుసుధర్ముఁడనుపేరుగల కుమారుని గనెను. అతఁడు శుక్లపక్షపుచంద్రునివలె వృద్ధినొందుచుండెను. తరువాతను కరూశదేశాధిపతి యగు శూరసేనుఁడు గర్వించి దేవాంగునిరాజ్య మంతయు క్షోభింపఁజేసెను. వాఁడు చేసిన యపకారముసంగతి యంతయుఁ దెలిసికొని తనపరాక్రమముచే వానిని రణరంగమునకు బలి యిచ్చి ధర్మవర్ధనుం డగు తనకుమారుని సుధర్ముఁడనువానిని వానిరాజ్యమున స్థాపించెను. ఆకుమారుఁడును పుండరీకపురమునం దభిషిక్తుఁడై తండ్రివలెనే ధర్మముగాఁ బాలించుచుండెను. తరువాతను కరూశాధిపతి యగుసుధర్ముఁ డనువాని కవంతిరాజుకూఁతును పుష్కల యనుదానిని దెచ్చి దేవాంగుఁడు పెండ్లిచేసెను. నిర్వక్రపరాక్రమనిధి యగుసుధర్ముఁ డాసుందరితోఁగూడి సర్వభోగముల ననుభవించుచు యథాన్యాయముగా రాజ్య మేలుకొనుచుండెను. దేవాంగుఁడును

దక్షిణపుత్త్రులతోఁగూడి తనరాజ్యమును పరిపాలించుకొనుచుండెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమున దేవాంగరాజ్యపరిపాలనమన్నది పదుమూఁడవ యధ్యాయము.

---

## పదునాల్గవ యధ్యాయము.

ఇట్లుండఁగా రాక్షసులు దేవగంధర్వాదు లందఱును దివ్యవస్త్రములను గట్టుకొని తమ్మును నవ్వుట చూచి వారందఱును దేవాదులనటువఁడి యంతయుఁ దమప్రభువగు వజ్రదంష్ట్రునితోఁ జెప్పిరి. పూర్వవైరముచేత దేవతలశ్రేయస్సును సైఁపజాలక యావజ్రదంష్ట్రుఁడు కోపించి యింద్రాదిదేవతల నందఱను జయించి శత్రువులు లేకుండఁ దానే ముల్లోకములను బాలించుచుండెదనుగాక యని తలంచి యాదుర్బుద్ధి తనతమ్ములను వ్యాఘ్రవక్త్రుఁడు, సర్పజిహ్వుఁడు ననువారిని బిలిచి యిట్లనియె. తమ్ములారా! వింటిరిగదా! దేవతలపొంగు. దివ్యవస్త్రములచేత నలంకరించుకొని గర్వించి తిరుగుచున్నారఁట! మీఁదుమిక్కిలి వస్త్రములు లేవని మనలను నవ్వుచున్నారఁట! వారికి దేవాంగుఁడు వస్త్రములు నేసి యిచ్చువాఁడఁట! వాఁడును వారినే యనుసరించియున్నాఁడఁట! వాఁడు ముల్లోకములవారికిని వలసినట్లు దివ్యవస్త్రములను నేసి యిచ్చియు మనకొక్కరికిని వస్త్రము లీయకపోయెను. చూచితిరిగదా! వానిపొగరుఁబోతుతనము! పోనిండు. దేవాలయములోనున్నప్పుడు శంకరుఁడును వస్త్రము లందఱకును నిచ్చి మన కిచ్చుట మానినాఁడు. దేవతలు వస్త్రములచే నలంకృతు లయి యుండుట చూచినదగ్గఱనుండియు నామనస్సు మిక్కిలి పట్టుదల గలదై యున్నది. ఇంత బలవంతుల మయ్యును చేతఁగానియట్లు వాండ్రు వేళాకోళములు చేయుచుండఁగా సహించి యుంటిమి. ఇంతకంటె నేమికావలయును? కనుక మనమిపుడు దేవతలను వినాశమును బొందింతము. ఇంద్రుని జయించి స్వర్గమునుండి గెంటివైచి శత్రుమాత్రము లేకుండ మనము ముల్లోకముల నేలుకొందము. అట్లు చేసితిమేని వైభవ మంతయు మనదియే యగును. అనియిట్లు చెప్పినయన్నమాటలువిని తమ్ము లిట్లనిరి. అన్నా! నీవన్నమాట సత్యమే. నిస్సంశయముగా దేవతలు మనలను నవ్వుచునే



యున్నారు. ఇఁక నీవు చెప్పినరెండవసంగతిమాత్రము కష్టసాధ్య మని తోఁచుచున్నది. ఏమనఁగా మనము పరాక్రమించినతోడనే యింద్రుఁడోడిపోయినచో నాసంగతివిని విష్ణుమూర్తి చక్రము పట్టుకొని వచ్చును. ఆవిష్ణుమూర్తిని మనము జయింపఁజాలము. ఒక్కవిష్ణుని దక్క దక్కినవారి నోర్వఁగలము గాని వానితోమాత్రము యుద్ధము చేయనోపము. అని యిట్లు చెప్పిన తమ్ములమాటలు విని యాలోచనాపూర్వకముగా నన్న యిట్లనియె. తమ్ములారా! మీరు మొదటినుండియు విష్ణుమూర్తికి భయపడుచునే యున్నారు. ఏమయినను సరియే. మనలను నవ్వుచున్న యింద్రాదిదేవతలనుమాత్రము యుద్ధరంగమునందుఁ బీడించి పదిదిక్కులకును బరుగులెత్తునట్లు చేయుదము. అట్లు చేసితిమేని మనలను నవ్విననందులకు శిక్ష యగును. నామనోరథమును బూర్తి యగును. దేవతల నెట్లయినను జయింపవలయు ననియే నామతము. ఇంద్రాదులను ముందుగాఁ బీడించి మనోరథమును బూర్తి చేసికొందము. పయినిజిష్ణుఁడో విష్ణువో వచ్చుఁగాక. చూతము. అంతగా వచ్చినప్పు డప్పటిసంగతి యాలోచించుకొందము. ఒకవేళ మీకు విష్ణునివలన నంతగా భయ మున్నచో నింతకు శివునిగూర్చి తపస్సు చేయుదము. ఆయన కరుణించి వరముల నిచ్చును. తరువాతనే యింద్రాదులను జయింతము. మనకు వారివలనఁ గలిగినయపమానమును దీర్చుకొందము. కావున మనము ముందుగాఁ దపస్సునకుఁ బోవలయునని నామతము. మీయుద్దేశముగూడఁ జెప్పుఁడని యనఁగానే వారిద్దఱునుగూడ నంగీకరించిరి. ఆముగ్గురన్నదమ్ములును నిర్జనప్రదేశమునకుఁ బోయి ఘోరములయిన నియమముల నవలంబించి తమశరీరములను దపస్సునే గృశింపఁజేసికొనుచుండిరి. తరువాతను శివుఁడు ప్రత్యక్షమయి యిట్లనియె. రాక్షసులారా! మీతపస్సులకు మెచ్చితిని మీకుఁగావలసినవరము లడుగుఁడు. ఇచ్చెదను. అని శంకరుఁ డనఁగానే యారాక్షసులు ముగ్గురును దురదృష్టవంతు లగుటంజేసి యిట్లని యడిగిరి. దేవా! మాతపస్సులకు మెచ్చితివేని లోకములో నెచటను సూర్యుని వెలుఁగు లేకుండఁ బోవునట్లు వరమిమ్ము. ఇదియే మాకోరిక. దీని మనబూర్తి చేయుము. అని యడిగినవారిమాటలు విని శంభుఁ డిట్లనియె. రాక్షసులారా! మీరు కోరినవర మీయరానిది. మఱొకవరము

కొనుఁడు. సూర్యుఁడు త్రిమూర్తిస్వరూపుఁడు. సర్వదేవతాస్వరూపుఁడు. జగత్తులకుఁ గన్ను. కర్మములకు సాక్షి. అతఁడే కర్తయు ధర్తయు హర్తయు నయి రక్షించుచుండును. సుకృత మొనరించినవారి కతఁడే స్థానము. అతఁ డుదయించిననే యన్ని కర్మములును జేయఁబడుచుండును. మఱియు నందఱును మేలుకొందురు. అతఁ డస్తమించినతోడనే యందఱును నిదురింతురు. అట్టిసూర్యునియుదయమే లేక యున్నచో లోకము సంగతి యేమగు ననుకొంటిరి? గాఢాంధకార మగ్నము గాదా? కర్మము లన్నియు నేమి యగును? మీరాలోచింపకుండ నిటువంటివరము గోరితిరి. మీరు గోరితిరి గాని లోకములకు నాశము చేకూరువరము తెలిసియుండి నే నెట్లీగలను? మఱియేదేని వరము కావలసినచో నడుగుఁడు. అది యెట్టి దయినను దప్పక యిచ్చెదను. అని యిట్లు శివుఁడు చెప్పఁగానే వారు విషాదమును బొంది యిట్లనిరి. దేవేశా! అటులేని సూర్యుని వెలుఁగొక్కసంవత్సరము మాత్రము ప్రకాశింపకుండ వరమిమ్ము. నీవు భక్తవత్సలుఁడవటకదా! అని వారనఁగానే శివుఁడు క్షణమాత్ర మాలోచించి యట్లే వరమిచ్చితి నని యచ్చటనే యంతర్ధానమాయెను. వెంటనే బ్రహ్మాండ మంతయుఁ గాటుకకూరినట్లు గాఢాంధకారమగ్న మయిపోయనది. అట్టిసమయమున వజ్రదంష్ట్రుఁడు వీరమాహేంద్రపట్టణమునకుఁ బోయి దూతలతో నిట్లనియె. దూతలారా! మీరు నాలుగు దిక్కులకును బోయి మనవాండ్రు రాక్షసు లెక్కడెక్కడ నున్నారో కనుఁగొని యింద్రునిమీఁదికి యుద్ధమునకు వెళ్ళవలయుటను జెప్పి తీసికొనిరండు. వారందఱితోడను గలసి యుద్ధమునకుఁ బోదము. అని చెప్పిన వజ్రదంష్ట్రునిమాటలు విని దూతలు బయలుదేఱి మహాగమ్యగ్యా రాక్షసు లున్నచో ట్లన్నియు వెదకి రాక్షసరాజు చెప్పినయాజ్ఞ నందఱకును వినిపించిరి. వారును నాఁడే బయలుదేఱి యుద్ధసన్నద్ధులై వచ్చిరి. తుదకు వారును వీరును గలసి యింద్రాదులతో యుద్ధముయోయుతలంపుతో స్వర్గము పై పు బయలుదేఱిరి.

శ్లోక॥ యిట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితములో రాక్షసుల సీవన్న యుద్ధసంరంభ మన్నది పదునాల్గవ యధ్యాయము.



పదునేనవ అధ్యాయము.

సూతు—తరువాత నారాక్షసులు వజ్రదంష్ట్రునియాజ్ఞవలనఁ దమపట్టణమునుండి బయలుదేఱిరి. రాక్షసరాజగు వజ్రదంష్ట్రుఁడును జతురంగబలముతోఁగూడి యుద్ధము చేయుటకుఁ గృతనిశ్చయుఁడై బయలుదేఱెను. తరువాతను వానితమ్ము లిద్దఱును సైన్యముతోఁగూడి బయలుదేఱిరి. సూర్యకోపుఁడు, అగ్నికోపుఁడు ననువజ్రదంష్ట్రునికుమారు లిద్దఱును వలసినంతసైన్యముతోఁ గూడి తండ్రిని వెంటనంటి పోయిరి. వానిమేనల్లు ళ్ళిద్దఱు ధూమ్రనేత్ర ఖడ్గజిహ్వ లనువారును బెక్కుమంది రాక్షసులతోఁగూడి మేనమామకు సాయము వెళ్ళిరి. వారు బయలుదేఱినపుడు మిక్కిలిగా భేరులు మ్రోఁగింపఁబడినవి. ఇట్లు యావద్రాక్షసులును యుద్ధశ్రద్ధ గలిగి ధనుష్టంకారములు చేయుచు సింహనాదములు చేయుచుస్వర్గమునకుఁ బోయి ద్వారము లరికట్టిరి. రాక్షసు లిట్లు యుద్ధమునకు వచ్చి రని విని దేవతలును యుద్ధసన్నద్ధులైరి. యుద్ధములోఁ జాలమంది రాక్షసులను గొట్టిరి. రథములను జూర్ణము చేసిరి. ఏనుఁగులను, గుఱ్ఱములను కాలుబలమును ధ్వంసము చేసిరి. మఱియు దేవతలు కాలదండములతో సమానములగు బాణములను బ్రయోగించి యనేకులను జంపిరి. కొందఱు మావంటివాండ్రు గజములతోడను, మఱికొందఱు గుఱ్ఱములతోడను జచ్చి నేలఁ గూలిరి. ఇట్లు చాలమంది చచ్చినతోడనే మిగిలినరాక్షసులు కోపించినవారై యేమియుఁ జేయఁజాలక స్వర్గద్వారములను విడిచి పాఱిపోమొదలిడిరి. స్థానభ్రష్టు లయి పాఱిపోవుచున్న రాక్షసుల వెంటఁ గొట్టుచు దేవతలు పరుగులెత్తిరి. ఇటు దెబ్బలకుఁ దాళఁజాలక సైన్యము నాలుగువైపులకును బాఱిపోవుచుండుట చూచి వజ్రదంష్ట్రుఁడు పాఱిపోకుండ నిలువఁబెట్టుచుండెను. ఇట్లు వజ్రదంష్ట్రునిచేతను బ్రేరేపింపఁబడినవారై మహాబలవంతులగు రాక్షసులు యుద్ధోత్సుకులై దేవతలమీఁదికి వచ్చిరి. అపుడు వజ్రదంష్ట్రుఁడు తమ్ములతోడను కొడుకులతోడను మేనల్లుళ్ళతోడను గూడి దేవతలతో యుద్ధము చేయుట కుపక్రమించెను. తరువాతను రాక్షసులకును దేవతలకును ఘోరముగా యుద్ధము జరిగినది. ఒకరి నొకరు జయింపవలె నను తలంపులు గలిగి యుండిరి. రథములతో రథములు గుఱ్ఱములతో గుఱ్ఱములు, ఏనుఁగులను,

గులతో నేనుఁగులు కాలుబలముతోఁ గాల్బలము పోరఁదొడఁగెను. ఇట్లు నానావిధములయిన యాయుధములతోడను యుద్ధము చేయుచుండఁగా రథములచప్పుడు, ఏనుఁగులఘీంకారములు, గుఱ్ఱములసకిలింపులు, పదాతుల సింహగర్జనములు, బాహువుల నప్ఫళించినచప్పుడు ధనుస్సులటంకారములు, భేరీశంఖాదులచప్పుడు మిగిలినవాద్యములచప్పుడు, కాహళులు తూర్యములు మొదలగువానిచప్పుడు కలిసి మూఁడులోకములను జెవుడెత్తింప మొదలిడెను. సముద్రములు కలఁగిపోయినవి. కులపర్వతములు భ్రాంతిని బొందినవి. తరువాతను ఘోరముగాఁ జీకటి వ్యాపించినది. అపుడు రాక్షసులు తమయాయుధముల వెలుతురుచేఁ జూచి దేవతలను గొట్టుచుండిరి. మఱికొందఱు కిరీటములకాంతులచేఁ జూచి కొట్టుచుండిరి. తరువాతను మహాబలవంతులగు రాక్షసులచేఁ గొట్టఁబడి దేవత లందఱును బరాఙ్ముఖు లయిరి. ఇట్లుపాఱిపోయి భయపడుచు దేవతలు స్వర్గములోఁ బ్రవేశించిరి. ఘోరవిక్రములగు రాక్షసులు దేవతల నందఱను జయించి నేఁటికి యుద్ధము చాలు నని తలంచి సంతుష్టులై క్రమముగా వీరమాహేంద్రపట్టణములోఁ బ్రవేశించిరి.

తరువాతను రాక్షసులచే బాగుగా దెబ్బలుతిన్న యాదేవత లందఱును దేవేంద్రునితోఁ గూడి శంకరుని శరణు చొచ్చుటకై బయలుదేఱి కైలాసపర్వతముపైనున్న శివుని జూచి యనేకవిధములుగా స్తుతి చేసిరి. వారు చేసినస్తుతులకు సంతోషించి శివుఁ డిట్లనియె. దేవతలారా ! మీకుఁ గుశలమే కదా! ఇంద్రా! నీకు క్షేమముగదా! నీవజ్రము రాక్షసులగర్వము నణఁచుచున్నదిగదా! అని యిట్లు శివుఁ డడుగఁగా దేవతలాయనతో నిట్లనిరి. ప్రభూ ! తమదయవలన మా కందఱకును క్షేమమే. కాని వజ్రదంష్ట్రుఁ డనురాక్షసుఁడు మమ్ములను బాధించుచున్నాఁడు. నిన్నటిదినము వానితో యుద్ధము చేసి చాలఁ బీడింపఁబడితిమి. ఆరాక్షసుఁడు బహురాక్షసులతోఁ గూడి వచ్చి స్వర్గద్వారములను నిరోధించెను. కరుణానిధీ ! తమ్మును శరణు చొచ్చితిమి. మమ్ములను గాపాడవలయును. శంకరా ! మేము మారాక్షసులతో యుద్ధము చేయఁజాలము. ఆరాక్షసులవధోపాయము సెలవీయవలయును. ఇఁక వానితమ్ము లిద్దఱున్నారు. వారు మఱియు దుర్మార్గులు. యుద్ధభూమిలోనికి వచ్చియున్న వ్యా



ఘ్రవక్త్రునితోడను సర్పజిహ్వునితోడను యుద్ధము చేయుట కెవరికి శక్తి యుండును ? మఱియు నావజ్రదంష్ట్రునికుమారులు కాలాంతకసములు. సూర్యకోపుఁడు, అగ్నికోపుఁడు ననువా రున్నారు. వారిని సహింప మావశము గాదు. ఆరాక్షసునిమేనల్లుండ్రు ధూమ్రనేత్రఖడ్గజిహ్వులసంగతి చెప్పనే యక్కఱలేదు. మహామతీ ! ఆరాక్షసు లందఱును జచ్చునుపాయ మాలోచించి మాకు సెలవీయవలయును. రాక్షసులను నశింపఁజేసి మమ్ముల నెట్లయినను గాపాడవలయును. భక్తవత్సలా ! దిక్కులేక నిన్నే శరణు చొచ్చితిమి. అని యిట్లు దేవతలు చెప్పఁగా శివుఁడు శిరస్సును కంపించి క్షణకాల మాలోచించి "మంచిది" అని చెప్పి దేవాంగునివంకఁ జూచి యిట్లనియె. దేవాంగా ! నీవు పోయి యింద్రాదులకు సాయపడుము. రాక్షసులను జయించుము. చతురంగబలముతోడను నీకుమారులతోడను గూడి యింద్రాదిదేవతలను వెంటఁబెట్టుకొని వెంటనే రాక్షసులను జంపుము. అని యిట్లు శివుఁ డాజ్ఞాపించినతోడనే దేవాంగమహారాజు చిత్త మని యంగీకరించెను. తరువాతను శివుఁడు దేవేంద్రునితో మరల నిట్లనియె. ఇంద్రా ! నీవీదేవాంగుని సాయముగాఁ దీసికొని యుద్ధమునకుఁ బొమ్ము. ఇతఁడు వజ్రదంష్ట్రాదులగు రాక్షసులను దప్పక జయించును. అని యిట్లు శివుఁడు చెప్పినమాటలు విని సంతోషించి యింద్రుఁ డిట్లనియె. దేవేశా ! యట్లే కానిమ్ము. తమవాక్యముచేతను రాక్షసులు పరాజితు లగుదురుగాక. వారు మమ్ములను జాల బాధించుచున్నారు. అని చెప్పి దేవదేవుఁ డగుశివునకు నమస్కరించి యతనియాజ్ఞను బొంది దేవాంగునితోఁ గూడ బయలుదేరెను. అపు డింద్రునితో దేవాంగుఁ డిట్లనియె. దేవేంద్రా ! నీ విపుడు దేవతలతోఁ గూడి స్వర్గమునకుఁ బొమ్ము. నేనును జతురంగబలముతో నీయనుపదమే వచ్చుచున్నాను. అని చెప్పఁగానే వేగముగా రమ్మని చెప్పి దేవతలతోఁ గూడి సంతోషించుచు నింద్రుఁడు స్వర్గమునకుఁ బోయెను. తరువాతను దేవాంగుఁ డామోదపట్టణము చేరెను. ఫణిహారులను బిలిచి చతురంగబలమును సిద్ధము చేయున ట్లాజ్ఞాపించెను. తరువాతను వారందఱును గూడిరి. వాద్యధ్వనులు మ్రోఁగుచుండఁగా రాజపుత్రులతోఁ గూడి స్వర్గమునకుఁ బోయెను.

ఇంద్రుఁడు తనకు సహాయము చేయ వచ్చినవారి నందఱను గౌరవము
గా నెదుర్కొని పట్టణములోనికిఁ దీసికొనిపోయి యతిథిసత్కారమును
యథేష్టముగాఁ జేసెను. నాఁడు రాక్షసులు యుద్ధమునకు రారని తెలిసి
కొని నాటిరాత్రి సుఖముగా వెళ్ళించెను. మఱునాఁడు తెల్లవాఱఁగానే
ఘణిహారులను బిలిపించి దేవసైన్యము నంతను యుద్ధమునకు సిద్ధముగా
నుండునట్లు చేయుఁడని యాజ్ఞాపించెను. యుద్ధప్రయాణమునకు సూ
చకముగా రణభేరులు మ్రోఁగింపఁబడినవి. దేవత లందఱును నిత్యకృ
త్యములను నెఱవేర్చుకొని యింద్రునియొద్దకు వచ్చిరి. రాజపుత్రుల
తోఁ గూడి దేవాంగుఁడును మహేంద్రునియొద్దకు వచ్చెను. అందఱు
ను గూడి యున్నా రని దేవేంద్రుఁ డనెను. ఇంతట వజ్రదంష్ట్రుఁడు
మొదలగురాక్షసులు వచ్చి దేవతలతోఁ దొమ్మిగా యుద్ధముచేయ
మొదలిడిరి. దేవతలు రాక్షసులు పరస్పరమును జయించుతలంపుతోఁ
గొట్టుకొనుచుండిరి. శూరులగు దేవతలు రాక్షసులను గట్టిగాఁ గొట్టిరి.
రాక్షసులు దిక్కు లేక వ్యాఘ్రవక్త్రుని శరణుచొచ్చిరి.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమున దేవదానవ
సేనాయుద్ధమన్నది పదునైదవ యధ్యాయము.

---

## పదునాఱవ యధ్యాయము.

సూతు—ఇట్లు రాక్షసులు కొట్టఁబడి చెల్లాచెదరై పోయిన
తరువాత మహాబలుఁడును మహాప్రాజ్ఞుఁడును శత్రుతాపనుఁడును నగు
దేవలునియొద్దకు వచ్చి యారాక్షసుఁడు మధురముగా నిట్లనియె. దేవాం
గరాజా! నీవు యుద్ధములో ధనుస్సు పట్టుకొని ప్రళయకాలపు మేఘుని
వలెఁ బ్రకాశించుచున్నావు. బాణవర్షముచే శత్రువులను ముంచివైచు
చున్నావు. నీతోఁ యుద్ధము చేయుటకు నేను దక్కఁ దక్కినవారు పని
కిరారు. అడవిలో సింహము మృగములను బరుగు లెత్తించునట్లు నాశ
త్రువులను నిర్భయముగాఁ బరుగు లెత్తింతును. గొప్పది యగురథ
ఘోషముచేతను భూమ్యంతరిక్షములు నిండునట్లు చప్పుడు చేయుదును.
అమ్ములపొదినుండి పాములవంటి బాణములను దీసి ప్రయోగింతును.
ఈశ్వరునితోఁ సంధకాసురుఁడు యుద్ధముచేసినట్లు నాయొక్కనితోఁ డనే



యుద్ధము చేయుదువుగాక. అని యిట్లు రాక్షసుఁ డనఁగానే దేవాంగుఁ
డు సంతోషించి నవ్వుచు ఖడ్గముతో నారాక్షసుని గొట్టెను. ఆదెబ్బకు
నొచ్చి యారాక్షసుఁడు మర్మభేదకములగు బాణములచే దేవలుని గొ
ట్టెను. మరలఁ దొంబదిబాణములచే సకలమయిన మర్మస్థానములయం
దును గొట్టెను. రాక్షసుఁడు ప్రయోగించినబాణములు తగిలినయాదేవ
లుఁడు కిరణములతోఁ గూడిన సూర్యునివలెఁ బ్రకాశించెను. తరువాత
దేవలుఁడు కోపించి వేలకొలఁది బాణములు ప్రయోగించి వ్యాఘ్ర
వక్త్రుఁ డనురాక్షసుని గప్పివుచ్చి సింహనాదము చేసెను. ఆరాక్షసుఁడు
తనబాణములచే నతనిబాణములను వారించి నవ్వుచున్నవానివలెనే
యొకబాణముచే దేవలుని నుదుటిమీఁదను గొట్టెను. నుదుటియందుఁ
దగిలినయాబాణముచేతను దేవలుఁడు వనమందు గర్వించియుండు ఖడ్గ
మృగమువలెఁ గన్పట్టుచుండెను. తరువాత నాదేవాంగుఁడు నవ్వుచు
నారాక్షసుని నుదుటికిఁ దగులునట్టుగా మూఁడు వాఁడిబాణములను
బ్రయోగించెను. మూఁడుబాణములును దగిలి యావ్యాఘ్రవక్త్రుఁడు
రక్తము స్రవించుచుండఁగా వర్షాకాలములోఁ ద్రిశృంగములు గలపర్వత
మువలె నుండెను. తరువాత నారాక్షసుఁడు వేలకొలఁది బాణములతోఁ
దేవలుని గప్పివైచెను. కాని గాలి పర్వతమును గదలింపఁజాలనట్టుగానే
యతనిని గదలింపఁజాలకపోయెను. అట్లే దేవలుఁడును రాక్షసుని గొట్టె
ను గాని యుదకప్రవాహము కొండ నేమియుఁ జేయఁజాలనట్టే యేమి
యుఁ జేయఁజాలకపోయెను. లోకక్షయమును జేయుటకు సిద్ధపడినసూ
ర్యు లిద్దఱేకమయిన ట్లాయిద్దఱును రథములమీఁద నుండి ప్రకాశించు
చుండిరి. అనుపహరథు లిద్దఱును నిర్భయ లయి యొకరినొకరు బాగు
గాఁ గొట్టుకొనుచున్నారు. మఱియు వారిద్దఱును పెద్దపులులవలె నుం
డి పోరుచుండిరి. ఒకరిబాణము లొకరిని గప్పఁగా నగపడకుండ నుండిరి.
అప్పుడు మేఘములు గప్పిన చంద్రసూర్యులవలె నుండిరి. ఒకమాఱు
కనుపడుట యొకమాఱు కనుపడకుండుటయుఁ గలిగి యుద్ధము చేయు
చుండిరి. అట్టిసమయమున రాక్షసుఁ డాదేవలుని భయంకరములగు బా
ణములతోఁ గొట్టుచు నపసవ్యముగాఁ జేసెను. దేవలుఁడు శత్రువు
యొక్క జయచిహ్నములను జూచి సహింపక తనరథమునుగూడ నపస

34

వ్యముగఁజేసెను. మండలవిభాగములయందును గతప్రత్యాగతములయందును వారిద్దఱికిని ఘోరముగా ద్వంద్వయుద్ధము జరిగినది. ఒకరి నొకరు చంపుదమను నుద్దేశముతో నాకర్ణాంతము బాణముల నాకర్షించి విడుచుచుండిరి. ఒకరినొకరు విరథునిఁజేయ నెంచుచుండిరి. తరువాతను మహాస్త్రములు తెలిసినరాక్షసుఁడు గొప్పగొప్పయస్త్రములను బ్రయోగింప మొదలిడెను. మునివరులారా! అప్పుడు మహాఘోరముగా నస్త్రయుద్ధము ప్రవర్తించినది. అది ప్రళయాంతమున లోకముల నాశమును సూచించుగ్రహముల యుద్ధమువలె నుండెను. ఆకాశమంతయు బాణములతో నిండిపోయినది. బాణములరాపిడిచే నగ్నిజ్వాలలు పుట్టినవి. నాశసూచకముగా నుల్కలు పడినట్లున్నది. అప్పు డంతరాళమందున్న సిద్ధులు మొదలుగాఁగలవా రిట్టియుద్ధ మెప్పుడును జూచియుండలే దనుకొనిరి. మఱియు నిట్టియుద్ధము ముందు జరుగఁబో దనిరి. ఆహా! వీరిజ్ఞాన మేమిజ్ఞానము! పరాక్రమ మంతకు మించినది. రాక్షసపార్థివుల ధైర్యము నిరూపమాన మయినది. ఏమి బాణములప్రయోగించునేర్పు! ఇద్దఱును బ్రళయకాలపుఁగాలాంతకులవలె నున్నారు! ఇద్దఱు రుద్రులవలె నున్నారు! ఇద్దఱు సూర్యులవలెఁ బ్రకాశించుచున్నారు. అని యిట్లనేకవిధములుగా సిద్ధులు చెప్పకొనమొదలిడిరి. రాక్షసులును దేవతలును సింహనాదములు చేయుచుండిరి. రాక్షసుఁడును దేవలుఁడును నత్యద్భుతముగా యుద్ధము చేయుచుఁ గన్నులనుండి నిప్పులు రాల్చుచు నొకరి నొకరు దహింతురా యనునట్లు చూడమొదలిడిరి. ఇట్లతిఘోరముగా యుద్ధము జరుగుచుండు సందర్భమున దేవాంగుఁడు తనహస్తలాఘవమును జూపుచు నొకబాణముచేతను సారథిని రెండుబాణములచే ధ్వజమును, నాలుగు బాణములచే గుఱ్ఱములను; అర్ధచంద్రబాణముచే వానిధనుస్సును దెగఁగొట్టి ధనుస్సులేని యారాక్షసుని మూఁడువందల వాఁడిబాణములతోఁ గొట్టెను. అట్లు గొట్టి మఱియొకబాణ మాకర్ణాంత మాకర్షించి వానిని ఖండించెను. ఆరాక్షసునిశిరస్సు శరీరమునుండి వేఱై క్రిందఁబడినది. రత్నకుండలములతో వెలుఁగుచున్న యాశిరస్సు నభోమధ్యమునుండి పడినసూర్యబింబమువలె వెలిఁగినది. ఇట్లు వ్యాఘ్రవక్త్రుఁడుపడిపోఁగానే రాక్షసు



లందఱును భయపడి పాఱిపోవుచుండఁగా దేవతలు వెంటఁదవిలిరి. దేవతలు సంతోషముచే సింహనాదములు చేయ మొదలిడిరి. పటుపరాక్రమశాలి యగుదేవాంగుని దేవేంద్రుఁ డతిసంతోషముచేఁ బూజించెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమున వ్యాఘ్రవక్త్రవధమన్నది పదునాఱవ యధ్యాయము.

---

## పదునేడవ యధ్యాయము.

సూతుఁ—మునులారా! బలవంతుఁడగు వ్యాఘ్రవక్త్రుఁడు మృతినొందఁగానే మిగిలినరాక్షసులు దెబ్బలుతినఁజాలక తిన్నఁగా వజ్రదంష్ట్రునియొద్దకుఁ బోయి జరిగినవృత్తాంత మంతయుఁ జెప్పిరి. తమ్ముఁడు చచ్చిపోవుటయు రాక్షసులు భయపడి వచ్చుటయుఁ దెలిసికొని వజ్రదంష్ట్రుఁడు దుఃఖముతోడను,కోపముతోడను గూడినవాఁడై సగరేశ్వరుండగు దేవాంగునిమీఁదికిఁ బరుగెత్తుకొని వచ్చెను. అప్పుడు దేవాంగుఁడును వజ్రదంష్ట్రు నెదుర్కొనెను. పరస్పరమును జయమును గోరుచుండువారిద్దఱకును వృత్రాసురునకును దేవేంద్రునకును జరిగినట్లు యుద్ధము జరిగినది. వజ్రదంష్ట్రుఁడు దేవాంగునిపై ననేకములగు బాణములను వర్షించెను. కాని యుదకప్రవాహము కొండ నేమియుఁ జేయఁజాలనియట్లా బాణము లతని నేమియుఁ జేయఁజాలకపోయినవి. రాక్షసుఁడు ప్రయోగించినబాణములను తనబాణములచే నివారించుకొని తాను వానిని ఘోరములగు బాణములతోఁ గొట్టెను. దేవాంగునిచేఁ గొట్టఁబడి రక్తమును స్రవించుచున్న యారాక్షసుఁడు వర్షాకాలములో జేగురుకొండవలెఁ బ్రకాశించుచుండెను. ఆదెబ్బ జాల దెబ్బలు తిని పాములవంటి బాణములతో నాదేవాంగుని గొట్టెను. అనేకబాణములచే సారథిని రెండుబాణములచే ధ్వజమును గొట్టి మూఁడుబాణములచే దేవాంగుని నుదుటిమీఁదను గొట్టెను. ఆబాణములు నుదుటికిఁ దగిలియుండఁగా సగరేశ్వరుఁడగు దేవాంగమహారాజు త్రికూటపర్వతమువలె శోభించెను. తరువాతను దేవాంగుఁడు కోపించి ధనుస్సును గుండ్రముగాఁ జేసి డెబ్బదిమూఁడు బాణములచే నారాక్షసుని గొట్టెను. ఒకబాణముచే ధనుస్సును మఱియొకబాణముచే ధ్వజమును నాలుగుబాణములచే నాలుగుగుఱ్ఱములను గొ

35

ట్టిపడవైచి మఱల నెన్నేని బాణములు ప్రయోగించి వానిరథమును
పొడిపొడిగాఁ జేసెను. మఱియుఁ జాలబాణములు ప్రయోగించి వానిని
బీడించెను. ధనుస్సు పోయినది. సారథి చచ్చెను. రథము లేదు. గుఱ్ఱ
ములు చచ్చినవి. తాను గట్టిగాఁ గొట్టఁబడెను. వేసవిలోఁ బూచిన మో
దుగవలె నున్నాఁడు. అట్టిరాక్షసుఁడు గాలిలోని చెట్టువలె కంపించి గద
పట్టుకొని దండపాణియగు యమునివలె దేవాంగునిమీఁదికిఁ బరుగెత్తెను.
అట్లు వచ్చురాక్షసుని జూచి పిడుగులవంటిబాణములు ప్రయోగించి
వానిచేతిలోనిగదను ఛేదించి మదించినసింహమువలె దేవాంగుఁడు ధ్వని
చేసెను. దేవతలందఱును సంతోషసూచకముగాఁ గేకలువైచిరి. దేవదుం
దుభులు మ్రోగినవి. ఆరాక్షసుఁడు గదపోయి నిరాయుధుఁడై దిక్కులు
చూచుచు నేమియుఁ దోఁచక హేమకూటముయొక్క శిఖరమును బెల్ల
గించి చేతఁ బట్టుకొని రాజునొద్దకుఁ బోయి యిట్లనియె. రాజా! పోకు
ము పోకుము. క్షణమాత్ర ముండుము. నీవేమో గర్వించి కేకలు
వేయుచున్నావు. ఈకొండశిఖరముచే నీపొంక మణఁచెదను. పిడుగు
పడినవిధమునఁ బడి నిన్నును నీరథమును బొడిపొడిగాఁ జేయును. ఇం
ద్రుఁడు మాతో యుద్ధము చేయఁజాలక నిన్నుఁ దోడు తెచ్చుకున్నాఁ
డుగా! వాఁడు వానిసైన్యముగూడ నీవు పడిపోఁగానే భయపడి పాఱి
పోవుదురుగాక. నాతమ్ముఁడగు వ్యాఘ్రవక్త్రుని జంపి నీవేమో గర్వించి
యున్నావు. భ్రాతృదుఃఖతప్తుఁడనగు నేను నిన్నుఁ జంపి వానిఋణము
దీర్చుకొందును. దేవతలపీచ మణఁచెదను. అపుడు సంతోషించుచుం
దును. ఓరీ! మాకు వస్త్రము లీయక తక్కిన యందఱకును నిచ్చెదవు
గా! ఇపుడు చేతికిఁ జిక్కితివి. ఇఁక నెక్కడికిఁ బోఁగలవు? నాయెదుటఁ
బడిననిన్నుఁ గాపాడువాఁ డెవఁడో చూచెదనుగాక. అని యిట్లు చెప్పి
రాక్షసుఁడు దేవాంగునిపయికిఁ గొండశిఖరమును విసరెను. అపుడు దై
వతసైన్యములో హాహాకారము పుట్టినది. దేవలునికి క్షేమమగుఁగాక
యని సిద్ధులు పలికిరి. ఆదేవాంగుఁ డాకాశమార్గమున వచ్చుచున్న
కొండశిఖరమును జూచి వజ్రబాణములను బ్రయోగించి పొడిపొడి చేసి
క్రిందఁ బడవైచెను. అతఁడు చేసిన యాయద్భుతకర్మమును జూచి దేవ
తలు సాధువాదములు పలికిరి. కొండశిఖరము గూలవైచి నవ్వుచు



సారాక్షసునిమీఁదను వానితోడివాండ్రమీఁదను లెక్కకు మిక్కిలిగా
బాణములను బ్రయోగించి కాలాంతకునియాకృతిని ధరించి భారవాహ
మగు ధనుస్సును టంకారము చేయుచుఁ దనరథమును నాలుగువైపులకు
ను ద్రిప్పుచు నాకాశమును బాణమయముగాఁ జేసి యనేకుల శిరస్సు
లు ఖండించుచు మిగిలినవారిని నాలుగువైపులకును బరుగులెత్తించెను.
శార్ఙ్గమను ధనుస్సు చేతఁ బట్టి విష్ణుఁ డెట్లు యుద్ధము చేయునో య
ట్లే దేవాంగుఁడును యుద్ధము చేయుచుండెను. చావఁగా మిగిలినరాక్ష
సులు ప్రాణములు పిడికిలిలోఁ బట్టుకొని పాఱిపోయిరి. అపుడు వజ్రదం
ష్ట్రుఁడు దేవాంగునితో యుద్ధము చేయఁజాలక మహామాయను గల్పిం
చి దేవతాసైన్యముపైని పర్వతవర్షమును గురిపింప మొదలిడెను. అవి
ప్రపంచమునంతను గాఢాంధకారమయముగాఁ జేసినవి. ఎక్కడఁ జూచి
నను పిడుగులవలె రాళ్ళు పడుచుండెను. మాయామేఘములు తెరపిలేకుం
డ వర్షింపఁ దొడఁగినవి. మహావాయువులు బయలుదేఱి దేవతలను గంపిం
పఁజేయ మొదలిడినవి. దీనులైన యాదేవతలు రాక్షసమాయను సహింపఁ
జాలక మొఱ్ఱలు పెట్టుచుండిరి. ఆరాక్షసుఁ డెవ్వరికిని గనుపడకుండ మా
యను బ్రయోగించి పీడించుచుండెను. అప్పుడు దేవాంగమహారాజు
మాయాసముద్రములో మునిఁగియున్న దేవతల నుద్ధరించుటకును, అదృ
శ్యుఁడైనయారాక్షసుని జయించుటకును మనస్సులో నిశ్చయించుకొని
శివభగవానుఁ డిచ్చిన శత్రుసంహారకమైన ధ్వజమును రాక్షసులపై వై
చెను. ఆధ్వజ మమోఘమైనది గనుకఁ బ్రయోగించినతోడనే రాక్షస
మాయనుపోఁగొట్టి యనేకులను రాక్షసులను జంపినది. కోట్లకొలఁదిగా
వృషభములు బయలుదేఱి రాక్షసులను జంప మొదలిడినవి. అవి తమ
డెక్కలతోడను, కొమ్ములతోడను, తోఁకలతోడను రాక్షసులను జంప
మొదలుపెట్టినవి. మఱియు మహాసర్పములతోడను సింహములతోడను
వ్యాఘ్రములతోడను భయంకరములైన పర్వతములు, మిక్కిలిని భ
యంకరములగు గండభేరుండములు శరభాదులగు మహామృగములును,
ఉల్కాశని మహాపాతములై దానవులసైన్యములోఁ బ్రవేశించి రూపు
మాపినవి. ఇవియన్నియు వృషభధ్వజమునుండియే పుట్టినవి. చావఁగా
మిగిలినరాక్షసులు వజ్రదంష్ట్రుఁడును దమపట్టణములోనికిఁ బాఱిపోయిరి.

ఆరాక్షసుఁడు కొడుకులు మంత్రులు, సైన్యము తమ్ములు మొదలగువా రందఱును జచ్చుటచే దుఃఖించుచుఁ బాఱిపోయెను. ఇంద్రునితోఁ గూడి దేవాంగుఁడు సంతుష్టస్వాంతుఁడై తనవారితోఁ గూడి స్వర్గములోనికిఁ బ్రవేశించెను. ఇంద్రుఁడు సత్కరించిన వెనుకఁ దనవారితోఁ గూడి దేవాంగుఁ డామోదపట్టణములోఁ బ్రవేశించెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమున ధ్వజప్రభావ రాక్షసపరాభవమన్నది పదునేడవ యధ్యాయము.

---

## పదునెనిమిదవ యధ్యాయము.

సూతు — తరువాతను రాక్షసరాజగు వజ్రదంష్ట్రుఁడు చచ్చిన వారిం దలచుకొని యేడిచి యేడిచి తుదకు దుఃఖ మాఁపుకోఁజాలక కోపము దెచ్చుకొని తనకు బావమఱఁదియగు విద్యుత్కేశునియింటికిఁ బోయెను. ఇంటికి వచ్చిన బావనుజూచి విద్యుత్కేశుఁ డత్యంతమును గౌరవించి విషాదమునకుఁ గారణ మేమని యడుగఁగా నావజ్రదంష్ట్రుఁ డిట్లనియె. ప్రియసఖా! రాక్షసశ్రేష్ఠా! మహాబలా! విద్యుత్కేశా! నాకొక కార్యము చేయవలసియున్నది. అని చెప్పఁగానే వాఁడువినయముతోఁ గూడి యేమిచేయుమన్నను నీయాజ్ఞను శిరసావహించి చేయుదు ననెను. ఆమాట వినఁగానే వజ్రదంష్ట్రుఁడు సంతోషించి వానితో నిట్లనియె.

ఓయీ! నే నిపు డొకటి చెప్పెదవినుము. పూర్వము దేవాంగుఁడు చేసినసంగతి యెఱిఁగియే యుందువు. నావారందఱును యుద్ధములో మృతినొందిరి. ఇదంతయు వానివలననే సంభవించినది. ముఖ్యులందఱును జచ్చిపోయిరి. ఆచచ్చినవారి నందఱను దలంచుకొన్న కొలంది దుఃఖమే హెచ్చుచున్నది. నేను విరథుఁడనై పోతిని. గట్టిగా దెబ్బలు తింటిని. వేయేల? దేవతలయెదుట నన్ను వాఁడు పలువిధములుగా నవ్వి వేళాకోళములు చేసెను. నేను బన్నినమాయ లన్నియుఁ బోయినవి. నాబల మొందులకును బనికివచ్చినదే కాదు. అది యెక్కడనుండి తెచ్చినవాఁడో కాని వృషభధ్వజమును బ్రయోగించెను. అది మహోత్పాతమును గలిగించినది. సింహమునకు భయపడిన లేడి



పిల్లవలె యుద్ధములో నిలువఁజాలక పాఱిపోతిని. ఇంద్రుఁడు దేవాంగుని సాయమున జయమును బొంది గర్వించి సంతోషించుచు దేవతలతోఁ గూడ స్వర్గమునకుఁ బోయెను. నగరేశ్వరుఁడగు దేవాంగునిసహాయముననే యింద్రుఁ డంతగొప్పవాఁ డయిపోయినాఁడు. ఇంతకును దైవయత్న మెవరికిని దప్పింప వీలుగానిది గదా! ఇంద్రునకు జయము, నాకుఁ బరాజయము గలుగు నని యెన్నఁడయినను తలంపవచ్చునా? నే నారెండుసంగతులకే మిక్కిలి విచారించుచున్నాను. పౌరుష మెందులకును బనికిరా దనియు దైవమే ప్రబలమనియుఁ దేటపడినది. నాతమ్ముఁడు వ్యాఘ్రవక్త్రుఁడు త్రిలోకములను జయించినవాఁడు గదా! అట్టివానిని దేవాంగుఁడు యుద్ధములోఁ బడఁగొట్టినాఁడు. ఇందుల కేదియైనను బ్రతిక్రియ యున్నచోఁ జేసి నాదుఃఖమును బోఁగొట్టుదు వనునభిప్రాయముచే నీయొద్దకు వచ్చితిని. నాయింతటి దుఃఖమునకును మూలకారణము దేవాంగుఁడే యయినాఁడు. వానిని జయించునుపాయమాలోచింపుము. మనము కపటోపాయమును బన్నిననే కాని వానిని జయింపఁజాలము. వాని కాధ్వజ ముండుటంబట్టి యసాధ్యుఁడుగా నున్నాఁడు. శంభుదత్తమయిన యాధ్వజప్రభావ మిట్టిదని చెప్పుటకు సాధ్యము గాదు. కావున నెట్లయినను నీవు మాయోపాయముచే నాధ్వజమును హరించితివేని యాదేవలుఁడు మనకు లొంగును. నీవావిషయమున సాయపడుము. ఆమాత్రపుపని చేసితివేని మనపను లన్నియు నెఱవేఱుట కెంతమాత్రమును నభ్యంతరము లేదు. అని చెప్పఁగానే విద్యుత్కేశుఁ డంగీకరించి ధ్వజము నపహరించు తలంపుతో నామోదపట్టణమునకుఁ బోయి దేవలునితో నిట్లనియె—ఓయీ! దేవలా! రాజశ్రేష్ఠా! దయానిధీ! అమితవిక్రమా! నేను దేవేంద్రునిదూతను. నమస్కరించుచున్నాను. ఆయనయాజ్ఞచే నీయొద్దకు వచ్చితిని. ఇపుడు మరల వజ్రదంష్ట్రుఁడు లెక్కలేని రాక్షసులతో వచ్చి నిర్భయముగా యుద్ధము చేయుచున్నాఁడు. నిన్నటిదినము నీవు రాక్షసులతో ఘోరముగా యుద్ధము చేసి యలసి యున్నావని యెఱిఁగి నీకు శ్రమ కలుగఁజేయఁగూడ దనుతలంపుతో నింద్రుఁడు తానే దేవతాసైన్యమును వెంటఁబెట్టుకొని యుద్ధమునకుఁ బోయె వజ్రదంష్ట్రాదులగు రాక్షసులతో యు

ద్ధము చేయుచు "ఓయీ దూతా ! దేవాంగమహారాజుదగ్గఱ శత్రుసం
హారక మగువృషభధ్వజ మున్నదిగదా ! అతని నడిగి యది తీసికొని
రమ్ము" అని నన్నుఁ బంపియున్నవాఁడు. మహారాజా ! శీఘ్రముగా
నాధ్వజ మిమ్ము. దానితో యుద్ధదుర్మదులగు రాక్షసులు ధ్వంసము
చేయఁబడుదురు. నిన్నటి యుద్ధములో నాధ్వజప్రభావమువలనఁ బె
క్కుఱు రక్కసు లుక్కుడక్కిరి గదా ! చావఁగా మిగిలినరాక్షసులు
వజ్రదంష్ట్రుని పురస్కరించుకొని మరల వచ్చి యుద్ధము చేయుచున్నా
రు. అందఱను జంపఁగల ధ్వజము దెచ్చి వేగముగా నా కిమ్ము. అని
యిట్లు కుటిలుఁడై వచ్చిన యాదూతమాటలు విని నిజమే యనుకొని
దైవవశమున దేవేంద్రునికి మేలు చేయుతలంపుతో నాధ్వజమును వా
నిచేతి కిచ్చెను. ఆరాక్షసుఁడు సంతోషించుచు నద్దానిని గైకొని తిన్నఁ
గా వీరమాహేంద్రపట్టణము ప్రవేశించి వజ్రదంష్ట్రుని సందర్శించెను.
వాఁడు వానిని జాలగౌరవించి వెంటనే ముఖ్యులగు రాక్షసులను బిలిచి
మీరు యుద్ధసన్నద్ధు లయి రండు వేగముగా స్వర్గమును ముట్టడింతము.
అని వారిని సిద్ధపఱిచెను. రాక్షసులరాక తెలిసికొని దేవేంద్రుఁడు కో
పించి దేవసైన్యముతోఁ గూడి రాక్షసులతో యుద్ధము చేయఁబో
వుచు దేవలునిరాకను గోరి యామోదపట్టణమునకు దూతనుబంపఁగా
వాఁడు వేగముగఁ బోయి యింద్రునియానతి విన్నవించెను. దేవదూత
మాటలు విని యాశ్చర్యపడి యిది యేటిసంగతి చెప్పుమా ? ముందు
వచ్చి దేవరాజు పంపెనని యొకఁడు ధ్వజముతీసికొని పోయెనుగదా !
ఇప్పుడు మఱొకఁడు వచ్చి మరలఁ బిలుచుచున్నాఁడు. ఆధ్వజముయొ
క్క మహిమగానీ యుద్ధమునందుఁ దగ్గిపోయినదా ? లేక; అది నాది
గనుక నింద్రునకుఁ బనికిరాకపోయినదా ? మఱి రాక్షసులుగానీ యిం
ద్రుని జయించి పట్టుకొనిపోయిరా ? అని యనేకవిధములుగా సందే
హించుచుఁ బుత్త్రులతోడను సైన్యముతోడను బయలుదేఱి యతివేగ
ముగా స్వర్గమునకుఁ బోయెను. దేవలునిరాకకుఁ బూర్వమే వజ్రదం
ష్ట్రుఁడు దేవతలతో యుద్ధము చేసి పాపాత్ముఁ డాధ్వజమును వారిపై
విడిచెను. అధ్వజ మెవరిచేతఁ బూజింపఁబడి విడువఁబడునో వానిశత్రువు
లను యముఁడు కాలదండముచేఁ బ్రజలను సంహరించునట్లు సంహరిం



చును. అటువంటి ధ్వజము యథావిధిగాఁ బూజించి దేవతలపైకి విడు
వఁబడిన దగుటచే నది దేవతలను క్షోభింపఁజేయ మొదలుపెట్టినది. దా
నికి భయపడి దేవతలు పాఱిపోయిరి. దేవతలు దెబ్బలు తగిలి పాఱిపో
యినతరువాత దేవాంగుఁడు సైన్యముతో నాయుద్ధభూమికిఁ బోయెను.
రాక్షసుఁ డప్పటి కాధ్వజము నుపసంహరించి తనపట్టణమునకుఁ బోవ
నుద్యుక్తుఁడై యుండఁగా రాజు చూచి కోపించి బాణముల వర్షించెను.
తరువాతను రాక్షసు లందఱును దేవలుని జుట్టువాఱుకొని యనేకము
లగు నాయుధములతోఁ గొట్టిరి. దేవాంగునిసైన్యముపై నాధ్వజమును
వజ్రదంష్ట్రుఁడు ప్రయోగించెను. అది విడచినతోడనే దేవాంగునిసై
న్యము నంతను దహించినది. చావఁగా మిగిలినవారు పదిదిక్కులకును
బాఱిపోయిరి. తరువాతను రాక్షసు లందఱును నేకమయి దేవాంగుని
మీఁద ననేకాయుధములు ప్రయోగించిరి. కొందఱు రథమెక్కి పగ్గము
లు పట్టుకొనిరి. మఱికొందఱు సారథిని గట్టివైచిరి. ఇతరులు యుగంధ
రుని పట్టుకొనిరి. వేఱొకకొందఱు వచ్చి దేవాంగునిచేతిలోని ధనుస్సు
విఱిచివైచి యమ్ములపొదులు లాగికొనిరి. మిగిలినయాయుధములను
విసరివైచిరి. గుఱ్ఱములను జికురుబొడిచిరి. ఇట్లు రాక్షసులకుఁ జిక్కి విడి
పించుకోఁజాలక యెటు చూచినను దనవారొకరును గంటి కగపడనికా
రణమునఁ జింతించుచుండు దేవాంగుని వజ్రదంష్ట్రాదులు రథమునకుఁ
గట్టికొని యాధ్వజము నుపసంహరించుకొని జయమును బొంది సంతో
షపూర్వకముగాఁ దమపట్టణమునకుఁ బోయిరి. దేవాంగునికొడుకు ది
వ్యాంగుఁడు దుఃఖసముద్రములో మునిఁగి తండ్రిబంధనమును గూర్చి
చింతించుచుఁ జావఁగా మిగిలినవారితో నామోదపట్టణమునకుఁ బోయి
తల్లిని బహువిధములుగా నోదార్చి ప్రజల నందఱను నిక్కిలి యూ
ఱడించి మంత్రులతోఁగూడి యుండెను.

తరువాతను వజ్రదంష్ట్రుఁడు తనవారితోఁ గూడి వీరమాహేం
ద్రపట్టణమునకుఁ బోయి దేవాంగుని విశేషముగ సన్మానించెను. తరు
వాతను రాక్షసరాజగు వజ్రదంష్ట్రుఁడు వస్త్రనిర్మాతయగు దేవాంగుని
మంచిమాటలాడి యతనితో స్నేహమును సంపాదించుకొని తనకూఁ
తును పద్మిని యనుదాని నిచ్చి వివాహము చేసెను. అగ్నిహోత్రునియ

నుమతిపై నాపెను వివాహము చేసికొని యగ్నిదత్తయని పేరువడసిన యామెయందు శ్యాలుఁడు హాలుఁడు బల్లుఁడు ననుపేళ్ళుగల ముగ్గురు కొడుకులను గనెను. వారు శుక్లపక్షపుచంద్రునివలె దినదినాభివృద్ధిని బొందుచుండిరి. వారిచే వస్త్రములు నేయించి దేవాంగుఁడు రాక్షసుల కిప్పించెను. తరువాతను దేవలుఁడా ధ్వజమును గైకొని మామయొద్ద సెలవంది తనయామోదపట్టణమునకు వచ్చెను. తరువాతను శివుని సేవించుటకై యతఁడు కైలాసమునకుఁ బోయి యుండఁగా నతనిని జూచి శివుఁడు కోపించి యిట్లనియె. ఓరీ బుద్ధిహీనుఁడా! నే నిచ్చినధ్వజమును రాక్షసుల కిచ్చి దేవతలను హింసింపఁజేసితివి కావున నీవు మహిమ పోయినవాఁడవయి విద్యాధరుఁడవుకమ్ము. అనియిట్లు శివునిచే శపింపఁబడి యచ్చటనుండి యామోదపట్టణమునకు వచ్చి తనవృత్తమంతయు నచటివారితోఁ జెప్పెను. తరువాతను దేవాంగునిశరీరము లింగమైపోయినది. అది యామోదపట్టణమున రామలింగేశ్వరుఁ డనుపేరునఁ బ్రసిద్ధికెక్కినది. దేవాంగునికుమారుఁ డగుదివ్యాంగుఁడు రామలింగేశ్వరుని బూజించుచు భూమిని బాలించుచుండెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమున దేవాంగుని యవతారపూర్తి యన్నది పదునెనిమిదవ యధ్యాయము.

---

పందొమ్మిదవ యధ్యాయము.

సూతుఁడు—మునులారా! మేరువున కుత్తరమునఁ బాంచాలమను దేశము గలదు. అందు సత్యసంధుఁ డనురాజు పాలించుచుండెను. అతఁడు దయాళువు కీర్తిమంతుఁడు ప్రాజ్ఞుఁడు తేజస్వి, సర్వసమ్మతుఁడునునయి యుండెడివాఁడు. అతని కిందుముఖి యనుకూఁతురు గలదు. ఆమె సర్వలక్షణసంపన్నురాలు. లోకములలోని లావణ్యమంతయు నొక్కచోట రాశిపోసిన ట్లామె వెలుఁగుచున్నది. ఆమె యొకనాఁడు చెలికత్తియలతోఁగూడి క్రీడకై యుద్యానవనములోఁ బ్రవేశించెను. యావనవంతురాలైన యారాజపుత్త్రి సఖిజనముతోఁగూడి యుద్యానవనములోని చెట్లక్రిందను విహరించుచుండఁగా నొకవిద్యాధరుఁడుచూచి యామెను మోహించెను. ఆమెతో మాటలాడుటకు సమయమును గాచుకొని యతఁ



డుండెనే కాని యామెను విడిచిపోఁజాలఁడాయెను. అట్లుండి చెలికత్తియల కగపడకుండ నామెమనస్సును దెలిసికొందమనునభిలాషతో నామెకగపడెను. రెండవమన్మథుఁడో యన నున్నయావిద్యాధరునిజూచి యామెయు మోహావశవందురాలాయెను. ఆమె యతనియభిప్రాయమును దెలిసికొని తనసఖులను దూరముగా విడిచి యొకరహస్యస్థలమునకేఁగి యావిద్యాధరునితో నిట్లనియె.

ఇందుముఖి—పురుషవ్యాఘ్రమా! నీ వెవరు? నీ పేరేమి? ఎచ్చట నీయునికి? నీసంగతి యంతయు నిజముగాఁ జెప్పుము. అని యామె యడుగఁగాఁ దనకోరిక పూర్తి యగుననుసంతోషముతో నావిద్యాధరుఁ డిట్లనియె. సుందరీ! బ్రహ్మపుత్త్రుఁడగు వజ్రమాళి యను విద్యాధరునికుమారుఁడను. నాపేరు హేమవర్ణుఁ డందురు. నిన్నుఁజూచినది మొదలు నామనస్సు నీయందు లగ్నమయి యున్నది. విలాసినీ! విలాసపూర్ణము లగునీ క్రేగంటిప్రసారములచే నన్నానందింపఁజేయుము. అని యతఁ డనఁగానే మొదలే యతనినిజూచి మోహితురాలయి యుండుటంజేసి యపుడు మఱింతయనురాగము గలదియై యతనియభిలాషము నంగీకరించినది. మఱియు నతనితోఁ జెప్పవలసినమాట లన్నియుఁ జెప్పి యతనిచేఁ బ్రమాణము చేయించుకొని యతనితో నిట్లు సంకేతము చెప్పినది. సుందరా! నేను శృంగారపురరాజగుసత్యసంధునికుమారితను. మాతండ్రియింటికి వెనుకభాగమునందుఁ జంద్రకాంతి గలప్రాసాదము నానివాసస్థానము. నేనందుఁ జెలికత్తెలతో మాత్రమే యుందును. నీవు నేఁటిరాత్రికిఁ దప్పక యామేడకు రమ్ము. తరువాతఁ గాఁగలకార్య మెట్లో యగుఁగాక. అని యతనితోఁ జెప్పి చెలికత్తెలతో నింటికిఁ బోయినది. తరువాతను సంకేతము దెలిసికొన్న యావిద్యాధరుఁ డామెయొద్దకుఁ బోయి చిరకాల మాసుందరితోఁగూడి యమందానందమునొందుచుండెను. ఆదంపతు లన్యోన్యమును గాఢానురాగము గలవారైరి కాని యెవ్వరికిని దెలియదాయెను. ఇట్లొకవత్సరము గడచినది. అతనివలన నామెకుఁ గుమారుఁడు గలిగెను. సర్వలక్షణసంపన్నుఁ డగు నాకుమారునికిఁ గమలాక్షుఁడని నామకరణము చేసిరి. ఆబాలుఁడు బాలసూర్యునివలె వృద్ధిఁ బొందెను. ఆమె మూఁడు నెలలవఱకును బాలుని

సంగతియే తనతల్లి మొదలగువారి కెవ్వరికిని దెలుపకయే దాచి కాపాడుచుండెను. తరువాత నొకనాఁడు తనప్రియుఁ డగువిద్యాధరునితో నామె యిట్లన్నది. వల్లభా! ఇంతవఱ కెట్లో మనమిద్దఱమును సంతోషముగా నుంటిమి గాని యిటుపైని నీ విచ్చట నుంటివేని మనకు మర్యాద దక్కదు. కావున నెట్లో నాయందలి యనురాగలతను గోసివైచికొని నీయిష్టమువచ్చినచోటికిఁ బొమ్ము. నీవు పోవునపు డీబాలుని గూడఁ దీసికొనిపొమ్ము. నావిషయమై నీవు గాని నీవిషయమై నేను గాని విచారించిన లాభము లేదు. దైవము మన కింతవఱకే సంయోగమును గల్పించి యున్నాఁడు. నీవు విచారింపక వేగముగాఁ బొమ్ము. అని యామె చెప్పినహితవచనములువిని యేమిచేయుటకును దోఁచక చింతాక్రాంతుఁడై యావిద్యాధరుఁ డాబాలు నెత్తుకొని తిన్నఁగా స్వర్గమునకుఁ బోయెను. కమలాక్షుఁ డనునాబాలుఁడు యౌవనవంతుఁడై సకలవిద్యలను నేర్చుకొని యాదఱను సంతోషింపఁ జేయుచుండెను. ఆతనికి రానివిద్యయే లేదన్నపు డీక విభజించి చెప్పనేలా? సమస్తజనులును నతనివిద్యాచమత్కారమున కమందానందమును బొందుచుండిరి. అపుడుశివభగవానుఁ డూరకయుండెను. ఈరీతిగా నాహేమవర్ణునికుమారుఁ డగుకమలాక్షుఁడు ప్రతిదినమును శివునిసమీపమునఁ దనయన్నివిద్యలను వినిపించుచుండెను. ఇట్లుండఁగా నంబికకుఁ బరమభక్తుఁడును విద్యావంతుఁడును బుద్ధిమంతుఁడును నగువివిత్సుఁ డను విద్యాధరుఁ డాకమలాక్షునిచే విద్యలలో నవమానింపఁబడి వాని నణఁచుటకై పార్వతిని బ్రార్థించెను. దేవీ! అంబికా! భక్తవత్సలురాలా! నీకు నమస్కారము. నేను గమలాక్షుఁ డనుపిన్నవానిచే విద్యలలో నోటమి చెందితిని. కావున నీవు నాకై దేవీ! ఎట్టులయినను వానిపొంక మణఁచక తీరదు. అని యతఁడు ప్రార్థించినప్రార్థనను జిత్తగించి యాదేవి యట్లే చేయుదునులే, అని యతనిని సంతోషపఱిచినది. తరువాత నొకనాఁడు శివునిసన్నిధిలో నాకమలాక్షుఁ డందఱు పండితులను విద్యాగోష్ఠిచే సంతోషపఱిచెను. కాని శివుఁడుమాత్ర మాతనివిద్యావిశేషముల కొక్కింతయు సంతసించుటయే లేదు. అట్లు సంతోషింపనిమగని జూచి దేవి యిట్లనియె. దేవా! కమలాక్షునివంటివిద్వాంసుఁ డెచ్చటను లేఁడుగదా! వానివిద్యావిశేషము



లకుఁ దామేల యానందింపకుండ నున్నారు? అని యడిగినదేవితో దేవదేవుఁ డిట్లనియె. దేవీ! నిజముగాఁ గమలాక్షునివంటి విద్వాంసుఁడు లేనేలేఁడు. కాని వాఁడు చిరకాల ముండెడివాఁడు మాత్రము కాఁడు. అందుచే నేను సంతసింపనైతిని. ముందు వాఁడు తనయిప్పటిశరీరమును విడిచి పుష్పదంతుఁ డనుపేరునఁ బుట్టఁగలఁడు. అని చెప్పినపెనిమిటిమాటలు విని యాయనమాటల ననుసరించి భక్తపోషణతత్పరురా లయిన యాదేవి యపుడే కమలాక్షునిముఖము చూచి "కమలాక్షా! నీవిటుపయిని శంకరుని యాజ్ఞవలనఁ బుష్పదంతుఁడవగుముపొమ్ము" అని యనఁగానే యతఁడు వ్యాకులపడి శివునికి నమస్కరించి తనయింటికిఁబోయెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమున విద్యాధర ప్రశంస యన్నది పందొమ్మిదవ యధ్యాయము.

---

## ఇరువదియవ యధ్యాయము.

సూతు—మునిపుంగవులారా! తరువాతను యుగంధరదేశమున హేమవతి యనుపట్టణములో శ్రుతకీర్తి యనురాజునకు సోమవతి యను భార్యయం దీకమలాక్షుఁడే పుష్పదంతుఁడై పుట్టెను. సింధురాజగువిరూపాక్షునియింట నాకమలాక్షునిభార్య యగుదేవదత్త యనునామె పుట్టినది. ఆపిల్ల పుట్టఁగానే యాకాశవాణి యాబాలకు దేవదత్తయని పేరు పెట్టుఁడన్నది. తలిదండ్రు లట్లే చేసిరి. మఱికొన్నాళ్ళు గడచినతరువాత శ్రుతకీర్తి తనకుమారుఁ డగుపుష్పదంతునకు విరూపాక్షునికూఁతు రగుదేవదత్తను వివాహము చేసెను. ఆరాజు తనరాజ్యభారమంతయుఁ గుమారుని కప్పగించి భార్యతోఁగూడఁ దపోవనమునకుఁ బోయెను. తండ్రిసింహాసనమున కధికారియై తండ్రిని మఱపించి యాపుష్పదంతుఁడు రాజ్యమేలుచుండెను. అతఁడు ప్రతిదినమును బదునొకండువేలదివ్యలింగములకుఁ బూజచేయక జల మయినను ద్రాగువాఁడుగాఁడు. శివభక్తివశంవదుఁ డగుటచే రుద్రాక్షులచేఁ గిరీటము హారములు కంకణములు చేయించుకొని ధరియించుచు భస్మాలంకృత శరీరుఁడై యతఁ డెప్పుడును గనుపించుచుండెడివాఁడు. మఱియు నతఁ డెల్లవేళలయందును శివునినే ధ్యానించుచు శివునికథలు వినుచు నానందమును

40

బొందుచుండెను. తరువాత నాపుష్పదంతుఁ డనేకవిధము లయిన లతా పాదపములచే విరాజిల్లు నొకదివ్యమయిన యుద్యానవనమును వేయించి తాను దగ్గఱనే యుండి యన్నింటికిని నీరు పోయించుచు నాయాకాలములయందు దోహదము చేయించుచు నుండెను. అవియు నతని మనస్సు సంతుష్టిని బొందులాగున బూవులతో నిండారి యుండెడివి. అతఁడాపూలు తానేకోసి ప్రతిదినమును శివుని బూజించుచుండెను. తరువాత నొకనాఁడు శివరాత్రి వచ్చినది. నాఁ డతఁడు శివాలయమునకుఁ బోయి భక్తిపూర్వకముగాఁ బూజించి ముప్పదిరెండు శ్లోకములచే శివుని స్తుతిచేసెను. స్తోత్రప్రియుఁడైన శివుఁ డాతని స్తుతికి సంతోషించి దివ్యతేజోమయుఁడై యతనికిఁ బ్రత్యక్షమయి పుష్పదంతుని జూచి యిష్టమయినవరము కోరుకొమ్మనెను. అనఁగానే యతఁడు సంతోషించి శివునికి సాష్టాంగదండప్రణామము లాచరించి "దేవా! నాయందుఁ గరుణగలవాఁడవై తివేని నాకుఁ బ్రతిదినమును మీపుణ్యదంపతులు దరిసెనమిచ్చుచుండఁగోరితిని. భక్తునియందు దయ యుంచి యీమాత్రపువరమిమ్ము" అని యీప్రకారముగాఁ బుష్పదంతుఁడు యాచించినతోడనే "యట్లే యిచ్చితిని వర" మని యాపుష్పదంతుని సంతోషపెట్టి యచ్చటనే యంతర్ధానమాయెను. తరువాత నాపుష్పదంతుఁడు శివునిదయవలన భార్యతోఁగూడఁ గైలాసమునకుఁ బోయి ప్రతిదినమును దేవదర్శనము చేసికొని యానందించుచుండెను. పుష్పదంతుఁడును, అతనిభార్యయు మనోహరముగాఁ బూలహారములు, బంతులు మొదలగునవి గట్టి యాపుణ్యదంపతులకు సమర్పించుచుండిరి. ఇట్లుండఁగా నొకనాఁడు పుష్పదంతుఁడు పువ్వులు పట్టుకొని పార్వతీపరమేశ్వరులకు సమర్పించుటకై కైలాసమునకు వెళ్ళునప్పటికి వారు రహస్యమందున్నారని తెలిసినది. అతఁ డాపుష్పములు సమర్పింపవలయు నన్నభక్తిభావముతో ద్వారమందు వేచియుండెను. అపుడు రహస్యస్థలమం దున్న పార్వతిని జూచి చెలికత్తెలు రహస్యమయిన కథచెప్పి సంతోషపెట్టవలయునని కోరిరి. నిర్జనప్రదేశము గదా యని "దేవా! తాము సర్వజ్ఞులరు. కావున నిదివఱకెవ్వరును వినని కథ చెప్పినచో సంతోషించెద" నని దేవి పెనిమిటి నడిగినది. భార్యయందలి ప్రేమాతిశయముచేత నతఁ డట్టి

కథనే చెప్పెను. ద్వారమం దున్న పుష్పదంతుఁడు గూడ నాకథ విని తరువాతను సమయము మాచుకొని లోనికి వెళ్ళి దేవసన్నిధానమునందుఁ బుష్పములు సమర్పించి మరలి తనపట్టణమునకు వచ్చెను. అతఁ డింటికి వచ్చునప్పటికిఁ జాలరాత్రి మించిపోయినది. ఈలోఁగా నాతని భార్య దేవదత్త భర్తరాకకై యెదురు చూచిచూచి తుదకు నేసారి యెచ్చటికో జారవృత్తికై పోయి యుండునని నిశ్చయించుకొని నిదురపోయినది. ఇంతటఁ బెనిమిటి యింటికి వచ్చినసంగతి తెలిసికొని యామె కోపపూర్ణురాలై యేపాపము నెఱుఁగని యాతపస్విని జారుఁడవై పోతివని యనేకవిధములుగా నిందించినది. అట్లు నిందించుచున్న భార్యను జూచి యారా జిట్లనియె. సుందరీ! యేమీ యనన్యట్లనుచున్నావు! నేనట్టివాఁడ ననియె భావించుచున్నావా! ఊరక నన్ను నిందింపక శాంతచిత్తురాలవై నేను జెప్పుమాటలాలకింపుము. నేను శివభగవానులవారికిఁ బుష్పములు సమర్పించుటకై వెళ్ళునప్పటికి సమయము కాకపోయినది. అంతట నేను ద్వారమునందుఁ గాచుకొని యుంటిని. అపుడు దేవి పరమేశ్వరుని రహస్యమైనకథ చెప్పుమని కోరినది. ఆమె కోరినరీతిగా మహేశ్వరుఁడు రహస్యమైన కథచెప్పెను. నేనును ద్వారముదగ్గఱ నుండి యాకథ విని తరువాతను బుష్పముల సమర్పించి యిప్పటి కింటికి వచ్చితిని. అందుచేత నింతాలస్య మయినది. అని పెనిమిటి చెప్పఁగానే యామె నిస్సంశయురాలై యాకథయెట్టిదో నాకుఁ జెప్పుమని కోరినది. ఆమె కోరఁగానే యతఁడు భార్యయందలిమోహముచే దాఁచఁదగిన యాకథ యంతయు నామెను వినిపించెను. మఱునాఁ డాదేవదత్తయుఁ బుష్పదంతుఁడును బార్వతీపరమేశ్వరులను సేవించుటకై కైలాసమునకుఁ బోయిరి. అదివఱకుఁ జెలికత్తె లడిగియున్న వారగుటచే దేవి యపూర్వమైనకథ చెప్పుచుండఁగా దేవదత్త యిట్లనియె. సఖులారా! ఆతరువాతి కథ నేను జెప్పెదను మీరు వినుఁడు. అని యనఁగానే పార్వతి దేవదత్తను జూచి నీవే చెప్పుము వినియెదరన్నది. దేవియాజ్ఞ కాఁగానే రాత్రి శివుఁడు తనకుఁ జెప్పినరహస్యమైనకథనే దేవదత్త జెప్పినది. ఆకథ విని కోపించి వెంటనే పార్వతి శివునియొద్దకుఁ బోయి "దేవా! బాగుబాగు తాము సర్వజ్ఞుల రయ్యు నన్నృతము చెప్పితిరిగదా! రాత్రి తాము నాకుఁ

చెప్పినకథనే యిపుడు దేవదత్త చెలికత్తెలకుఁ జెప్పినది. అహహా! తమవంటివారే నావంటివానితో నిట్లు బొంకినపుడిఁక నేమనఁగలను" అని పార్వతి యనఁగానే శివుఁడు విస్మయక్రోధ మూర్ఛితుఁడై దేవదత్తను రావించి "దేవదత్తా! నీకాకథ యెవ్వరు చెప్పిరి?" అని యడుగఁగా "దేవా! నాపెనిమిటి నాకాకథ చెప్పెను" అన్నది. ఆమె చెప్పినమాట విని శివుఁడు పుష్పదంతునిచూచి "ఓయీ! నీకాకథ యెట్లు తెలిసినదియు నిజముగాఁ జెప్పుము" అని యడుగఁగాఁ బుష్పదంతుఁడు వడవడవడఁకుచు హీనస్వరముగా నిట్లనియె. స్వామీ! నా కేమియుఁ దెలియదు. నిన్నటి రాత్రి దేవరకుఁ బుష్పములు సమర్పించుటకై వచ్చి ద్వారమునందు వేచియుండి తమరు పరమేశ్వరికిఁ జెప్పుచుండఁగా విని యది దేవదత్తకుఁ జెప్పితిని. నేనే యపరాధిని. నన్ను దండింపవలయును. నాభార్య నిరపరాధురాలు కావున దానిని దండింపఁదగదు. అని యతఁడు చెప్పుచుండఁగా శంకరుఁడు కోపపూర్ణుఁడయి పుష్పదంతుని వానిభార్యను శపించెను. మఱియు నతనిని జూచి ఓరీ మూర్ఖా! నీచా! కామమోహితా! రహస్యములయిన మామాటలు వింటివిగా! వినుటయే కాక తెలివిమాలి యవి నీభార్యకుఁగూడఁ జెప్పెదవుగా! నీకంత మోహమఁటరా. ఉండుండుము నీకుఁ దగినశాస్తి చేయించెదను. నీవిటుపయిని బేతాళుఁడవై ఘోరరూపముతో నుండుము. సఖులకును పార్వతికిని నవమానము చేసిననీభార్య దేవదత్త దుర్మార్గురాలు హరిణి యగుఁగాక. అని యిట్లు ఘోరముగ శపించుచున్న శివునిచూచి పుష్పదంతుఁడు భయపడి దుఃఖించుచు భార్యతోఁగూడ నిట్లని ప్రార్థించెను. దేవదేవా! దయాసముద్రా! భక్తవత్సలా! మమ్ము రక్షింపుము. మాశాపమున కంతము సెలవిమ్ము. దుస్తరమగు నీశాపసముద్రమును దరించు నుపాయ మానతిమ్ము. అని యిట్లనేకవిధములుగాఁ గొనియాడిన పుష్పదంతుని జూచి శివుఁడిట్లనియె. ఓరీ! నీభార్య పగలు లేడిగాను రాత్రి యతిస్త్రీగాను నగును. మీయిద్దఱకు నన్యోన్య దర్శన మయినతోడనే దుస్తరమగు నాశాపమునుండి ముక్తులగుదురు. ఇటుపయిని గలియుగమందు విక్రమాదిత్యుఁ డనుపేరుగల రాజు పుట్టఁగలఁడు. అతఁడు దయాసముద్రుఁడు



సత్యసంధుఁడు తేజశ్శాలి పటువిక్రముఁడు మహాబాహువునై యుండును. అతనిచే నిపుడు చెప్పిన దంతయు జరుగును. అని వానితోఁ జెప్పి వెంటనే యంతఃపురములోనికిఁ బోయెను. తత్క్షణమే పుష్పదంతుఁడు రాజవేషమునంతయు విడిచి ముసలము, ముద్గరము, భిండివాలము, పరశ్వథము, పట్టసము, తోమరము, ఖడ్గము, గద, కుంతము, లగుడము, నారితోఁగూడిన ధనుస్సు, బాణములు, భయంకరమైనఛురిక, చంద్రహాసము, శత్రువులను జీల్చుతోమరము మొదలగు నాయుధములు ధరించి యాథర్వణమంత్రములకు గురువై సమస్తరాజులకును శిక్ష చెప్పుచు శత్రువులకు భయంకరుఁడై చతుష్షష్టికలాపూర్ణుఁడును, సర్వకర్మముల నెఱిఁగినవాఁడును, భూతప్రేత పిశాచశాకినీ ఢాకిన్యాదులకు యజమానుఁడును, వక్రతుండుఁడును, వక్రపాదుఁడును, పొట్టిచేతులవాఁడును, కృశించిన యుదరముగలవాఁడును, దీక్ష్ణము లయిన దంతములు గలవాఁడును, కొంగకంఠమువంటి కంఠముగలిగి ముండ్లవంటి గడ్డము మీసము గలవాఁడై వెడల్పయిన నోరుగలవాఁడును, ఘోరమైన రూపము గలవాఁడును, భయంకరుఁడును, దీర్ఘనాసుఁడును, దీర్ఘకర్ణుఁడును, భయంకరమైన కన్నులు గలవాఁడును, పెద్దనుదురు గలవాఁడును, భయంకరములయిన లక్షణములు గలవాఁడును, భూతముల కధిపతియు, జటలుగలవాఁడును, రాజులందఱకును ఖడ్గయుద్ధము నుపదేశించువాఁడును, ధనుర్వేదము నుపదేశించువాఁడును, నగుబేతాళుఁడుగాఁ బరిణమించి యుజ్జయినీపట్టణమునకుఁ దూర్పుగా నుండు మహారణ్యములోఁ బ్రవేశించి యతిభయంకరమును శతయోజనవిస్తీర్ణమును నగు నాయడవిలోని యొకమఱ్ఱిచెట్టును జూచి యాచెట్టుపైని దూర్పువైపున నున్నకొమ్మ నాశ్రయించి యుండెను. అతనిభార్యయగు దేవదత్త పుష్పిణి యని ప్రసిద్ధి నొందినది. ఆమె పార్వతీపరమేశ్వరుల శాపమువలన లేడిరూపమును బొంది యామహారణ్యమునందే లేడిమందలతోఁ గలసి యిటునటుఁ బరువు లెత్తుచు నాలుగుదిక్కులను జూచుచు మాటిమాటికిని దన నీడను జూచుకొనుచు తల పైకెత్తి భయంపడుచుఁ బగటిపూటను దర్భాంకురములను లేతగడ్డి దినుచు నెండమావులను జూచి జలమను భ్రాంతిచే మాటిమాటికిని బరువు లెత్తుచు నుండెను. మఱియు నాలేడి రా

త్రిసమయమున యక్షిణియయి షడ్జాదిస్వరయుక్తముగను, తంత్రీలయస మన్వితముగను వినువారి కానందముగలుగునట్లుగ శివునిస్తుతితో సంబంధించినగీతములు పాడుచునుండెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమునఁ
బుష్పదంతోపాఖ్యానము, బేతాళశాపప్రదానము
నన్నది యిరువదియవ యధ్యాయము.

---

## ఇరువదియొకటవ యధ్యాయము.

సూతుఁ—మునీశ్వరులారా! తరువాతను భూలోకమునఁ గలియుగము మిక్కిలిదారుణముగా వృద్ధిని బొందుచుండఁగా వేదనారాయణపురమునందు విష్ణుశర్మ యనుబ్రాహ్మణుఁ డొకఁడుండెడివాఁడు. అతనికి మిక్కిలిని తేజశ్శాలు రగు నలుగురుకొడుకులు పుట్టిరి. యజ్ఞనారాయణుఁడు, వేదనారాయణుఁడు, వీరనారాయణుఁడు, చంద్రశర్మ యని వారిపేళ్ళు. నాల్గవవాఁడుదక్కఁ దక్కినముగ్గురును సర్వశాస్త్రవిశారదులయిరి. అందఱును నీతిశాస్త్రపారంగతులు. వ్యవహారజ్ఞానము గలదు. ఆలోచన చెప్పుటయందు మహాబుద్ధిమంతులును గుణవంతులు నయియుండిరి. వారందఱును దమతమపాండిత్యమును జూపించి సభలలో బహుమానింపఁబడుచుండిరి. బుద్ధిహీనుఁడగుచంద్రశర్మ యనువానిని శుశ్రూషకై యుపయోగించుచుండిరి. ఇట్లు కొంతకాలము జరుగఁగా నతఁడు వారికి సేవ చేయుటకై విరక్తి నంది యిట్లు చింతింపఁ దొడఁగెను. నేను విద్యాహీనుఁడ నగుటచేఁ గదా నాయన్నలు నాచేత సేవ చేయించుకొనుచున్నారు. నా కెట్లు విద్యలు వచ్చును? అని యిట్లనేకవిధములుగాఁ జింతించి దైవప్రేరణవలనఁ దనమనస్సులోనియుద్దేశ మెవ్వరికిని జెప్పకయే యర్ధరాత్రసమయమున లేచి యిల్లు విడిచి మార్గముం బట్టి పోవుచుండెను. తెల్లవాఱునప్పటికిఁ జాలదూరము పోయెను. నాఁటిసాయంకాలముదాఁక నడిచి యొకయగ్రహారము చేరుకొనెను. అచ్చటనున్న నదిలో స్నానము చేసి సాయంసంధ్యావందన మాచరించి వేదమాత యగుగాయత్రిని జపము చేసికొనుచుండెను. అపు డానదియొడ్డున నున్న రావిచెట్టుపైని జిరకాలమునుండి యున్న బ్రహ్మరక్షస్సు బ్రహ్మచారి



నిజూచి సంతోషించి బ్రాహ్మణవేషముతో వచ్చి చంద్రశర్మతో నిట్లనియె. నాయనా! నీ వెవరు? ఎచ్చటినుండి వచ్చుచున్నావు? ఎచ్చటికిఁ బోయెదవు? చెప్పుము. అని యడిగిన యాబ్రాహ్మణుని నిజముగా బ్రాహ్మణుఁడే యనుకొని చంద్రశర్మ యిట్లనియె. అయ్యా! వేదనారాయణపురమున విష్ణుశర్మ యనెడి బ్రాహ్మణుఁడు గలఁడు. ఆయనకు నలుగురు కొడుకులు గలరు. నేనే చిన్నవాఁడను. నే నేమహాగురువు నయిన నాశ్రయించి యాయనదయను సంపాదించుకొని చదువుకొందమనుబుద్ధితో బయలుదేఱి యిట్లు పోవుచున్నాను. ఇది నాసంగతి యని యాబ్రహ్మచారి చెప్పఁగా విని యా బ్రహ్మరక్షస్సు బ్రాహ్మణుఁడిట్లనియె. నాయనా! నేను నీకు వేదవేదాంగాదులగు విద్యలను జెప్పఁగలను. నీ కిష్టమయినచో నాయొద్దఁ జదువుకొనుము. అను నతనిమాటలు విని చంద్రశర్మ సంతోషించి మంచిదే యని యంగీకరించెను. వాని సంకల్పమును విని యప్పు డాబ్రహ్మరక్షస్సిట్లనియె. నాయనా! నా రూపమును జూచి భయపడకుము. అని చెప్పి తనమునుపటిరూపమును ధరించి యగపడఁగానే యాచంద్రశర్మ చటుక్కున కన్నులు మూసికొని మిక్కిలి భయపడుచుండెను. తత్క్షణమే యా బ్రహ్మరక్షస్సు మునుపటి బ్రాహ్మణరూపముతో వచ్చి యతని భయము దీఱిచెను. తరువాత నాశర్మను రావిచెట్టుమీఁదికిఁ దీసికొనిపోయి రాత్రింబవళ్ళు నిద్రాహారములు లేకుండ విద్యలు చెప్పుచు నాలుమాసములు గడచినతరువాత "సుందరాకారుఁడ వగు నో చంద్రశర్మా! నేను నీకన్నివిద్యలను నేర్పితిని. నీవలన నాకు శాపమోక్ష మయినట్టే. నీ విపుడే బయలుదేఱి మీయూరికిఁ బొమ్ము. నాయనా! నీదయవలన నేనును గాశికిఁ బోవుచున్నాను. నీ కిటుపయిని వలసినంతమేలు గలుగుచుండును. నీకు గుణవంతులు నలుగురుకొడుకులు పుట్టఁగలరు. వారు సామ్రాజ్యము ననుభవించుచు భూమిని పాలింతురు. అని యిట్లాశీర్వదించి వెళ్ళుట కుద్యుక్తుఁడై న యా బ్రహ్మరక్షస్సును జూచి చంద్రశర్మ యిట్లనియె. గురువుగారూ! తాము వేదవేదాంగపారగులు, సర్వశాస్త్రముల తత్త్వము తమకుఁ దెలిసినవిషయమే. ఇట్టితమకు బ్రహ్మరాక్షసత్వము గలుగుట కేమికారణము? అది యిపుడు పోవుట కేమిహేతు

వున్నది? దీనిని వివరించి చెప్పవలయు నని కోరుచున్నాఁడను. అని యడుగఁగా బ్రహ్మరక్షస్సిట్లనియె. నాయనా! నాశాపమోక్షముల సంగతి వినుము. పూర్వము కృష్ణాతీరమున సరస్వతీపుర మను నొక యగ్రహారము గలదు. ఆయూరిలోనివా రందఱును బండితులే. నే నా యూరివాఁడను. వేదశాస్త్రాదివిద్య లన్నియు నేర్చుకొంటిని. నాదగ్గఱ కొకవిద్యార్థివచ్చి నాకు నమస్కరించి "అయ్యా! నాకు విద్యాదాన ము చేసి రక్షింపుఁడు" అని యడుగఁగా నేను గర్వముతో "ఈలోక ములో నే నెవ్వరికిని వేదాదివిద్యలు నేర్పఁదలఁచుకోలేదు గనుక శీఘ్రముగా నాదగ్గఱనుండి పొమ్ము" అంటిని. అపు డాబ్రాహ్మణుఁడు కోపించి "నేను మఱియొకగురువుదగ్గఱకుఁ బోయి సమస్తవిద్యలను నే ర్చికొందును. బ్రాహ్మణాధమా! నీవిద్య లన్నియు నిష్ఫలములయి నీ యొద్దనే యుండుఁగాక" అని నన్ను బ్రహ్మరక్షస్సుగా శపించెను. తరు వాతను నేను భయముచే గడగడ వడఁకుచు "బ్రాహ్మణా! నాయందు నీవనుగ్రహించి దయ తలఁచుము. శాపాంతమును సెలవిమ్ము" అని యతనిని యాచించితిని. నాప్రార్థన విని "శాంతకాలము గడచిన వెనుకఁ జంద్రశర్మయను బ్రాహ్మణుఁడు దేశాంతరమునందుండి విద్యలు నేర్చు కొనుటకై రాఁగలఁడు. నీకతనితోఁ గృష్ణాతీరమున సమావేశమగును. అతనికి నీవిద్య లన్నియుఁ జెప్పుము. తరువాతను గంగాస్నానము చే యుము. శాపాంతమగును" అని చెప్పి యావిద్యార్థి తనయిష్టమువచ్చి నచోటికిఁ బోయెను. అదిమొదలు నేను బ్రహ్మరక్షస్సునై యీచెట్టు మీఁద నున్నాను. నీరాకకై యెన్నాళ్ళనుండియో యెదురుచూచు చుండఁగా నిప్పటికి దైవవశమున నీవు వచ్చితివి. శిష్యుఁడవగు నీ కన్నివిద్యలను జెప్పితిని. నాయనా! ఇఁక నేను గంగాస్నానము చే యుటకుఁ బోవుచున్నాను. నీకు సదా భద్ర మగుఁగాక. యెక్కడికిఁ బోయినను నీకు జయమే యగుఁగాక. సదా సుఖవంతుఁడవై యుండు ము. అని యాశీర్వదించి బ్రహ్మరక్షస్సాచెట్టుమీఁదినుండి యాబ్రా హ్మణకుమారుని క్రిందికి దింపి యతనితోఁ జెప్పి పాపహారిణియగు గంగ లో మునుఁగుటకై పోయెను. తరువాతను చంద్రశర్మయు విద్యాపారంగ తుఁడై సరతోషించుచుఁ దనయూరు పోవ నెంచి మఱియొకత్రోవను



బయలుదేఱెను. తిన్నఁగా నుజ్జయినీపట్టణము ప్రవేశించి వేశ్యామం దిరము చూచి నిద్రాహారవివర్జితుఁడును శ్రమాతురుఁడును నయి యున్న కతమునఁ గృత్యాకృత్యవివేచన పోయి యది బ్రాహ్మణగృహమే యనుబుద్ధిచే నాయింటి యరుగుమీఁదను గుడ్డ పఱచుకొని యొడ లెఱుఁగకుండ నిదుర పోయెను. సౌందర్యవతి యనుపేరుగల యాయిం టిసానిగుంట యతనిని జూచి "యితఁడు నాకుభర్తయగుఁగాక" యని మనసులో నిశ్చయించుకొని తల్లి దగ్గఱ కేఁగి "అమ్మా! నీయల్లుని జూడుము. నామనోహరుఁడు రెండవమన్మథునివలె నాయరుగుమీఁ దను నిద్రపోవుచున్నాఁడు" అన్నది. తల్లి కూఁతుమాట విని వేగముగా వచ్చి నగలు నాణెములు లేని యాబ్రాహ్మణుని జూచి "వీఁడు శుద్ధదరి ద్రుఁడు" అని తలఁచి కోపపరీతచిత్తయై కూఁతుం జూచి "అమ్మా! నీకు వీఁడు తగినవాఁడుకాఁడు. వీఁడు శుద్ధదరిద్రుఁడు. దరిద్రుని వరించుట కంటె సానిబ్రదుకున కవమాన మనఁగా నుండునా? ఎట్టివాఁడు గాని మనకు ధనవంతుఁడే మన్మథుఁడు. తక్కినవానితో మనకెంతమాత్ర మును బనిలేదు. ధనమును మాత్రమే మనము చూడవలయును. కావు న లేనిపోని యభిలాషలు మాని ధనముగల మఱియొక లక్ష్మీపుత్రుని వరింపుము" అని తల్లి చెప్పినది. కాని యాకన్య వినియు విననట్లు చేసి "నాకితఁడే భర్త" అని మరలఁ దల్లితో నన్నది. ఎట్టకేలకు కూఁతు నభి ప్రాయము వేశ్యమాతయు నంగీకరించినది. ఆఱునెలలనుండి నిద్రాహా రము లెఱుఁగనికతమున నావటువు కాలుసేతులు గదల్చకుండనే యా లోపలియరుగుమీఁదను బరుండి నిద్రపోవుచుండెను. రాత్రియుఁ బవ లును నట్లే పడియున్న యాబ్రాహ్మణుని జూచి యావేశ్య వేగముగాఁ బోయి యావృత్తాంత మంతయు రాజుతో విన్నవించినది. ధ్వజకీర్తి యను రాజు వేశ్య చెప్పినమాటలు విని మిక్కిలి యాశ్చర్యమును బొంది వైద్యులను బిలిపించి "ఓవైద్యులారా! మీరు వేగముగాఁ బోయి వేశ్యామందిరమున నిదురించుచున్న బ్రాహ్మణుని జూచి లెస్స గా నతనినాడిని బరీక్షించి యట్టి గాఢనిద్రకుఁ గారణ మేమయి యుం డునో శాస్త్రమును బట్టి తెలిసికొని వేగముగా వచ్చి మాతో విన్నవిం పుఁడు. అని రాజాజ్ఞాపించినతోడనే రాజవైద్యులు తిన్నఁగా సానియిం

44

టికిఁ బోయి యాబ్రాహ్మణుని జూచి యతనిధాతువులను బరీక్షించి యతనివృత్తాంత మంతయు నిట్లు విన్నవించిరి. రాజోత్తమా! ఆబ్రాహ్మణుఁడు నిద్రాహారములు లేకుండ నెందులకో కాని యాఱుమాసములనుండి దీక్ష పట్టినట్టు కనుపట్టుచున్నది. కారణముమాత్రము దెలిసినది గాదు. కాని యతనికిఁ జికిత్స చేయవలయును. అతని దేహమున కన్నపులేపన చేయవలయును. అదియు మెత్తగా నూఱి పెరుగుతోఁ గలిపి పట్టించవలయును. అని రాజుగారితో విన్నపించి వైద్యులు తమయిండ్లకుఁ బోయిరి. తరువాత నామహారాజు వైద్యులు చెప్పిన చికిత్సను బ్రాహ్మణులచేఁ జేయించెను. ఇట్లాఱునెలలు చేసినతరువాత నావటువు నిద్ర విడిచి "నే నెచ్చటను నిద్రపోతిని? ఈ యిల్లెవరిది? ఈ సుందరాంగి యగు సుందరియెవరు?" అని మాటిమాటికిని మనసులో యోజింప మొదలిడెను. తరువాతను దన దోవనుబట్టి పోవుట కుద్యుక్తుఁడు కాఁగా నావేశ్యకన్యక యడ్డుకొని యతని వస్త్రాంచలము పట్టుకొని యిట్లనియె. ప్రియా! నన్ను విడిచి నీవెచ్చటికిఁ బోయెదవు? నే నాఱుమాసములనుండి యెప్పుడు నిదురనుండి లేతువోయని యెదురు చూచుచుంటిని. నీకు సేవచేయుచుంటిని. నీవే నాభర్త వని మనస్సులో నిశ్చయించుకొంటిని. మాయమ్మతో ఘోరముగా జగడమాడితిని. కావున నీవు నన్నుఁ బరిగ్రహింపుము. అట్లే నీవు చేయనిచో నీయెదుట నే ప్రాణములు విడుచుటకు సిద్ధముగానున్నాను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమునఁ జంద్రశర్మోపాఖ్యాన మన్నది యిరువదియొకటవ యధ్యాయము.

---

## ఇరువది రెండవ యధ్యాయము.

సూతుఁ—ఇట్లు పట్టుదల వహించి చెప్పుచున్న యావేశ్యకన్యక మాటలు విని బ్రాహ్మణుఁ డిట్లనియె.

సుందరీ! బ్రాహ్మణుఁడ నగు నే నెచ్చట? శూద్రస్త్రీ వగు నీ వెచ్చట? నీకును నాకును బాణిగ్రహణ మెట్లు సంఘటించును? అని యెన్నివిధముల నిరాశావచనములు చెప్పినను వేశ్యకన్య యాబ్రాహ్మణుని విడువదాయెను. అచ్చట నున్నవా రాతనివృత్తాంత మంతయు





రాజుతో విన్నపించిరి. అదివిని రాజు దయగలవాఁడై వారినిద్దఱను బిలిపించి సమాధానపఱుచుటకు శక్తుఁడుగాక యాలోచించి బ్రాహ్మణులను బిలిపించి యావృత్తాంత మంతయుఁ జెప్పెను. మఱియు నోబ్రాహ్మణోత్తములారా! మీరే సమాధానపఱుచుఁడనెను. ఆ బ్రాహ్మణులును రాజుచెప్పినమాటలు విని శాస్త్రములను బర్యాలోచించి స్మృతిచోదిత మయినవిధియున్న దనిరాజుతో విన్నపించిరి. బ్రాహ్మణునకు ముందుగా బ్రాహ్మణకన్యను, తరువాతను క్షత్రియకన్యను, పిదప వైశ్యకన్యను, ఆవల శూద్రకన్యను వివాహము చేయనచ్చు ననిరి. ఇట్లు బ్రాహ్మణులు చెప్పఁగానే రాజు చాలసంతోషించెను. చంద్రశర్మయు సంతోషించెను. తరువాతను రాజు మంచిముహూర్తమునఁ బురోహితునికన్యను వివాహముచేయించి తరువాతను దనకుమారితను జంద్రశర్మకిచ్చెను. తరువాతను గోమటికన్నెను, పిదప శూద్రకన్యను బెండ్లిచేయించెను. రాజు తనయల్లుఁడగు చంద్రశర్మకుఁ జతురంగబలసహితముగాఁ దన యర్ధరాజ్యమునిచ్చి సుఖముగానుండెను. చంద్రశర్మయు నలుగురుభార్యలతోడను సంతోషించుచు సుఖముగనుండెను. ఇట్లు చంద్రశర్మ యుజ్జయినీపట్టణమున నే కొన్నాళ్లుండఁగా నింతట నాపట్టణపురాజయిన ధ్వజకీర్తి స్వర్గస్థుఁడాయెను. తరువాతను మంత్రులు పర్యాలోచించి వెంటనే చంద్రశర్మనే రాజుగాఁ జేసిరి. పిదపఁ జంద్రశర్మకు బ్రాహ్మణస్త్రీయందు వరరుచియు క్షత్రియస్త్రీయందు రాజాధిరాజగు విక్రమార్కుఁడును వైశ్యస్త్రీయందు భట్టియు శూద్రస్త్రీయందు భర్తృహరియు ననువారుపుట్టిరి. ఆనలుగురును మిక్కిలి బుద్ధిమంతులును సర్వవిద్యానిపుణులును నీతిశాస్త్రవిశారదులును నయి యొప్పుచుండిరి. వారిలో విక్రమార్కుఁడు మహాబలుఁడు, సాహసాదిగుణవంతుఁడు, మహాదాతయని యెఱింగి చంద్రశర్మ యితఁడు ధ్వజకీర్తిమహారాజునకు దౌహిత్రుఁడని యాలోచించి యథావిధిగా నతని నారాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిజేసి సర్వదేశములకును రాజునుగాఁ జేసెను. వైశ్యస్త్రీయందుఁ బుట్టిన భట్టి నావిక్రమార్కునకు మంత్రినిగా నప్పగించెను. తరువాతను విక్రమార్కుఁడు చిరకాలము కాళినిగూర్చి తపస్సు చేయఁగా నామె ప్రత్యక్షమై "రాజా! నీతపమునకు మెచ్చితిని. నీవు

సహస్రసంవత్సరములు జీవించి రాజ్యమేలుకొనుము. నీకు శాలివాహనుఁడు దక్క దక్కినవారెవ్వరును శత్రువులులేరు ; అని యతనికి వరమిచ్చి యచ్చటనే యంతర్ధానమయినది. పిదప విక్రమార్కుఁ డింటికి వచ్చి తనకుఁ గాళికాదేవి యిచ్చిన వరప్రదానమును మంత్రియగు భట్టికిఁ దెలుపఁగా నాతఁడు సంతోషించి రాజా! నేనును నీకట్టివరము నే యిచ్చెదను గైకొమ్మనెను. ఇట్లుచెప్పిన భట్టిమాటల నాక్షేపించి "ఓయీ! నీవు నాకెట్లు వరమీయఁగలవు" అనఁగానె భట్టి "సహస్రాయువు గలవాఁడవగు" మనెను. అది యెట్లనఁగా నీ వాఱునెలలవఱకును రాజ్యమేలుచుండుము; మఱి యాఱునెలలు భూసంచారము చేయుచుండుము. ఇట్లు చేయుచుంటివేని రెండువేలసంవత్సరములవఱకును జీవింపవచ్చును. అని చెప్పిన భట్టిమాటల కెంతయు సంతసించి యతనియుక్తి వైచిత్ర్యమునకు మెచ్చుకొని "నీవు మంత్రివై నందులకు యుక్తియుక్తముగాఁ జెప్పితివి. నీవ యుత్తమమంత్రివి. నీ విటుపయి నేమిచెప్పినను జేయుచుందును." అని యతని ననేకవిధములుగ సమ్మానించి విక్రమార్కుఁడు రాజ్యమేలుచుండెను. సూర్యునివలెఁ దేజశ్శాలియు సాహసియు, ధైర్యవంతుఁడును, ఇంద్రియనిగ్రహముగలవాఁడును, విక్రమాక్రాంతలోకుఁడును, చతుష్షష్టి కళావిశారదుఁడును, శత్రువనదవానలుండును, నిర్భయుఁడును, మహాశూరుఁడును, వీరనిషేవితుఁడును, సత్యసంధుఁడును, ఉజ్జయనీనాయకుఁడును, రాజరాజును, చక్రవర్తి లక్షణ విరాజమానుఁడును నగు విక్రమార్కమహారాజు రాజులు, మిత్రులు, మంత్రులు, కవీశ్వరులు, వందిమాగధులు, విద్వాంసులు, గాయకులు, చంద్రముఖులగు స్త్రీలు, భటులు మొదలగువారితోఁ గూడి శ్రేష్ఠములయిన ముత్యములతోడను మాణిక్యములతోడను బ్రకాశించుచు దేవేంద్రుని సభవలె విరాజిల్లుచున్న సభలోఁ బ్రవేశించి తనకు దేవేంద్రుఁ డిచ్చిన యనన్యదుర్లభముగు నవరత్న ఖచితమయిన దివ్యసింహాసనముపైఁ గూర్చుండి వందిమాగధులు స్తుతి చేయుచుండఁగా రాజకార్యములను నిశ్చలముగ వినుచు భట్టితో మాటలాడుచు నుండఁగా నపుడు జటాజూట విరాజమానుఁడును, భస్మోద్ధూళిత దేహుఁడును, స్ఫటికమాలావిరాజిత హస్తుఁడును గంటగట్టిన దండముగలవాఁడును, పులితోలు గట్టుకొన్నవాఁడును, పాద



ములయందు విరాజమానములగు దంతపాదుకలు గలవాఁడును, మొలను చిఱుగంటలు గలవాఁడును, రుద్రాక్షమాలలు ధరించినవాఁడును, కాలపురుషుఁ డను పేరుగలవాఁడును నగు నొక సిద్ధశ్రేష్ఠుఁ డయిన యోగివచ్చి రాజును జూచి "విభూ! దీర్ఘాయుష్మంతుఁడవును విజయముగలవాఁడవును నగుము" అని యాశీర్వదించి సంతుష్టాంతరంగుండై యొక దానిమ్మపండు రాజున కిచ్చెను. మఱియు నాయోగి ప్రతిదినమును రాజు సింహాసనము నలంకరించి యుండఁగా నట్లే యుత్తమ మయిన ఫలము దెచ్చి యిచ్చుచుండెను. అతఁడు దినమును దెచ్చియిచ్చిన ఫలములను కోశాధ్యక్షునిచేతి కిచ్చి వీనిని భద్రముగాఁ గాపాడుచుండుమని రాజు చెప్పఁగా వాఁడును నట్లే చేయుచుండెను. మరల నొకనాఁడు సిద్ధయోగి వచ్చి రాజు సింహాసన మలంకరించి యుండఁగా నట్లే దానిమ్మపండు దెచ్చియిచ్చెను. అపు డెచ్చటినుండియో యొకక్రోఁతి యదృచ్ఛగా వచ్చినది. విక్రమార్కుఁ డాక్రోఁతిని జూచి కుతూహలాక్రాంతచిత్తుఁడయి యాపండాక్రోఁతి కీయఁగా నది యపుడే చీల్చినది. ఆపండులో నుండి వెలలేని ముత్యములు రత్నములు క్రిందను పడినవి. అవి చూచి విక్రమార్కుఁ డాశ్చర్యపడి వెంటనే కోశాధ్యక్షుని బిలిపించి నేనిదివఱ కిచ్చిన దాడిమఫలము లన్నియుఁ దెమ్మనెను. వెంటనే వాఁడును బోయి తెచ్చి రాజునెదుట సమర్పింపఁగా రాజు వానిని చీల్చెను. మితిలేని రత్నములు ముత్యములు చూచి రాజు పరమానందభరితుఁడయి యోగితో నిట్లనియె. యోగీంద్రా! నీ కీఫలము లెచ్చట సంప్రాప్తించినవి? నందనవనమునుండి తెచ్చితివా? లేక చైత్రరథమను కుబేరుని యుద్యానమునుండి తెచ్చుచుంటివా? అది గాక యిటువంటి యత్యద్భుతము లయిన ఫలములను ప్రతిదినమును దెచ్చి మాకేల యిచ్చుచుంటివి? నీపేరేమి? నావలన నీకుఁ గావలసిన ప్రయోజన మేమున్నది? నీవాసస్థల మెక్కడ? నావలన నీ కేదియైనఁ గావలసి యున్నచో సిద్ధ మయినదనియే నమ్ముకొనుము. అని యిట్లు చెప్పుచున్న రాజుమాటలు విని సంతోషించి యోగి యిట్లనియె. రాజేంద్రా? ఈఫలములు దేవప్రసాదమువలన లభించినవి. నాకొక మహాకార్య ముండుటచే నివి తెచ్చి తమకు సమర్పించు

చున్నాఁడను. నాపేరు కాలపూరుషుఁ డందురు. నానివాసము శ్మశానభూమి. కందమూలములే నాకు భోజనము. నేను మత్స్యేంద్రుని శిష్యుఁడను. నాకార్యము మహారహస్య మయినది. రెండవవారికిఁ దెలియకుండఁ జేయవలసియున్నది. ఒక్కనికిఁ దెలిసినచో నీటిమీఁది నూనె బిందువువలె నంతటను వ్యాపింపక మానదు. అట్లే యగునేని నాకార్యమునకు భంగముగలుగును. నీవు ధ్వజకీర్తి మహారాజునకు దౌహిత్రుఁడవు. చంద్రశర్మకుఁ గుమారుఁడవు. నీతో సమానుఁ డీ ముల్లోకములయందును లేఁడు లేఁడు లేఁడు. నే నెందఱురాజులనో చూచియుంటిని. నీగుణములలోఁ గోటియవపాలయినను వారియం దెన్నండును జూచి యెఱుఁగను. అదిగాక దేవేంద్రుఁ డిచ్చిన నవరత్నఖచిత దివ్యసింహాసన మధిష్ఠించి విరాజిల్లుచున్నాఁడవు. సూర్యభగవానుఁ డిచ్చిన కుండలములు నవరత్న ఖచితములు చెవుల ధరించియున్నావు. నీ వుదయపర్వత మెక్కితివి. సూర్యునిప్రసాదమువలన నభేద్యకవచము గలవాఁడ వయితివి. నీవలె ధర్మముగా రాజ్య మేలినవాఁడును వినియుఁ గనియు నెఱుఁగను. సాహసి యన్నను, శూరుఁ డన్నను, సర్వవిద్యావిశారదుఁ డన్నను, ధైర్యశాలి యన్నను, నీతికోవిదుఁ డన్నను నిన్నే చెప్పవలయును. కావున నాకార్యము నీతో విన్నవించెదను. నేఁటికి బదునేనవనాఁడు నీ వేకాకివై నేనుండు శ్మశానభూమికి రావలయును. అచ్చట నాకార్యము విన్నవించెదను. వెంటనే చేయుము. అని యోగి చెప్పఁగాఁ గా దయాళువై యారాజట్లే యనెను. యోగి రాజునొద్ద సెలవుపుచ్చుకొని తన నివాసమునకుఁ బోయెను. రాజు రాజకార్యములు నిర్వర్తించి యంతఃపురములోనికిఁ బోయెను. తరువాతను యోగిచెప్పినపదునేనవదినము వచ్చినది. భట్టియను మంత్రితోడను నీతివిశారదు లగు సభ్యులతోడను సభలోఁ బ్రవేశించి యప్పటియావశ్యకకృత్యములు నెఱవేర్చి మరల నంతఃపురమునకుఁ బోయెను. సూర్యభగవానుఁడును రక్తుఁడై వారుణీసంగమమునకుఁ గాఁబోలును బోయియున్నాఁడు. పద్మినితనభర్త యగపడకుండుటకుఁ జాలఁ జింతించి విరహమువలన మోహమును బొందినదో యన ముకుళించినది. క్రమక్రమముగాఁ జీకటి వ్యాపించినది. అర్ధరాత్ర మయినది. అందఱును నిద్రపోవుచున్నారు. సిద్ధుని సంగతి



జ్ఞప్తికివచ్చి రాజులేచి శ్మశానమునకుఁ బోవ నుద్యుక్తుఁ డాయెను. దివ్యాంబరములు దివ్యములయినయాభరణములు ధరించి యభేద్య కవచము దొడిగికొని కుండలము లలంకరించుకొని పూలమాలలు వైచుకొని మహాశృంగారవేషముతో ధైర్యసాహసములు మూర్తిమంతమై యొప్పుచున్నవో యన్నట్లు పాదుకలు దొడిగికొని శత్రుభయంకరమగు కత్తి చేతఁబట్టి తన తేజస్సుచే దిశదిశలను వెలిగింపఁజేయుచు శ్మశానమువైపు బయలుదేఱి త్రోవలో నెవ్వరికిని గనుపడకుండనే మహాభయంకరమగు రుద్రభూమిలోఁ బ్రవేశించెను. రాజు ప్రవేశించునప్పటికి భూతప్రేతపిశాచ శాకినీఢాకినీగణములు వేలకొలఁదిగఁ గూడి రాజును సంహరించుట కుద్యుక్తములయినవి. సాహసి యగు రాజు వానినన్నింటిని ఛేదించెను. అవి యన్నియు గర్వము విడిచి వచ్చినత్రోవనే పోయినవి. తరువాత రాజు యోగిని పేరుపెట్టి పిలిచెను. ఎక్కడ నున్నావయ్యా! యని పిలిచి పిలిచి వేసారి వెదక మొదలిడెను. ఎంత పిలిచినను వెదకినను యోగిజాడ నుంతయు లేకపోఁగా నేను ద్రోవతప్పితినా లేక యిది యోగియుండు శ్మశానము కాదా యని విచారించి యటుగాక యోగికి జెవుడేమో లేక నిదురించుచున్న వాఁడో యనియు నిట్లనేక వికల్పములను బొంది యోగీంద్రా! నీమాటప్రకారము నామాట యథార్థము చేసికొనుటకు వచ్చి యున్నా నయ్యోయి! నీ వీ పితృభూమిలో నెంత పిలిచినను బలుకవు. ఎంత వెదకినను గనుపడవు. కారణ మేమయి యుండును. నీ వెచ్చట నైనను మౌనమును వహించి జపము చేయుచున్నావా? నీవే యథార్థము తప్పినవాఁడ వై పోతివి. సరి నే నిదిగో నింటికిఁ బోవుచున్నాను. అని రాజు పలుకునప్పటికి యోగి ప్రత్యక్ష మాయెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమున విక్రమార్కోపాఖ్యాన మన్నది యిరువదిరెండవ యధ్యాయము.

---

## ఇరువదిమూఁడవ యధ్యాయము.

సూతు—మునిపుంగవులారా! తరువాతను యోగిచేసిన చేష్టలు చెప్పెద నాలకింపుఁడు. అట్లు రాజు గట్టిగాఁ బిలువఁగాఁ దుదకు

యోగి బెత్తము చేతఁబట్టుకొని రాజునొద్దకు వచ్చి రాజును జేతితోఁ బట్టుకొని రాజా! నే నింతసేపును నిన్నుఁ బరీక్షింతమను బుద్ధిచేతనే పూనమును వహించి యుంటిని. నామెడఁ గోపముంచకుము. నిజముగా రాజ రాజు వన్నను సత్యసంధుఁడ వన్నను నీవే. నీవంటి సాహసిని శూరుని నే నింతవఱకు విని కని యెఱుఁగను. నీవు నాకార్యమును బూర్తిచేయుటలో నించుకంతయు సందేహము లేదు. ఇఁక నాకార్యము చెప్పెదను సావధానము గావినుము. ఇక్కడికి యొకయోజన దూరములో నొకమఱ్ఱిచెట్టున్నది. ఆ చెట్టుమీఁదను బెద్దశరీరము గలవాఁడును, మహాబలపరాక్రముఁడును, కోట్లకొలఁది భూతప్రేతపిశాచశాకినీఢాకినీ బ్రహ్మరాక్షసాది సంఘముల తోఁ గూడి యుండువాఁడును, నాతపస్సునకు మాటిమాటికిని విఘ్నము చేయుచుండువాఁడును మహామాయాధురంధరుఁడును, పర్వతముల నెత్తగలవాఁడును, తేజస్సుచే శంకరునివంటివాఁడును, జటాధారియు, భయము లేనివాఁడును, శర్వశత్రునిబర్హాణుఁడును, నగునొకఁ డున్నాఁడు. నీవు పోయి వానిని జయించి నాయొద్దకుఁ దీసికొని రమ్ము. నే నీకాళికాలయములో నుండెదను. నీవు వేగముగాఁ బొమ్ము. అను యోగిమాటలు విని విక్రమార్కుఁడు కత్తి చేతఁబట్టుకొని తిన్నగా మఱ్ఱిచెట్టున్న చోటికిఁ బోయి చూచునప్పటికి రెండవ వింధ్యపర్వతములాగునఁ గనుపడ్డది. మఱియు నది భూమిని, ఆకాశమును నంటి మిక్కిలి భయంకరముగా నున్నది. దానియందున్న భూతప్రేతాదుల సంఘములకు హద్దులేదు. అటువంటి మఱ్ఱిచెట్టుమీఁదను తలక్రిందకును గాళ్ళు మీఁదికిని వ్రేలాడుచున్న వాఁడును, నరమాంసమును దినుచుండు భూతప్రేత పిశాచాదిసంఘములచేఁ జుట్టువాఱుకోఁ బడినవాఁడును, ఘోరములయినకోరలు, అంతకుఘోరమయిన రూపము, జడలు గలిగి మహాభయంకరుఁ డయియున్న బేతాళునిఁ జుట్టుకొన్న పిశాచాదులను జూచి విక్రమార్కుఁ డిట్లనియె. నేను లోకములో శత్రుభయంకరుండని పేరుపడి యున్నవిక్రమార్కుఁడను. సిద్ధునియాజ్ఞచే మీప్రభు వగుబేతాళుని దీసికొనిపోవుటకై వచ్చితిని. నేనెట్లయినను వానిని దప్పక దీసికొని పోవుదును. ఇందు సందేహమే లేదు. ఓపిశాచాదులారా! మీరు మీప్రాణములను రక్షించుకొనుఁడు. ఎందేనిఁ బాఱిపొండు. నేనిపుడు శ్మ



శానములోనుండు భూతప్రేతపిశాచాదులను జాలవఱకుఁ జంపి యిచ్చటనున్న మిమ్ములను జంపుదమను నుద్దేశముతో వచ్చియుంటిని. కావున మీరుఁ బ్రాణములయం దిష్టముగలదేని దూరముగాఁ బాఱిపొండు. ఇట్లు చెప్పుచున్న రాజుతోఁ బిశాచము లిట్లన్నవి. రాజా! స్వల్పబలము గలిగియు గర్వించి మాటలాడుచున్నావు. నీబెదరింపులకు మేము భయం పడువారముగాము. మిక్కిలి ప్రేమాస్పదము లయిన నీప్రాణములను రక్షించుకోవలయు ననుతలంపు గలదేని మాదగ్గఱనుండి వేగముగాఁ బొమ్ము. లేదేని నిన్నుఁ జంపి మే మందఱమును భక్షించెదము. రాజాధమా! నీవు రుద్రుఁడవా? విష్ణుఁడవా? బ్రహ్మవా? దుర్బుద్ధీ! నీవు వచ్చి మమ్ములను బెదరించుచున్నావుగా? "గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినదఁట!" అను సామెత యిట్టిదే కాఁబోలును. పొమ్ము పొమ్ము దూరముగాఁ దొలఁగిపొమ్ము. నీ వెక్కడ? బేతాళుఁ డెక్కడ? మీ కిద్దఱకును హస్తిమశకాంతరమున్నది. పిల్లి, పెద్దపులితో నెదురొడ్డఁ బోయి నట్లున్నది. ఓరి రాజాధమా!, ఇంకను బోతి వో వేమిరా? నీకు బ్రదుకవలయునను నాస లేదుగాఁబోలును. సరియే, అట్లు లేని చో నిపుడే నీకంఠము నులిపి నురుగలు గట్టుచున్న వేఁడివేఁడి రక్తము ద్రావి తాండవ మాడెదము. ఉండుండుము. నీపాదములు, చేతులు, తొడలు, గుండెలు, శిరస్సు మొదలగు నవయవములు నువ్వుగింజలవలెఁ బొడిచేసి మే మందఱమును బంచుకొని తినఁగలము వేగము పొమ్ము పొమ్ము. అని యిట్లు రాజుతోఁ జెప్పి రాజును జుట్టుకొని రక్తమాంసములు భక్షింప మొదలిడినవి. మఱియు మూత్రపురీషములు, రాళ్ళు, చెట్లు, కొండశిఖరములు మొదలగునవి తమకోపము దీఱ రాజుపయిన్ని విసర మొదలిడినవి. అపుడు విక్రమార్క మహారాజు భుజముల నాస్ఫాలించి తేళ్ళమందలమీఁదికి సింహము పరుగెత్తినట్లుగా నాభూతములమీఁదికిఁ బరువెత్తెను. మాటిమాటికిని సింహనాదములు చేయుచు గర్జించుచు వాఁడియగుకత్తితో వానిని జాలవఱకు నఱికివైచెను. కొన్నింటికి ముక్కులు, కొన్నింటికిఁ జేతులు, కొన్నిటికి మెడలు, కొన్నిటికి పాదములు, ఈరీతిగా విక్రమార్కుఁడు నఱకఁగా నవి యచట నిలువఁజాలక దీనదీనముగా రోదనము చేయుచుఁ బాఱిపోయినవి. మఱి

క్కొన్ని మూర్ఛపోయినవి. లేళ్ళను సింహము, మేఁకలను పెద్దపులి వ్యాకులపెట్టిన ట్లావిక్రమార్కుఁడు వ్యాకులపెట్టఁగాఁ జాలవఱకు భూతములు నశించినవి. ఈరీతిగా భూతప్రేత పిశాచాదులను కత్తితోఁ జంపి చంపి సింహనాదములు చేయుచు నచటనే నిలువఁబడెను. ఇట్లు రావణాది రాక్షసులను జంపిన శ్రీరామునివలె సింహనాదములు చేసిచేసి క్రమముగాఁ బేతాళుఁ డున్నచోటికే మెల్లఁగాఁ వెళ్ళి వానిని జూచి రాజి ట్లనియె. బేతాళా! నాచే నీ సైన్యమంతయు నంతము నొందింపఁబడినది. నిన్నుఁ బట్టి తీసికొని పోవుటకై వచ్చితిని. నిన్నుఁ దీసికొనిపోయి కాలపూరుషు డనుయోగికి చ్చెదను. కావున నో బేతాళుఁడా! నీవు శీఘ్రముగా నాయొద్దకు రమ్ము. అని యిట్లు గర్వ యుక్తముగాఁ బలికిన రాజుమాటలువిని భయపడి తనమంత్రులను బిలిచి యిట్లనియె. మంత్రులారా! ఇతఁడు విక్రమార్కుఁడు. మనసైన్యమును జాలవఱకుఁ జంపి యున్నాఁడు. నన్నుఁ గట్టి తీసికొనిపోవుటకు వచ్చియున్నాఁడు; ఇతఁడు కుబేరుఁడో, ఇంద్రుఁడో, నాలుగు ముఖములుగల బ్రహ్మదేవుఁడో, విష్ణువో, కాలరుద్రుఁడో, నాకేమియుఁ దెలియకుండ నున్నది. ఇపుడు నేనేమిచేయుదును? ఎచ్చటికిఁ బోదును? నాకింకెవ్వరు దిక్కు? అని యిట్లు బేతాళుఁ డనుచుండఁగా నతని మంత్రు లేడుగురును పండ్లు పటపట కొఱుకుచుఁ దమరాజుతో నిట్లనిరి. ప్రభూ! మనుష్యాధముఁడగు వీనివలన నీ వెందుల కింతగా భయపడుచున్నావు? నీయాజ్ఞను శిరసావహించుటకు మేమందఱమును సిద్ధముగానున్నాము. ఇంతకును నీవు మాత్రము సామాన్యుఁడవా? విష్ణునివంటి బలశాలివి, మేరువువంటి ధైర్యముగలవాఁడవు, రుద్రునితో సమానమయిన కోపముగలవాఁడవు. సంహరించుటవిషయమయి ప్రళయకాలపు యముఁడవే. నీపేరుచ్చరించినప్పటికే మూఁడులోకములును గడగడ వడఁకుచుండును. ఆమనుష్యాధముని జంపుటకై మమ్ములను బంపుము. బేతాళరా జెక్కడ? మనుష్యుఁ డెక్కడ? అనియిట్లు మంత్రులు తమరాజును స్తుతి చేయుచుండఁగా బేతాళరాజు వారిని జూచియిట్లనియె. మంత్రులారా! శీఘ్రముగాఁబోయి యీరాజాధమునిజంపి జయమునుబొందిరండు. మీరందఱును యుద్ధవిశారదులుగదా! అని యిట్లు బేతాళరాజుచే నాజ్ఞాపింపఁబడి



యాయేడుగురు మంత్రులును విక్రమార్కునియొద్దకు వచ్చి గర్వించి యిట్లనిరి. రాజాధమా! రుద్రునివంటివాఁడు, మహానాదము చేయువాఁడు, కాలాగ్నితుల్యుఁడు, అట్టిమాప్రభువును గట్టితీసికొనిపోవుటకు నీకే మాత్రపుశక్తి గలదురా! ప్రాకృతము లగుభూతాదులను జంపినట్టు యనుకొనుచున్నావేమి! అంతమాత్రమునకు గర్వింపకుము. మేమట్టివారము గాము, మేము బాహువులతోఁ బెద్దపెద్దకొండలను బెల్లగింపఁ గలము. అట్టిమాయెదుట నిలువఁబడుటకు నీకు యోగ్యత యెక్కడిది? యుద్ధమునంగతి దూరముగనుండనీ, అనిచెప్పి యేడుగురు బేతాళులును విక్రమార్కునితో యుద్ధముచేయుటకు సన్నద్ధులై నిలువఁబడిరి. తరువాతను విక్రమార్కుఁడు వారినందఱను సింహము క్షుద్రమృగములనుజూచినట్టుగాఁ జూచెను. వారితో యుద్ధము చేయుదమనుతలంపుగలవాఁడై సింహనాదములుచేయుచు, మాటిమాటికిని గర్జించుచు, వజ్రాయుధమువంటి మహాఖడ్గమును గిఱగిఱఁ ద్రిప్పుచు, శత్రుభయంకరుఁడై నిలువఁబడెను. తరువాతను దొమ్మిగాను, రోమహర్షణముగాను యుద్ధము ప్రారంభమయినది. అదివఱ కెన్నఁడును నటువంటి యుద్ధముకాలేదు; కనుక నింద్రాదిదేవతలందఱును విమానములతోవచ్చి యాయుద్ధమును జూచుచుండిరి. గంధర్వులు, కిన్నరులు, విద్యాధరులు, యక్షులు, ఋషులు, పన్నగులు, నారదుఁడు, తుంబురుఁడు, అప్సరసలు, చారణులు మొదలగువారు విమానములపై నుండి విక్రమార్కునికి జయమును గోరుచుండిరి. పున్నమనాటిచందమామను జూచి సముద్రముపొంగునట్లు విక్రమార్కుఁ డాదేవసంఘమునుజూచి పొంగుచుండెను. అట్లు యుద్ధములో వృద్ధినిబొందుచున్న విక్రమార్కరాజచంద్రుని నాచ్ఛాదించుటకు బేతాళులందఱును రాహువులవలె వచ్చిరి. ఆవచ్చినభూతములన్నియుఁ గత్తి చేతఁబట్టుకొని యుద్ధముచేయుచు రాజుపయిని నానావిధాయుధములను బ్రయోగించి నొప్పింప మొదలిడినవి. ఆదెబ్బలకు నొచ్చి రాజు కోపముచే రక్తనేత్రుఁడయి సింహమువలె నార్చుచు నెల్లరకును భయముగలుగునట్టుగా నాయేడుగురు బేతాళులకును ముక్కులు కోసివైచెను. తుదకు వారి యందఱకంఠములనుగూడఁ దెగఁగోసెను. ఇట్లు బేతాళులందఱును హతులుగాఁగా మీఁదనున్న దేవతలందఱును సాధు

వాద్యములు చేయుచు సంతోషించిరి. గంధర్వులు పాడిరి. అచ్చరలాడిరి. దేవతలందఱును జయమును బొందుమని యాశీర్వదించిరి. కలహభోజనుఁడగు నారదుఁడు సర్వాద్భుతమయిన యా యుద్ధమునుజూచి పరమానందసముద్రములో మునిఁగెను. తరువాతను దేవతలందఱును రాజు నొద్దకు వచ్చి వరము వేఁడుమనిరి. దేవతలారా! మీరు నాయందు దయ గలవారైవచ్చితిరేని యీబేతాళుఁడు నాకు స్వాధీనుఁడగునట్లు వరమిత్తురు గాకయని రాజుకోరెను. దేవత లట్లే యగుఁగాక యని వచ్చిన త్రోవనే పోయిరి. పిదప విక్రమార్కుఁడు మఱ్ఱిచెట్టెక్కి సప్తబేతాళ నాయకుఁడగు బేతాళరాజుతో నిట్లనియె. ఓయీ! నీచేఁ బంపఁబడిన బేతాళులందఱును నాచేఁ జంపఁబడిరి. నీగర్వముతీఱినది. అని చెప్పి యా బేతాళునిజడలు కట్టుకొనెను. మెల్లఁగా వానినిగట్టివైచి మఱ్ఱిచెట్టు దిగి యోగీంద్రుఁ డున్న చోటికా బేతాళుని దీసికొని వచ్చుచుండఁగా బేతాళుఁడు త్రోవలో నంతర్ధానమ్మాయెను. అట్లంతర్ధాన మగుటచూచి మరల విక్రమార్కుఁడు మఱ్ఱిచెట్టెక్కి వానినిబట్టుకొని గట్టిత్రాళ్ళతోఁ గట్టి యోగీంద్రునియొద్దకుఁ దెచ్చుచుండఁగా మరల బేతాళుఁ డంతర్ధానమాయెను. మరల విక్రమార్కుఁడు మఱ్ఱిచెట్టెక్కి వానితో నిట్లనియె. ఓరీ బేతాళా! దుర్బుద్ధీ! నీవు మహామాయాధురంధరునివలె నున్నావు. నీమాయలన్నియు నాకుఁ దెలియు లెమ్ము. ఇఁక నెక్కడికిఁ బోఁగలవు? ఇంద్రలోకమునకుఁ బోయినను, చంద్రలోకమునకుఁ బోయినను బ్రహ్మలోకమునకుఁ బోయినను, విష్ణులోకమునకుఁ బోయినను రుద్రలోకమునకుఁ బోయినను దితిగర్భములోఁ బ్రవేశించినను నిన్ను మాత్రము విడువను విడువను విడువను. నీవు మాటిమాటికి నిమఱ్ఱిచెట్టెక్కుచున్నావు గావున నీకసిచెట్టే పెల్లగించి పట్టుకొనిపోయెద ననురాజుతో బేతాళుఁ డిట్లనియె. రాజా! నీవు మహాసాహసివి, ధీరుఁడవు, ప్రాజ్ఞుఁడవు నని యెఱుంగుదును. నే నిపుడు నీ కిరువదిమూఁడు కథలు చెప్పెదను. నీవు వానికిఁ దగిన సమాధానము చెప్పెదవేని నీకు నే నధీనుఁడనగుదును. అని చెప్పి నిర్భయముగా నా చెట్టుమీఁదనుండెను. మఱియు బేతాళుఁడు రాజును జూచి, రాజా! నే నడిగిన ప్రశ్నలకు సదుత్తరము నీవెఱిఁగియుఁ జెప్పవేని నీశిరస్సు వెంటనే భిన్నముగాఁగలదు. అను నా బేతాళునిజూచి రాజిట్లు



నియె. బేతాళా! నాకుఁ దెలిసియున్న కథకు నేను సదుత్తరము చెప్పెదను. అని యా బేతాళునిబట్టుకొని తన పృష్ఠభాగమునందుంచి మోయుచు గమనముకొఱకు కుద్యుక్తుఁడాయెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమున విక్రమార్కోపాఖ్యానములో బేతాళగ్రహణమన్నది ఇరువదిమూఁడవ యధ్యాయము.

---

ఇరువదినాల్గవ యధ్యాయము.

సూతు— మునులారా! తరువాతను బేతాళరాజు మొదటికథ రాజునకుఁ జెప్ప మొదలిడెను.

బేతా—రాజా! వినుము. పూర్వము కృతయుగమున విశాలయనుపట్టణము గలదు. అందు వీరమాహేశ్వరుఁడనురాజు రాజ్యమేలుచుండెను. అతఁడు సత్యవాది, జితేంద్రియుఁడు. చిరకాలమున కతనికి బద్మావతి యనుకుమారిత పుట్టినది. తండ్రి యామెకు సకలశాస్త్రములును జెప్పించి యెవనికిచ్చి పెండ్లిచేయఁదగును? అని చింతించి మంత్రిని బిలిపించి యిట్లనియె. మంత్రీ! నాకుమారిత పద్మావతికి యౌవనము ప్రాదుర్భవించినది. ఇఁక దానికిఁ బెండ్లిచేయకతప్పదు. కావున నీవు తగినవరుని వెదకి తీసికొనిరమ్ము. అని చెప్పినతోడనే మంత్రి మంచిదే యనెను. రాజు పురోహితుని బిలిపించి మంత్రికిఁ జెప్పినట్లే చెప్పెను. వానును మంచివరునికై వెదకుచునేయుండెను. తరువాతను రాజు తనకుమారితకుఁ దగినవరు నొకనిని బిలుచుకొనివచ్చెను. పురోహితుఁ డొకవరుని బిలుచుకొనివచ్చెను. మంత్రియొకవరుని రప్పించెను. ఇట్లు ముగ్గురును ముగ్గురువరులను దెచ్చిరి. ముగ్గురువరులును జతురంగబలములతోను బెండ్లికివచ్చి యూరిబయటను విడిసిరి. అప్పుడు రా జెవ్వరికిఁ గన్య నీయవచ్చును? అని చింతింప మొదలిడెను. ఇంతలో నా రాజుభార్య తనయన్నకొడుకును రప్పించినది. అతఁడును మేనయత్తకూఁతుం బెండ్లియాడుదమను సంతోషముతో వచ్చి యూరిబయటనుండెను. అప్పుడు రాజు కార్యాధీనుఁడై యుండుటంజేసి బావమఱఁది కొడుకును రావించినందులకై తనదేవిని నిందించుచు నిట్లనియె.

ఓసీ! దుర్మార్గురాలా! ముగ్గురువరులు వచ్చి యూరు చుట్టుకొనియుం
డఁగా నీ మేనల్లునిగూడ నెందులకు రప్పించితివి? నాకు మొదలే మతి
పోయియుండఁగా నీవిట్లేల చేసితివి? అని యనేకవిధములుగాఁ దిట్టుచుం
డఁగా నాగటిపా రాజుతో నిట్టు లనియె. నీవు నాయన్నకుమారుని కిచ్చి
మనపిల్లకుఁ బెండ్లిచేయవైతివేని నే నిపుడే నీ యెదుటనే విషము దిని
ప్రాణములు విడిచెదను. అనియిట్లు చెప్పిన భార్యమాటలు విని యతి
కాముకుఁ డగుటచే భార్యమాట దాఁటఁ జాలకపోయెను. అతఁడే
యన్నమాట యేమి? లోకములో నెక్కడనో కాని సామాన్యముగాఁ
బ్రతిపురుషుఁడును స్త్రీకి స్వాధీనుఁడే యయి యున్నాఁడుగదా! ఆఁడు
దానికి లొంగియున్నవారు సత్యమును, ధర్మమును, తనయులను, బం
ధువులను, పెద్దలను, గురువులను, విడుచుట కొక్కింతయు వెనుదీయు
వారు గారు. ఆఁడుది యనఁగా శక్తిస్వరూపిణి గాదా! ఇం దాశ్చర్య
మే మున్నది. తరువాతను రాజు వచ్చియున్న ముగ్గురు వరులను నిరా
కరించి భార్య మేనల్లునకే కూఁతు నిచ్చుటకు నిశ్చయించెను. రాజుగారి
యభిప్రాయము దెలిసికొని మొదటి ముగ్గురు వరులును గోపించి యుద్ధ
సన్నద్ధు లయి రాజునకును వాని భావమఱఁదికుమారునకును "మ
మ్మును యుద్ధములో జయించిన తరువాతనే పెండ్లి చేసికొవలసిన దని
వర్తమానముల బంపిరి. మఱియుఁ దరువాతను బెండ్లి సంగతిచూచు
కొవచ్చునని ముందుగా యుద్ధమునకు రండనియుఁ బంపిరి. దూతల
వలన వారియభిప్రాయము దెలిసికొని రాజు మంత్రులను బిలిపించి
యాలోచింప మొదలిడెను. అపుడు మంత్రులు బాగుగా నాలోచించి
రాజుతో నిట్లనిరి. రాజా! ఇపుడు తమకుమారిత నెవ్వరి కిచ్చుటయుఁ
దెలియకుండ నుండఁగా మేమెట్లు బదులు చెప్పఁగలము? వారితో
యుద్ధము చేయుటకు మావలన సాధ్యపడదు. వారు మహాబలవంతులు
అయినను మే మొకయాలోచన చెప్పెదము. తాము కోపము చిత్త
గింపక విందురేని విన్నవించుకొందుము. అని మంత్రులు చెప్పఁగా
రాజు వారిని మంచిమాటలాడుచు నిట్లనియె. మంత్రులారా! మీ మ
నస్సున కిష్టపడినవిషయము నాకుమాత్ర మెందుల కిష్టపడదు? భయ
పడక మీకుఁ దోఁచిన యాలోచన యేదియో నాతోఁ జెప్పుఁడు.



అని రాజడుగఁగా మంత్రు లిట్లనిరి. రాజా! పట్టణమునకు వెలుపటను
గొప్ప యగ్నికుండ మొకటి ప్రజ్వలింపఁజేసి దాని యెదుటఁ దమకు
మారితను నిలువఁబెట్టుఁడు. నలుగురువరులను నాలుగు వైపులను నిలు
వఁబెట్టించి "మీ నలువురిలో నెవఁడు ముందుగా వచ్చి నాకుమారిత చే
యిపట్టుకొనునో వానికే నాకూఁతు నిచ్చెదను" అని చెప్పవలయును. అని
మంత్రులు చెప్పఁగానే రాజట్లే చేయించెను. అట్లు పెద్దయగ్నికుండము
ప్రజ్వలించుచుండఁగాఁ గుమారితను బాగుగా నలంకరింపించి యాకుండ
ముదగ్గఱ నిలిపి యాకుండమునకు నాలుగువైపులను సమస్థలములయం
దున్న నలుగురు వరులను బిలిచి కుండము దగ్గఱనున్న నాకూఁతును
గ్రహింపుఁడనెను. అట్లు రాజు చెప్పినవెంటనే నలుగురును నేనుముందు
నేను ముందని యొక్కమాఱుగావచ్చి యొక్కసారిగానే నలుగురును
బట్టుకొనిరి. వారి యాతుపులకు సహింపక యామె యాకుండములోఁ
బడినది. అగ్నిజ్వాలలోఁ బడినమిడతవలె నయిన యాబాలికవిషయ
మయి నలుగురును హా! సుందరీ! యని యేడువ మొదలిడిరి. వారిలో
సాహసి యగునొకఁ డాకుండములోఁ బడెను. మఱియొకఁ డామెయం
దలి మోహముచే వైరాగ్యవంతుఁడై తీర్థయాత్రకుఁ బోయెను. ఇంకొ
కఁడు సన్న్యసించి భిక్షుకుఁడై దేశదేశములు తిరుగఁబోయెను. నాలవ
వాఁడుమాత్ర మాపట్టణములోననే భిక్షావృత్తిచేఁ గాలము గడుపుకొను
చు నాయగ్నికుండముపైని చక్కనిమంటప మొకటి కట్టి యాసమీప
మున నే యొకపూఁదోఁట వేయించి యామంటపముమీఁదను గౌరిని బ్ర
తిష్ఠించి ప్రతిదినమును బూజించుచుండెను. సన్న్యసించి దేశాటనము
చేయఁబోయినవాఁడు క్రమముగాఁ గాశీపట్టణము చేరి కొన్నాళ్లుండెను.
ఒకప్పుడతఁ డాఁకలిగొని యొకదరిద్రునియింటికిఁ బోయి యతనిభా
ర్యను జూచి యాతిథ్య మిమ్మనెను. పతిభక్తివశవంధురాలైన యామె
యతనిని బూజించి తనయింట నేమియు లేకుండుటచే నతనితో నిట్లని
యె. ఓస్వామీ! నా పెనిమిటి యాచనకుఁ బోయియున్నాఁడు. ఇంట
నేమియు లేదు. ఆయన వచ్చువఱకును దయచేసియుండి భుజించి వెళ్లఁ
దగునని యామె యనఁగానే సన్న్యాసి కోపించి నే నంతవఱకును నుండఁ
జాలను. నన్నాఁకలి చాల బాధించుచున్నది. నీ వింకఁ డెంతసేపటికి వ

చ్చునో యేమో ? లేదంటివేని పోయెదను. లేదా యిప్పుడే నాకు భో
జనము పెట్టుము. అని యతఁ డనఁగానే యామె పొరుగింటికిఁబోయి వెం
టనే కొన్నిబియ్య మప్పుదెచ్చి యన్నము వండుచుండఁగా నామెశిశువు
రోదన మారంభించెను. వంటపని కడ్డమువచ్చిన కుమారు నామె వంట
పొయిలోఁ బడవైచినది. తరువాత వంటచేసి వడ్డించి యాసన్న్యాసిని
దినుమన్నది. మొదటినుండియు నామెచేయుచున్న దంతయుఁ జూచిన
వాఁ డగుటంజేసి యాసన్న్యాసి యాహా ! యని విచారించి శివశివా !
నే నెచ్చటను నిట్టి ఘోరకృత్యము చూచి యెఱుఁగను. అమ్మా ! బిడ్డని
పొయిలోఁబడవైచి యన్నము తినుమందువు. శిశుహత్యచేసిన పరమ
పాపాత్మురాలిచేతి యన్నము నే నెట్లుతిందును ? ఎప్పటి యట్లు నీబా
లుఁడు లేచి వచ్చినచో నీయన్నము తిందును. అని యనుచుండఁగా
నాసన్న్యాసి ననేక విధములుగా నామె బ్రతిమాలుకొన్నది. ఎంత
బ్రతిమాలినను సన్న్యాసి యంగీకరింపఁ డాయెను. ఇంతట నామె
మగఁ డింటికి వచ్చెను. సన్న్యాసియొక్కయుఁ దనభార్యయొక్కయు వి
వాదమును వినెను. అతఁడు వెంటనే నీళ్లుమంత్రించి పొయిలోఁ జల్లెను.
ఆబాలుఁడు మునుపటివలెనే కలకలలాడుచు వచ్చెను. సన్న్యాసి యా
బ్రాహ్మణుని మంత్రప్రభావమున కాశ్చర్యపడి యట్లనియె. దయాసము
ద్రుఁడవగు నో బ్రాహ్మణా ! ఆమంత్రము నాకుపదేశింపుము. దానివలన
నాకోరిక పూర్తి యగును. అనుసన్న్యాసిని జూచి యాయింటిబ్రా
హ్మణుఁ డుపదేశింపఁ జాలనని బదులు చెప్పెను. చేతిలో నాపోసనము
పట్టుకొని నీవామంత్రమును నాకుఁ జెప్పవేని నేను భోజనము చేయ
ననెను. ఆతిథ్య మిచ్చునపుడు కోరినదాని కభ్యంతరము చెప్పఁగూడదు
గనుక విధిలేక యాతని కామంత్రము నుపదేశించెను. తరువాత సన్న్యాసి
భుజించి శుచియై మంత్రమును బరీక్షింపఁ దలంచి యచ్చటఁ జచ్చిపడి
యున్న యొక గాడిదమీఁదను నీరు మంత్రించి చల్లునప్పటి కాగాడిద
బ్రదికినది. వెంటనే సన్న్యాసి విశాలపట్టణమునకు వచ్చెను. వెంటనే
రాజకుమారిత పడిన గుండమును ద్రవ్వించి నీరు మంత్రించి చల్లునప్పటి
కామె యెప్పటియట్ల బ్రతికి పైకి వచ్చినది. ఆమె పడినప్పు డాకుండ
ములోఁ బడినవాఁడును బ్రదికి పయికి వచ్చెను. ఇంతట వైరాగ్యము



చేఁ దీర్థయాత్రలకుఁ బోయినవాఁడును దిరిగి వచ్చెను. అతఁ డామెయం
దలి మక్కువచేఁ బ్రతితీర్థమునందును బిండదానాదిక్రియ లాచరించు
చుండెను. మరల నలుగురును నొకచోటఁ గూడిరి. ఈ రాజకుమారిత
నా దని ప్రతివాఁడును జెప్ప మొదలిడెను. రాజా ! ఆ నలుగురిలో నెవ
నిది యాకన్య చెప్పుమనఁగా బుద్ధిశాలి యగు విక్రమార్కుఁ డిట్లనియె.
తీర్థములలోఁ బిండదానాదిక్రియలు చేసినవాఁడు కుమారుఁ డగును.
చచ్చినదానిని మంత్రప్రభావముచే బ్రదికించినవాఁడు తండ్రి యగును.
అగ్నికుండములోఁ బడి చచ్చి మరలఁ గూడఁ బుట్టినవాఁడు సోదరుఁడు.
ఇఁక నామె చచ్చినను ఆచోటు వదలక యామెనే తలఁచుచు నామె
చచ్చినచోటును గాపాడుచున్నాఁడు గనుక నామె యతనికే భార్య కాఁ
దగ్గది. అని సదుత్తరము చెప్పఁగానే బేతాళుఁడు విడిపించుకొని పాఱి
పోయి మరల మఱ్ఱిచెట్టెక్కెను. రాజును మరల వటవృక్ష మెక్కి
బేతాళుని బట్టుకొని కట్టి మూఁపుపై నెక్కించుకొని యోగి యున్న
చోటికి బయలుదేఱెను. మరల బేతాళుఁడు కథ ప్రారంభించెను. ఇట్లే
యిరువదినాలుగు కథలు చెప్పఁగా నన్నింటికిని దగిన సమాధానము
లారాజు చెప్పఁగా బేతాళుఁ డిట్లనియె. రాజా ! నీవు సర్వజ్ఞుఁడవు. సా
క్షాద్బృహస్పతివి. ఈ భూలోకములో నీతో సమానుఁడు లేఁడు. నే
నిపు డిరువదియైదవకథఁ జెప్పెదను. దానికిఁగూడ సమాధానము చెప్పి
తివేని కృతకృత్యుఁడ వగుదువు. అని యిరువది యయిదవ కథ చెప్ప
మొదలిడెను.

రాజా ! పూర్వము వంగదేశమునఁ జక్రపుర మను పట్టణము
గలదు. అందు సుందరి యనియు రూపవతి యనియు నిద్దఱు వేశ్యలు
తల్లి కూఁతుండ్రు గలరు. వారిద్దఱును స్వధర్మమునం దాసక్తి గల
వారై యుండిరి. వారి కాపురిలో నేవిధమయిన లాభమును లేకుండు
టచే మఱియొక పట్టణమునకుఁ బోవుద మని బయలుదేఱిరి. రాముఁ
డను పేరుగల యాపట్టణపురాజు శత్రువులచే నోడిపోయి భార్యగూడఁ
జచ్చిపోవుటచేఁ గుమారునితోఁ గూడి మఱియొక యూరికిఁ బోవుచు
వేశ్య లిద్దఱును బోవుదారినే పోవుచుండిరి. దారిలో నడుగులు చూచి
తండ్రితోఁ గొడుకిట్లనియె. తండ్రీ ! ఈదారి నిద్దఱు వాండ్రు పోవు

చున్నారు. పెద్దయడుగులదానిని నీవు పెండ్లి యాడుము. చిన్నపాదములదానిని నేను పెండ్లి యాడెదను. అనఁగానే తండ్రి మంచిదే యనెను. కొంతదూరము పోవునప్పటి కాస్త్రీ లిద్దఱును గనుపడిరి. మొదట ననుకొన్నప్రకారము తల్లిని గొడుకు, కూఁతును దండ్రి పెండ్లి చేసికొనిరి. ఏమనఁగా బెద్దపాదములది కూఁతురు. చిన్నపాదములది తల్లి. తరువాతన్నవారికి గూఁతుండ్రును గొడుకులును బుట్టిరి. ఆపుట్టినవారు శాంతులై వృద్ధి నొందుచుండిరి. వారు తమలో నేమినరుసను బిల్చుకొందగువారో చెప్పుము రాజా! అని బేతాళుఁ డడుగఁగా శాస్త్రనిందితమైన యా సంబంధమును దెలియఁజాలక సంశయగ్రస్తుఁడై బేతాళుని మోచికొని తనలోవను బోవుచుండెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమున
బేతాళపంచవింశతికథాకథన మన్నది
యిరువదినాల్గవ యధ్యాయము.

---

ఇరువదియైదవ యధ్యాయము.

సూతు—మునిచంద్రులారా! ఇట్లు విక్రమార్కుఁడు బేతాళునితోఁ జాలదూరము పోవునప్పటికి మధురమయిన సంగీతధ్వని వినవచ్చినది. గానశాస్త్రప్రవీణుఁడగు విక్రమార్కుఁ డట్టిపాట యదివఱ కెప్పుడును విని యెఱుఁగఁడు. అకాలరణమున నీగీతము నాఁడుది పాడుచున్నదా మగవాఁడే పాడుచున్నాఁడా యని సందేహించుచు నతివేగముగా నడచి చూచునప్పటి కొకమహాశిలపైని మంజులస్వన మగు వీణియ చేతఁబట్టుకొని యాశ్వరస్తుతి గీతములను బాడుచున్న యొక సుందరి కనుపడినది. విక్రమార్కమహారాజు జాదివ్యసుందరిదగ్గఱకుఁ బోయి యామెశరీరలావణ్యమునకు మోహితుఁడై యుక్తియుక్తముగాను-మధురముగాను నిట్లనియె. సుందరీ! నీ వెవరు? వీణాగానములో నింతనేర్పుగల నీవు మాతంగివికాని గావు గదా! లేక సరస్వతివా? మఱి లక్ష్మీదేవివా? శచీదేవివా? ఊర్వశివా చెప్పుము. చకోరాక్షీ! నీమోము పున్నమచందురుని దిరస్కరించుచున్నది. నీదంతములు దాడిమబీజములను వెక్కిరించుచున్నట్లున్నవి. నీ మధ్యప్రదేశము గగనము



వలెను, అణువువలెను గనుపడుచున్నది. నీగానమును విని యాఁడులేళ్ళు కాలు కదుపకుండ నున్నవి. ఎండినచెట్లు చిగిరించుచున్నవి. నీతండ్రి యెవరు? నీభర్తపేరేమి? నాయడిగిన ప్రశ్నలకు సమాధానము చెప్పుము. మీనాక్షీ! నీ వేలోకమునుండి యీ భూలోకమునకు వచ్చితివి? నిన్ను సృజించి బ్రహ్మ మఱి సుందరులను సృజింపమానుకొనెనని తలంచుచున్నాను. నీవు సౌందర్యాధిదేవతవుగానీ కావుగద! నీవు సర్వవిద్యలును దెలిసినదానవని నమ్ముచున్నాను. నేనడిగినవానికి సాదరముగా బదులు చెప్పుము. వేయేలా! నీసౌందర్యమును వర్ణించుటకు వేనోళ్ళుగల శేషుఁడునుఁజాలఁడని నాతలంపు. అని యనేకవిధములుగా నడుగుచున్న యారాజుతో యక్షిణి యిట్లనియె. రాజా! నాపేరు దేవదత్త. నేను సింధురాజుకుమారితను. నాభర్త పుష్పదంతుఁడు. శ్రుతకీర్తి మహారాజునకుఁ గోడలను. హేమవతీపురము మాకాపురస్థలము. నాభర్త శివునిశాపమువలన బేతాళరూపమును బొందెను. నే నాయనవియోగముచే సదా యిట్లు దిరుగుచున్నదానను. నాకెట్లును గాలయాపనగాకుండ నున్నది. నేను బగలు లేడిని. రాత్రి యీరూపమును బొందుచుందును. ఎప్పుడు నామగనిమొగ మగపడునో, ఎప్పుడు పిశాచరాజగునామగఁడు నామొగము చూచునో, అపుడే మాయిద్దఱకును శాపమోక్ష మగును. మాకు శాపమిచ్చినప్పుడే యీసంగతి శివభగవానుఁడు చెప్పియున్నాఁడు. నాపెనిమిటి యున్నచోటికిఁబోయి యాయనను జూడఁజాలకున్నాను. శాపమోహితుఁ డగుటచే నాభర్తయు నన్నుఁ జూడఁజాల కున్నాఁడు. విక్రమార్కునివలన మాయిద్దఱకును శాపమోక్షము గాఁగలదని శివుఁడే చెప్పియున్నాఁడు. కాని యామహానుభావుని దర్శనము మాత్రము మాకెట్లు లభించును? కాని శివునివాక్య మెప్పుడును వ్యర్థముగాదుగదా! ఎప్పటికైనను మాశాపము విక్రమార్కమహారాజువలననే పోఁదగ్గది. అని మఱియు నాదేవదత్త యిట్లనియె. పురుషశార్దూలా! నీ వెవరు? నీపేరేమి? నీవు దేవుఁడవా? వేదవేదాంగపారగుఁడవగు బ్రాహ్మణుఁడవా? ఇంద్రుఁడవా? విష్ణుమూర్తివా? లేక సరస్వతీవల్లభుఁడవగు బ్రహ్మవా? లేక రాజరాజశిఖామణి వగు విక్రమార్కమహారాజవా?

మహాబలా! ఈయర్ధరాత్రసమయమున నీమహారణ్యములోనికి రాఁ గా రణమేమి? అని యామె యడుగఁగా రా జిట్లనియె.

సుందరీ! నే నుజ్జయినీపురాధినాథుఁడ నగు విక్రమార్కుఁడను. కాలపూరుషుఁ డను యోగి ప్రేరణవలన బేతాళుని దెచ్చుటకు బయలు దేఱి మహోన్నత మగునొక మఱ్ఱిచెట్టుపై నున్న బేతాళుని జూచి యతఁడు చెప్పిన మంచిమంచికథ లన్నింటికిని సదుత్తరములు చెప్పి యతని నోడించి యతని దీసికొని వచ్చుచున్నాను. ఇపు డతనిని యోగియొద్దకుఁ గొనిపోయెదను. అని రాజు చెప్పఁగానే దేవదత్త నవ్వుచు నిట్లనియె. రాజేంద్రా! భూతబేతాళనాయకుండగు నాభర్త యెచ్చట నున్నాఁడు? నీవు పట్టి తెచ్చుచుంటివేని నాకొకసారి చూపింపుము. నేనెంతయు సంతసింతును. అని యామె కోరఁగానే రా జాబేతాళు నామెకుఁ జూపించెను. విమానముమీఁదను గూర్చున్న దేవతవలె నారాజు వీఁపుమీఁదనున్న మగని బేతాళుని జూచినది. అతఁడును నవ్వుమొగము గల తనభార్యను జూచెను. అన్యోన్యదర్శనమువలన వారియిద్దఱకును శాపము తొలఁగిపోయినది. ఇద్దఱును దివ్యరూపమునుధరించి దేవగంధర్వసేవితులయి దివ్యాంబరములఁ గట్టుకొని దివ్యములయిన నగలు పెట్టుకొని దివ్యవిమానముపయిని గూర్చుండి యాంతరాళమున వెలుఁగుచుండిరి. అన్యోన్యమును జూచుకొని యెంతసేపటికిని దృప్తినిబొందకుండ నున్నారు. వారు సంతోషముచే వెనుకటిసంగతులు మాటలాడుకొనుచుండిరి. విశ్వావసు మొదలగు గంధర్వులు మధురముగా వారిచరిత్రను గానము చేయుచుండిరి. అప్సరలనాట్యము ప్రారంభమయినది. దేవదుందుభులు మ్రోఁగించిరి. పుష్పవర్షము గురిసినది. కైలాసమం దున్నవారందఱును విశేషముగా సంతోషించిరి. పార్వతీపరమేశ్వరులుఁగూడ మహానందమును బొందిరి. బ్రహ్మాదిదేవత లానందించిరి. దేవదత్తతోఁ గూడి విమానముమీఁదను గూర్చుండి యున్న దేవాంగుని జూచి యాశ్చర్యపడి యిదేటిసంగతియో కదా యని యాలోచించుచు నిశ్చేష్టితుఁడై యానందసముద్రములో మునిఁగియున్న విక్రమార్కు నిజూచి దేవాంగుఁ డిట్లనియె. రాజేంద్రా! విక్రమాదిత్యా! మహాబలపరాక్రమా! నీవ నేఁడీనావ నవలంబించి దుస్తరమయిన మాశాపసముద్రమును



దాఁటితిమి. నీవు మాకుఁ జేసినయుపకారమునకుఁ బ్రత్యుపకృతియే లేదు. అయినను నావలనఁ గావలసినది నీకెద్దియైన నున్నచోఁ దప్పక నెఱవేర్చెదను గోరుము. అని యిట్లు భార్యతోఁగూడ దేవాంగుఁ డన్నమాటలువిని యతిమేధావి యగు విక్రమార్కుఁడు మాటిమాటికి నాలోచించుచు నతనికి నమస్కరించి యిట్లనియె. ఓయీ! దేవాంగా! నీవు మహాదేవునిభక్తులలో మొదటివాఁడవు. అట్టి నీవు నాయెడ సంతోషము గలవాఁడ వైతివేని నేను దలంచినపుడు నీవు బేతాళరూపముతో నాయొద్దకు వచ్చుచునుండుము. నేను జెప్పినపని చేయుచుండుము. నీ కిష్టమయినచో నాకీవర మిమ్ము. అని యడుగఁగా దేవాంగుఁడు నట్లే యని యంగీకరించెను. ఇట్లు వర మీయఁగానే వెళ్ళుచున్నానని తనయొద్ద సెలవు పుచ్చుకొన్నవాఁడును త్రైలోక్యసుందరుఁడును నగు విక్రమార్కునిజూచి దేవదత్తయొక్క ప్రేరణచే దేవాంగుఁ డిట్లనియె. రాజా! కాలపూరుషుఁడను యోగి నిన్నుఁ గాళికకు బలి యీయను ద్దేశించి యున్నాఁడు. కావున నీవు వానివలన నతిజాగరూకుఁడవై యుండుము. ఎప్పుడా యోగి నిన్ను స్నానముచేయుమనునో అపుడే ముందు నీవు స్నానము చేసి చూపుమనుము. మఱి యెప్పుడు నిన్ను నమస్కరింపు మనునో అప్పుడు ముందుగా నీవు నమస్కరించి చూపుమనుము. ఆయోగి కాళికి నమస్కరించుచుండఁగా నీచంద్రహాసముచే వానితల నఱికి కాళికి బలి యిమ్ము. అపుడే దేవి నీకుఁ బ్రత్యక్షమగును. ఆమె ప్రసన్నురాలై నన్ను నీకు సదా యధీనునిగాఁ జేయఁగలదు. భక్తచింతామణియగు నాయంబ నీకుఁ జక్రవర్తిత్వమును దీర్ఘాయువును దయచేయును. అని చెప్పి యాదేవాంగుఁడు భార్యతోఁగూడ రాజుననుమతిఁగొని కైలాసమునకుఁ బోయెను. తరువాతను రాజు కాలపూరుషయోగియొద్దకు వచ్చెను. యోగి రాజును జూచి బేతాళుఁడేఁడీ? బేతాళుఁడేఁడీ? యని యడుగఁగా విక్రమార్కుఁ డాబేతాళునివృత్తాంత మంతయు సాంతముగా నాయోగికిఁ జెప్పెను. యోగి యావృత్తాంత మంతయు విని త్వరతో విక్రమార్కునితోఁగూడి కాళికాదేవాలయమునకుఁ బోయి లోపలఁ బ్రవేశించి రాజును దేవికి బలి యీయ నిశ్చయించి రాజునుజూచి స్నానముచేయుము స్నానముచేయుము అని త్వరపెట్టెను. అపుడు రాజు దే

హంగుఁడు చెప్పినమాటలు జ్ఞప్తికి దెచ్చుకొని యోగీంద్రా! ముందుగా నీవు స్నానము చేయుము. తరువాత నేను స్నానము చేసెదను. అనిరాజు చెప్పఁగానే యోగి స్నానముచేసి యాహ్నికము నెఱవేర్చుకొని యుండెను. తరువాతరాజును నట్లేచేసెను. ఇట్లే ప్రతిపని యోగిచేతనే ముందుచేయించెను. తరువాత యోగి కత్తి చేతఁబట్టుకొని రాజును నమస్కరింపుమనుడు రాజు యోగివర్యా! నీవే ముందుగా నమస్కారము గూడఁ జేసిచూపించుమని యాదరముగాఁబలికెను. యోగి నమస్కరించుచుండఁగా రాజు చంద్రహాసము పట్టుకొని యొక్కవేటున కక్కపటిని గాళికకు బలియిచ్చెను. వెంటనే దేవదుందుభులు మ్రోఁగినవి. పుష్పవర్షము గురిసినది. గంధర్వులు పాడిరి. అచ్చరలాడిరి. దేవతలు రాజునకు జయజయధ్వనులు పలికిరి. భక్తవత్సల యగు కాళి ప్రత్యక్షమై రాజున కిట్లనియె. రాజా! నీమనసులో నిష్టమయినవరము వేఁడుము, అనఁగానే రాజతరులకు దుర్లభమయిన యాదేవిదయకుఁ బాత్రుఁడై తల్లీ! నేను స్మరించినతోడనే దేవాంగుఁడు బేతాళరూపముతో నాదగ్గఱకు రావలయును. నన్నుఁజక్రవర్తిని జేయుము. దీర్ఘాయువిమ్ము. నాకింతకన్న నక్కఱలేదు. అనిరాజు ప్రార్థించినతోడనే యట్లే యగు నని దేవి యంతర్ధానమయినది. అయ్యంబయొద్ద ననుజ్ఞపుచ్చుకొని రాజుజ్జయినిలోనికి వచ్చి జరిగినయావద్వృత్తాంతమును సంతోషపూర్వకముగా సభలోనివారి కందఱకు నుజెప్పెను. వందిమాగధులు స్తోత్రపాఠములు చేయుచుండఁగా సింహాసనముపైఁ గూర్చుండి సామంతరాజులు సేవించుచుండ దేవేంద్రుఁడు స్వర్గలోకముఁ బాలించుచుండునట్లు విక్రమార్కుఁడు చతుస్సముద్రముద్రితభూమినే కాకుండ ద్వీపాంతరములను గూడ జయించి యవిఘ్నముగ నేలుచుండెను. అట్టిమహారాజు రాజ్యమేలుచుండఁగ నప్పటిప్రజ లెట్లుందురో వేఱుగఁ జెప్పవలయునా? రాజెట్టివాఁడయినఁ బ్రజలును నట్టివారే కదా యగుదురు. ఇది బేతాళరూపుఁ డయినదేవాంగునియొక్కయు నతనిభార్యయగు దేవదత్తయొక్కయు శాపమును విడిపించినకథ. ఇది చదివినవారికిని వినినవారికిని భూతబేతాళ బ్రహ్మరాక్షస శాకినీఢాకిన్యాదిభూతములవలన భయ ముండదు. సదా దీనిని భక్తిశ్రద్ధాతాత్పర్యములతోఁ జదివినవారి కీశ్వరునిదయవలన జన్మాంతరమున



నైనను దప్పక యష్టసిద్ధులును గలుగును. మఱియు నిది యీశ్వరుని మానసపుత్రుఁ డయిన దేవాంగునిచరిత్రగనుక దీనిని జదివినవారిని బార్వతీపరమేశ్వరులు ప్రేమగాఁ గాపాడుచుందురు. మునులారా! ఈదేవాంగునిచరిత్రమును బ్రహ్మదేవుఁడు నారదాదిమునులకుఁ జెప్పెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరిత్రమున బేతాళమోక్షణ మన్నది యిరువదియయిదవ యధ్యాయము.



ఇరువదియాఱవ యధ్యాయము.

సూతు—ఒకనాఁడు శివుఁడు కైలాసముపై నిండుకొలువైయుండఁగా నారదుఁడు వచ్చి యాయన ననేకవిధములుగా స్తుతిచేయ మొదలిడి యాపాటలతోనే తనకు సర్వసిద్ధులును గలుగునట్లును సిద్ధులకు సిద్ధు లిచ్చుశక్తి గలుగునట్లును, తానుగుబేరునితో సమముగాఁ గీర్తియు ధనము గలవాఁ డగునట్లును చిరకాలము బ్రదుకునట్లును సంపదగలుగునట్లును వరము గోరెను. అతనిభక్తికిసంతోషించి కోరినవరము లన్నియు దయచేసి నారదుని జూచి శివభగవానుఁ డిట్లనియె. నారదా! నీవుత్రిలోకసంచారివి. భూలోకములోని విశేషము లెవ్వియైన నున్నచో వెంటనే విన్నవించుకొనుము. సావధానముగాఁ జిత్తగింతుము. అని శివుఁడనఁగా నారదుఁ డిట్లనియె. దేవా! భూలోకవృత్తాంతము విన్నవించుకొనుటకే వచ్చితిని. కలి ముదిరినకొలఁది భూమిపై నపశబ్దము లంతటను వ్యాపించెను. వ్యాకరణము వేదములు తెలిసినవారు లేరు. సర్వకర్మములయొక్కయర్థములను ఋగ్యజుస్సామాథర్వణవేదములను, పదక్రమజటాదులను జెప్పవారే లేరు. వేదగ్రంథములయందు, శాస్త్రగ్రంథములయందు, ఆగమములయందు, పురాణములయందు శబ్దసౌష్ఠవము లేదు. వేదాంగములను, మీమాంసాతర్కములను, ఇతిహాసములను దెలిసినవారు లేరు. బ్రాహ్మణు లందఱును పురాణాదులయర్థములను దెలిసీ తెలియనివారై యుండిరి. వేయేలా? ఒక్కభోజరాజుతక్కఁ దక్కినవా రెవరును విద్వాంసులు గారు. అనియిట్లు శివునియెదుట నారదుఁడు చెప్పుచుండఁగా నచ్చట వినుచున్న మునీశ్వరులలో హాహాకారము పుట్టినది. శివభగవానుఁ డది యంతయు విని యాసభలో నున్నతనమానసపు

త్త్రిని దేవాంగుని జూచి యిట్లనియె. ఓయీదేవాంగా! నీవు సర్వజ్ఞుండవు. వేదశాస్త్రములు దెలిసినవాఁడవు. నాఫాలనేత్రమునుండి పుట్టినవాఁడ వగుటంజేసి నాయంతటిజ్ఞానము గలవాఁడ వయితివి. అఱువదినాలుగుకళలను దెలిసినవాఁడవు నీవే. నీకంటె మూఁడులోకములయందును మఱియొకఁడు లేఁడు. మహామతీ! ఇపుడు నారదుఁడు చెప్పినదంతయు వింటివిగదా! కావున నీవు వేగముగా వివేకము జ్ఞానము లేని భూలోకమున కేఁగుము. అచ్చట నున్నబ్రాహ్మణుల నందఱను బండితులను జేయుము. భూమిలోకమునం దుండుగ్రంథము లన్నియు నపశబ్దములతో నిండియున్నవి. అవి యన్నియు బాగుగా సంస్కరించి తప్పులు లేకుండ వ్రాయుము. మఱియు నీవు భూమిలోఁ దొమ్మిది వ్యాకరణములు శిష్యులకుఁ జెప్పుము. వేదములు వేదాంగములు శాస్త్రములు బాగుగా వ్యాపింపఁజేయుము. అని యిట్లు శివుఁ డాజ్ఞాపించినతోడనే యతఁడు భక్తకల్పవృక్ష మగు శివు నిట్లు ప్రార్థించెను. దేవా! నేను మనుష్యశరీరము నవలంబించి యచ్చట నున్నప్పటికిని సదా నీపాదములయందు స్థిరమైనభక్తి యుండులాగున వరమిమ్ము. అని కోరఁగా నే శివుఁడట్లే యని వర మిచ్చి భూలోకమునకుఁ బంపెను. తరువాతను దేవాంగుఁడు శివునకుఁ బ్రదక్షిణ నమస్కారములు చేసి సూర్యకోటిసమప్రభ మగువిమాన మెక్కి సంతోషముగా భూలోకమునకు వచ్చెను. పిదప బ్రాహ్మణరూపమును ధరించి విమానము దిగి బ్రహ్మవర్చసముచే రెండవ సూర్యునివలెఁ బ్రకాశించుచుండెను. అతఁడు దివ్యాభరణములను ధరించి నుదుట మూఁడు రేఖలుగా విభూతి దిద్ది నవరత్నఖచితములగునకుండలములు గండములపయిఁ దాండవ మాడుచుండఁగా బంగారుయజ్ఞోపవీతము గలిగి చేతికిఁ బవిత్రము పెట్టుకొని సంతతము పంచాక్షరిని జపింపుచుఁ జేతులయందు నవరత్నఖచితములయి సింగపుఁదలలచే బనితనముగాఁ జేయఁబడిన కంకణాదులు వెలుఁగుచుండఁగా ధారాపట్టణములోఁ బ్రవేశించెను. దేవేంద్రునియమరావతిని మించియున్న యాపట్టణములోని యాయావిశేషములను జూచుచు భోజరాజును జూచు కుతూహలముతో రాజమార్గమునుండి పోవుచుండఁగా నతనిని జూచినవారెల్లఁ బూజింప మొదలిడిరి. క్రమముగా బృహస్పతి



దేవసభలోఁ బ్రవేశించినట్లు దేవాంగుఁడు భోజరాజుసభలోఁ బ్రవేశించెను. నవరత్నఖచితసింహాసనముపై నుదయగిరిపై వెలుఁగుచుండు బాలసూర్యునివలె నొప్పుచు శరీరమును ధరించి వచ్చిన మన్మథుఁడేమో యని చూపఱకు భ్రాంతిని గలిగించుచు సామంతరాజులచే సేవింపఁబడుచు వందిమాగధుల స్తోత్రపాఠము లాలించుచు సర్వాంగసుందరు లగు సుందరులు వింజామరలు వీచుచుండఁగా సామాద్యుపాయముల నెఱిఁగిన మంత్రులకు సమాధానము చెప్పుచునుండు భోజరాజును దేవాంగుఁడు చూచెను. ఆతఁడును దేవాంగుని జూచి సగౌరవముగా సింహాసనము దిగి యాతనికి సాష్టాంగ దండప్రణామము లాచరించి యుచితాసనముపైఁ గూర్చుండఁ బెట్టి కుశలాదు లడిగి యిట్లనియె. ఓ పండిత సార్వభౌమా! ఏ దేశమునుండి వచ్చుచున్నావు? తేజస్సుచే నిన్ను బ్రాహ్మణునిగాఁ దలంచుచున్నాను. నీవు బ్రహ్మవా? శివుఁడవా? విష్ణుమూర్తివా? నీ వెవరో యసాధారణుఁడవు గాని సామాన్యవ్యక్తివి గావని నమ్ముచున్నాను. కావున నీవే యథార్థము చెప్పి నాసందియమును దీర్పవలయు నని కోరఁగా నా దేవాంగుఁడు భోజమహారాజుతో నిట్లనియె. రాజేంద్రా! నేను వరరుచి యనువాఁడను. కాశీదేశమునుండి యిక్కడికి వచ్చితిని. మాయమ్మపేరు పార్వతి, తండ్రిపేరు శంకరుఁడు. నేను సర్వశాస్త్రములు సర్వవేదములు చదివితిని. నాకుఁ దెలియని పురాణేతిహాసములు లేవు. ఇది యది యన నేల? అన్ని విద్యలును నాకు జిహ్వాగ్రమందున్నవి. పదునెనిమిది పురాణములును దెలియును. ఆగమగ్రంథములు చదివితిని. స్మృతిగ్రంథము లన్నియు స్మృతిపథమం దుంచితిని. సర్వబ్రాహ్మణులును నాకు వందనము లాచరింతురు. కావ్యాలంకారములయొక్కయు నాటకగ్రంథముల యొక్కయుఁ జంపూగ్రంథములయొక్కయుఁ దత్త్వము నాకు బాగుగాఁ దెలిసియున్నది. పదక్రమజటలలో నన్నెవరును గెలువఁజాలరు. వేదములకు నేనే యుత్తమగురుఁడను. వేయిమాటలు చెప్పి యేమిప్రయోజనము. నే నొకటేమాట చెప్పెదను వినుము. లోకు లందఱును నన్ను సర్వజ్ఞుఁ డందురు; అది యట్టిదే. అని యిట్లు పలుకుచున్న వరరుచిని బహువిధములుగా భోజరాజు గౌరవించి ధనధాన్యసమృద్ధ మయిన దివ్యభవన

మొకటి యాయన కిచ్చెను. మఱియు నూఱు మదపుటేనుఁగులను, మంచిజాతివి వేయిగుఱ్ఱములను, కుండలాద్యలంకారములను, అమూల్యములగు వస్త్రములను రత్నాలవి ముత్యాలవి హారములను నిచ్చి సన్మానించి యాయనను దనసభలో నధికారినిగాను విద్వచ్చూడామణినిగాను నిర్ణయించెను. తరువాతను వరరుచిని జూచి భోజుఁ డిట్లనియె, అయ్యా! వరరుచిపండితులవారూ! సాదరముగా నాపలుకు వినుఁడు. తా మీబ్రాహ్మణుల కందఱకును వేదములు శాస్త్రములు నేర్పుదురుగాక. మఱియు, ఆగమములు, అష్టాదశ పురాణములు, పదక్రమజటలు,నవవ్యాకరణములు,శబ్దసాస్థవవిజ్ఞానము బ్రాహ్మణులకుఁ గలుగునట్లు చేయుఁడు. అని భోజుఁడు చెప్పఁగానే యావరరుచి బ్రాహ్మణులందఱకును సమస్తవిద్యలను జెప్పి గొప్పవారినిగాఁజేసెను. బ్రాహ్మణులందఱిలోనను దానే యుత్తముఁ డనిపించుకొనుచుండెను. ఇట్లుండఁగా నుజ్జయినీపట్టణములో భట్టాచార్యుఁ డను బ్రాహ్మణుఁ డొకఁడు గలఁడు. ఆతని కతిసుందరి కలావతి యను కుమారిత గలదు. ఆమె సర్వశాస్త్రములు, వేదవేదాంగములు, సంగీతవిద్య, నాట్యవేదము, మొదలగునవి యన్నియు నెఱింగిన జాణ, శుచిస్మిత యగునాసుందరి పెనిమిటికై యిట్లు ప్రతిజ్ఞ పట్టినది. "మన్మథసుందరుఁ డగు నెవఁడు నన్ను విద్యావాదములో గెల్చునో ఆతనీశ్వరుని నేను దప్పక పెండ్లియాడెదను" అను నామెప్రతిజ్ఞ విని నానాదేశములనుండి పండితులువచ్చి యామె నోడింపఁబోయి యోటమిచెంది తిలదానము పట్టిన బ్రాహ్మణులవలె మోము వంచుకొని వచ్చినదారినే పోవుచుండెడివారు. ఇట్లుండఁగా నొకప్పుడు వరరుచి యావృత్తాంతమంతయు విని భోజరాజుచే ననుజ్ఞాతుఁడై యుజ్జయినీపట్టణమును గూర్చి పోయెను. క్రమముగా భట్టాచార్యుని యింటికి వెళ్ళి సర్వాంగసుందరియగు నాతని కూఁతును గలావతి యనుదానిని జూచి సుందరీ! నేను నిన్ను వాదములో జయించి పెండ్లియాడుటకై వచ్చితిని. ఏమిచెప్పెదవో చెప్పుము. అని యతఁ డనఁగానే యామె చిఱునగవు మొగము నలంకరింప గర్వముతో నిట్లనియె. అయ్యా! వినుఁడా! మహావృద్ధవు. మీది యేదేశము? నీపేరేమి? నీకెందులోఁ బాండిత్యము గలదు? వేదములలోనా, శాస్త్రములలోనా? నాటకాలంకారసాహిత్యమునందా? లేక, పురాణాదులయందా? యథార్థము చెప్పుము. అన నతఁడిట్లనియె. గంగాతీరమందు వారాణసి యనుపట్టణము గలదు. అది విశ్వనాథునకును విశాలాక్షికిని నివాసస్థానము, నానివాసమచ్చటనే. నాపేరు వరరుచి యందురు. నేను సర్వజ్ఞుఁడను. సరస్వతి నానాలుకపైఁ దాండవ మాడుచుండును. అమ్మాయీ! నీకేగ్రంథములలోఁ బరిశ్రమ గలదో వానిలోనే ప్రసంగింతములెమ్ము. అని యతఁడు చెప్పినపిదప నుభయులకును వాదము ముదిరినది. ఒకరి నొకరు జయించు నభిలాష గలిగి యున్నవారుగాని జయాపజయములు లేవు. వినుటకై వచ్చిన పండితుల యానందమునకు మితిలేదు. తరువాతను బ్రాజ్ఞుఁడగు వరరుచి యామెను దప్పక జయింతమను బుద్ధిచే వేదాంతప్రసంగములోనికి దింపెను. ఆమె వేదాంతశాస్త్ర మంతబాగుగాఁ జదువలేదు. కావున వరరుచి యామెను జయించినవాఁడాయెను. అపుడు వరరుచి యామెతో నిట్లనియె. కలావతీ! నిన్ను నేను వేదాంతశాస్త్రములో జయించితిని. కనుక నన్నుఁ బెండ్లియాడుము. అను నతనిమాటలు విని యా భట్టాచార్యునికుమారిత వేళాకోళముగా నిట్లనియె. ఓయీ! వరరుచీ! ముసలీ! నీవు మిక్కిలిని వృద్ధుఁడవు. నీజుట్టంతయు ముగ్గుబుట్టవలెఁ బండియున్నది. దంతములా లేవాయెను. చేతులగోళ్ళు అంతకుమున్నె లేవాయెను. లోకములో స్త్రీలు కేళిసమయమున దంతక్షత నఖక్షతముల నపేక్షింతురుగదా! నిన్ను నేను బెండ్లియాడినచో నాయధరస్తనములయందు దంతక్షతనఖక్షతములు చేయువారెవ్వరో ముందుగాఁజెప్పుము. అపునయ్యా! వరరుచిపండితుండా! "వృద్ధస్యతరుణీవిషం" అను నీతికోవిదులమాట వినలేదా? నీవేమో పెద్దపండితుండవే. అదిగాక ముంతముసలివాఁడవు గదా. నీకు రతిసామర్థ్య మెక్కడిది? నేను దరుణిని. నన్ను సంతోషపెట్టువా రెవరున్నారు? స్త్రీలకు రెండురెట్లు భోజనము, నాలుగురెట్లు బుద్ధి, ఆఱురెట్లు సాహసము, ఎనిమిది రెట్లుకామము, పురుషులకంటె హెచ్చని యందురు గదా! అదియైననువినలేదఁటయ్యా! సర్వజ్ఞుఁడవేమో? లోకజ్ఞానము తెలియకపోయెనే! ఇఁక నెక్కడిసర్వజ్ఞత్వమయ్యా! సర్వాంగసుందరి యగురంభ యెక్కడ? ధర్మహీనుఁ డయి నరక మనుభవించుపరమపాపి యెక్కడ? దివ్య

సుందరవిగ్రహ యగుశచీదేవి యేడ? మృతిశీల మగుదేహముగల నహుషుఁడేడ? కొంకినక్క యెక్కడ? స్వర్గలోకమేకడ? అనియిట్లనేక విధములుగా ధిక్కరించుటచే వరరుచి మహాకోపియై యాపూఁబోణి కిట్లనియె. మూర్ఖురాలా! అనఁదగినమాట, అనఁదగనిమాట యెఱుఁగవు! పండితురాల ననిమాత్రము గర్వించుచున్నావు. బ్రాహ్మణవంశమున కపకీర్తి దెచ్చుటకై పుట్టిన నీవంటి పరమమూర్ఖురాలితో మాటలాడనేరాదు. అవును నీవన్నట్లే, కుక్క యెక్కడ? పురోడాశ మెక్కడ? రాకాసి యెక్కడ? అమృత మెక్కడ? గాడిదయేడ? గంధమేడ? నీవంటియాఁడుది యేడ? నావంటిమహాపండితుఁ డేడ? అయినను నీహితమునకై కొంచెము చెప్పెదను వినుము. నీవు మహాకోపినివలె నగపడుచున్నావు. నేను జెప్పినమాట నీకిష్టమయినచో నట్లు చేయుము. నాకంటెఁ బండితుఁడు నాకొడుకున్నాఁడు. రెండవమన్మథునివలెనే యుండును. రాజాధిరాజులు ముందు వానిని గౌరవించి పిదప నన్ను గౌరవింతురు. వాదిమత్తేభపంచాస్యుఁ డని బిరుదము నొందినవాఁడు. నీకిష్టమైనచో వానిని బెండ్లియాడుము. అని యతఁడు చెప్పినసంగతి కాసతి యంగీకరించినది. ఇది చాలబాగుగా నున్నదన్నది. తరువాతను బుద్ధిమంతుఁ డగువరరుచి యామెచే ననుజ్ఞాతుఁడయి భట్టాచార్యునియొద్ద సెలవంది బయట వచ్చి క్రమముగా నింటికిఁ బ్రవేశించి కలావతి యన్న చెడుమాటలు తలంచుకొని దీర్ఘకోప మవలంబించెను. అట్టికోపమును సార్థకపఱుచుకొందమని యిట్లు యోజింప మొదలిడెను. ఆధూర్తురాలు నన్ను మొగముచూడకుండ నవాచ్యము లన్నది గనుక దానికి బుద్ధిహీనుఁ డయినగాడిదలకాపరిని బెండ్లి చేసి యప్పుడు నాకోపము చల్లార్చుకోవలయును. అని యాలోచించుచు నాపట్టణములోనే పండితపామరులచే గౌరవింపఁబడుచు నుండెను. ఒకనాఁడు వరరుచి స్నానముచేయుటకై యూరిబయటకుఁ బోవుచుండఁగాఁ ద్రోవలో నొక దివ్యమయిన తామరకొలను గనుపడినది. వరరుచి యందు స్నానముచేసి పాడిగుడ్డలు గట్టుకొని పుష్పదర్భాంబుసహితముగా సూర్యభగవానున కర్ఘ్య మిచ్చి నిత్యకృత్యములు నెఱవేర్చుకొని యింటికిఁ బోఁబోవుచుండఁగా నాసమీపమున నొకానొకఁడు బ్రాహ్మ



ణాకారము గలవాఁడు మేఁకలను గాడిదలను మేఁతకుఁ దోలుకొనిపోవుచు నగపడెను. వరరుచి వానిదగ్గఱకుఁబోయి బ్రాహ్మణాకృతిగల యోపిల్లవాఁడా! నీపేరేమి? నీతల్లిదండ్రు లెవరు? నీయిల్లెక్కడ? నాతోఁ జెప్పుమనవుడు పసులకాపరి యాశ్చర్యపడుచు నిట్లనియె. వరరుచిగారూ! నేను బ్రాహ్మణునికుమారుఁడను. నాతండ్రిపేరు మాధవశర్మ. తల్లిపేరు లక్ష్మి. బ్రహ్మవాది యగునాతండ్రి నాకయిదవయేట నుపనయనము చేసి మాయమ్మతోఁగూడ నుత్తరలోకములకుఁ బోయెను. నాపేరు కవిరత్నము. ఇపుడు నేను మేఁకలను గాడిదలను గాయుచున్నాను. ఇది నీచపుపని యయినను జీవనార్థ మవలంబించితిని. అతనిమాటలు విని వరరుచి కొంతసేపాలోచించి యిట్లనియె. అబ్బాయీ! ఈమేఁకలను గాడిదలను నీయజమానున కప్పగించి యతనియొద్ద సెలవు పుచ్చుకొని వేగముగా రమ్ము. నీకుపయోగించునది యొక్క మహాకార్య మున్నది. అనునప్పటికాపిన్నవాఁడు చాల సంతోషించి యాబ్రాహ్మణుఁడు చెప్పినచొప్పుననే చేసి వరరుచియొద్దకు వచ్చి నిలువఁబడెను. వరరుచియు వచ్చియున్న కవిరత్నమునుజూచి "కవిరత్నం! సావకాశముగా నామాటలు వినుము. ఈ యూరిలో భట్టాచార్యుల నెఱుఁగుదువు గదా. అతనికూఁతురు కలావతి మహావిద్వాంసురాలు. అది రెండవసరస్వతియే. దానిని నీకుఁ బెండ్లి చేసెదను. కాని నేను జెప్పినమాటలు మాత్రము రెండవవారికిఁ దెలియకుండ మనస్సులోనే యుంచుకొని యట్లే చేయుము. ఆకలావతి నిన్నే ప్రశ్న చేసినను మౌనముతోనే బదులు చెప్పుచుండుము. నిన్నుఁ జూచి విద్వాన్! ఎన్ని విద్యలు చదువుకొంటివని యడుగును. అప్పుడు నాలుగు వ్రేళ్ళుమాత్రమే చూపుము. మఱియేమి చదువుకొన్నావని యడిగినపు డాఱువ్రేళ్ళు చూపుము. మరల నెన్నివిద్యలు చదువుకొన్నావనిన నాలుగువ్రేళ్ళు చూపుము. ఈ జగత్తునకు సృష్టిమొదలయినవి చేయువా రెందఱని యడిగినప్పుడొక్క వ్రేలుమాత్రమే చూపించుము, అనెను. ఆపిన్నవాఁడును జ్ఞప్తి యందుంచుకొని యట్లే చేయుదు ననెను. తరువాత వరరుచి వానిని దనయింటికిఁ దెచ్చి యాఁడువాండ్రచే స్నానాదికము చేయించి యనేక భూషణములతో నలంకరించి బంగారుపల్లకిలోఁ గూర్చుండఁబెట్టి పండి

తులచే మోయించుకొని వచ్చెను. ఆపల్లకీ మోయుపండితులు పూర్వ మాకలావతితో వాదించి యోడినవారే. ఇంతట నచ్చట మహాకోలాహలము గలిగినది. ఇంత మహావిద్వాంసుఁ డుండఁబోఁ డని చూచినవా రందఱును జెప్పుకొనుచుండిరి. రాజమార్గములలో నిసుకవైచిన రాలకుండ నున్నది. ఇట్లు వరరుచి క్రమముగా వానిని గలావతిమందిర మునకుఁ బల్లకీతో మోయించుకొని రాఁగాఁ గలావతి సూర్యసమానముగాఁ దేజశ్శాలియు, దివ్యాభరణభూషితుఁడును, దివ్యపీతాంబరధరుఁడును, దివ్యగంధమాల్యోపశోభితుఁడును నగు పిన్నవానిని జూచి యత్యాశ్చర్యసముద్రములోఁ మునిగి యితఁ డెవ రని యడిగినది. వరరుచి వీఁడే నాకుమారుఁడు. సర్వవిద్యాపారంగతుఁడు సర్వజ్ఞుఁడు వీని పేరు కవిరత్నము రాజరాజులచే సభలలో గౌరవింపఁబడుచుండువాఁడు. వేయేలా? వీఁడు సరస్వతియొక్క పురుషావతారమే సంశయము లేదు. వీఁడు ప్రాకృతు లగువిద్వాంసులతోఁ బ్రసంగింపఁడు. ఎవరు ప్రశ్నించినను మూనముగా బదులు చెప్పుచుండును. అమ్మాయీ! వీనిని బెండ్లియాడుటకు నీమనస్సు త్వరపడుచున్న దేని వేగము పెండ్లియాడుము. ఇటువంటివరుఁడు దొరకుట సామాన్యమయిన సంగతి గాదు. అని చెప్పినయాతనిమాటలు విని మహాప్రాజ్ఞురా లగుకలావతి గంభీరముగా నిట్లనియె. వరరుచీ! ఈ నీకుమారుఁడు సర్వజ్ఞుఁడే యయినచో వెంటనే నేనడుగుప్రశ్నలకు బదులు చెప్పునుగాక. అని యచ్చటి పండితులందఱును వినుచుండఁగా నాపిన్నవానితో నిట్లనియె. విద్వన్! నీ వెన్ని విద్యలు చదువుకొంటివి వనఁగా నతఁడు నాలుగువ్రేళ్ళు చూపించెను. మఱల నేమి చదువుకొంటివి వన నాలుగువ్రేళ్ళు చూపించెను. మఱియు నేమి చదివితి వనఁగానే నాలుగు వ్రేళ్ళు చూపించెను. ఈజగత్తునకు సృష్టిస్థితిసంహారములు చేయువా రెంద అన నతఁ డాదరముగా నొక్కవ్రేలు చూపించెను. ఇట్లన్నిప్రశ్నలకును వ్రేళ్ళు చూపించినతోడనే యాకలావతి వరరుచి నభిప్రాయ మడుగఁగా నతఁ డిట్లనియె. ఇతఁడు గురువునొద్ద నాలుగువేదములును జదివెను గనుక నాలుగు వ్రేళ్ళు చూపించెను. ఇతఁడు వేదాంగములాఱును గురువునొద్ద జదివెను గనుక నాఱువ్రేళ్ళు చూపించెను. పురాణవిద్య ధర్మశాస్త్ర



ము మీమాంస న్యాయవిస్తరము చదివినందులకై నాలుగువేళ్ళు చూపించెను. ఈజగత్తునకు సృష్టిస్థితిసంహారములు చేయువాఁడు పరబ్రహ్మమొక్కఁడే యని యొకవేలు చూపించెను. అని యిట్లు వరరుచి చెప్పినసమాధానము విని కలావతి మనస్సులో నాలోచించి పరమానందభరితురా లయినది. తరువాత నామె చిత్తరువులలోఁ గూడినగోడ యొకటి చూపి వరా! ఈపదితలలు, ఇరువదిచేతులును గలవాఁ డెవరో వేగముగాఁ జెప్పుమనవుడు వటుఁడు వరరుచి చెప్పినమాటలు మఱచిపోయి వీఁడు రాభణుఁడు కాఁడా యనెను. ఓయీ! నీవు సర్వము నెఱిఁగినవాఁడవు గదా రాభణుఁడని యెట్లంటివని యామె యనుడు వరరుచి యామెయనుమానము పోవులాగున "కుంభకర్ణునిలో భకారమున్నది. విభీషణునిలో భకారమున్నది రాక్షసులకులములో ముఖ్యుఁడగు నితఁడు రాభణాసురుఁడే కాని రావణాసురుఁ డెంతమాత్రమును గాఁడని వీనితాత్పర్యము. ఇంతకును సర్వజ్ఞుఁడగుటచే వీఁడేమన్నను జెల్లుట కేమియు నభ్యంతరము లేదు. వీనిమాటను గాదనుపండితుఁడే యుండఁడు. నందిని పందిని, పందిని నందిని జేయఁగల సామర్థ్యము గలదు." అని వరరుచి యుక్తియుక్తముగాఁ బలుకఁగాఁ గలావతి యానందభరితురాలయినది. తరువాతను వరరుచి భట్టాచార్యులను బిలిచి తనకుమారునికిఁ గన్యాప్రదానము చేయు మనెను. భట్టాచార్యుఁ డట్లే చేయుదు నని యొప్పుకొనెను. పిదప మంచిముహూర్తమున వివాహమహోత్సవము జరిపిరి. బ్రాహ్మణోత్తములు వేదమంత్రములు చదివిరి. భట్టాచార్యునియిల్లు వాద్యములతోను, ఆటలుపాటలు మొదలగువానితో నిండిపోయినది. వధూవరులకు మంగళస్నానములు చేయించి సర్వాభరణభూషితులనుగాఁ జేసి కల్యాణమంటపము మీఁదికిఁ దెచ్చిరి. నవరత్ననిర్మిత మయిన పెండ్లియరుగుమీఁద వధూవరులు రోహిణీచంద్రులవలె వెలుఁగుచున్నారు. పిదప బురోహితుఁ డగ్నిని బ్రతిష్ఠాపించి యథావిధిగా బ్రాహ్మణులతోఁ గూడ హోమములు చేసెను. భట్టాచార్యుఁడు ధర్మపత్నీసమేతముగాఁ బీటమీఁదను గూర్చుండి యల్లునితో నిట్లనియె. కవిరత్నం! ఇటురమ్ము. నాకుమారితెను నీకుదారవోయుదును. ఇది మహాప్రాజ్ఞురాలు నీవు సర్వజ్ఞుఁడవు కావున దీనిని సహధర్మచారిణి

నిగాఁ బరిగ్రహింపుము. అని చెప్పి యతనిచేతిలో సమంత్రకముగా దారవోసి యప్పగించెను. బుద్ధిమంతుఁడగు కవిరత్న మాకన్యారత్నము యొక్క హస్తమును దనహస్తముతోఁ బట్టుకొనెను. అపుడు వాద్యముల మంగళఘోష మాకాశము నంటినది. బ్రాహ్మణుల యాశీర్వాదధ్వనులామంగళవాద్యధ్వనుల నతిక్రమించినవి. భట్టాచార్యుఁడు పండితులకు భూరిదక్షిణ లిచ్చెను. ఈరీతిగాఁ గవిరత్న కలావతులకు వివాహమహోత్సవము జరుగఁగాఁ బట్టణములోనినువాసినులు మంగళగీతములు పాడుచు నీరాజనములు పట్టిరి. ఉజ్జయినీపట్టణములోనివా రందఱును సంతోషించిరి. మఱి కొన్నాళ్ళకుఁ గలావతి రజస్వల యయినది. నాలవనాఁడు గర్భాధానమహోత్సవము చేయ నిశ్చయించిరి. ఆరాత్రి పండితులకు ఫలదానము లిచ్చిరి. పెండ్లికుమారుఁడు ముందుగాఁ గేళిమందిరమునకుఁ బోయి నిద్ర పోయెను. తరువాతను గలావతి లోపలికిఁ బోయి భర్త నిద్రపోవుచున్నాఁ డని తెలిసికొని మేల్కొలుపఁ బోయినది. ఎంతపిలిచినను బలుకమిచే వీణ పట్టి వాయించినది. ఎంతసేపు పాడినను మేల్కొన కుండుట చూచివానివక్షస్థలముపై గంధపునీరు పోసినది. అప్పటికిని మెలుకువ రాక యుంటచేఁ దన నోటిలోని తాంబూల మాతనినోటఁ బెట్టినది. అతఁడు నిద్రలో నిట్లు పలవరింప మొదలిడెను. ముందుగా మేకలు గాడిదలు ధ్వనిచేసినవి. తరువాతను నా గుండెలమీఁద మూత్రించినవి. ఆపిదప నానోటిలోఁ బురీషించినవి. అని యిట్లు నిద్రపోవుచున్న భర్త యన్నమాటలు విని యనుమానపడి యామె వెంటనే చెలికత్తియలను బిలిచి లేపించి యిట్లనియె. నీ వెవరు? బ్రాహ్మణుఁడవా కావా? నీవు నిజముగా వరరుచి కొమారుఁడవు గావు. నిజము చెప్పుము. నీమాటలను బట్టి చూడఁగా నీవు పండితుఁడవు కావని నిశ్చయ మయినది. నీవు నిజముగా మేకలను గాడిదలను గాచువాఁడవే. ఇట్లడిగిన భార్యమాటలు విని యమాయికుఁ డగుటచేఁ దనవృత్తాంత మంతయుఁ జెప్పెను. అది విని యిది యంతయు వరరుచి చేసినకృత్రిమము గదా యని నిశ్చయించుకొని గతజలసేతుబంధనము చేసి యేమిప్రయోజన మని యనుకొని యింతకును దైవయత్నమును దప్పించుకొనువారు లేరు. అయినను వీలయినంతలో బుద్ధిని వినియో



గించి మంచిస్థితిలోనికిఁ దేవలయును గదా యని నిశ్చయించి యప్పటికిఁ దగుగతిని మగనితో నిట్లన్నది. ఈ యుజ్జయినీపట్టణమును రక్షించు కాళి తనపట్టణమును జూచుటకు బయటికి వెల్లియుండును. పట్టణమంతయుఁ దిరిగి కొంతసేపటికి శక్తిసేనాపరివృతురాలై రాఁగలదు. కావున నీ విపుడే పోయి యాదేవళములోఁ దలుపు మూసికొని కూర్చుండుము. దేవి వచ్చి నిన్నుఁ దలుపు తీయు మనినచో వెంటనే గడియ దీసి యామెకు సాష్టాంగదండనమస్కారములు చేసి తల్లీ! నాకు విద్యాదానము చేయుము అని ప్రార్థించుము. అని యీరీతిగాఁ గలావతి మగనికిఁ దెలిపి చెలికత్తెను దోడిచ్చి కాళికాలయమునకుఁ బంపినది. అతఁ డట్లే దేవళములోఁ గూర్చుండి తలుపు మూసికొని యుండెను. భక్తులపాలింటఁ గామధేను వగు నాయంబను మనస్ఫూర్తిగా ధ్యానించుచుండఁగా నింతటఁ గాళి వచ్చి యెవరు లోపల? వేగము తలుపు గడియ తీయు మనఁగానే యోగినీగణసేవితురాలగు నాయంబతో నతఁ డిట్లనియె. తల్లీ! నాజడత్వ మనుగడియ విడిపోవులాగున విద్య నిచ్చితివేని నీకుఁ దలుపు తీసెదను. నీకు నమస్కరించుచున్నాను. నాకు విద్యాదాన మిమ్ము. అను వానిమాటలు విని యాయంబ దగ్గఱనే యున్న బాలయు, ముద్రిణియు, వారాహియుఁ గోపించి యమ్మా! సెల విమ్ము. మే మీదుర్మార్గు నిపుడే భక్షింతుము. అనుశక్తులమాట విని దేవి యిట్లనియె. వీఁడు పూర్వజన్మమునందు నాభక్తుఁడు నామంత్రము జపముచేయుచు నన్ను మిక్కిలిగాఁ బూజించెను. కావున నిపుడు నేను వీనిమనోరథమును బూర్తిచేసెదను. అని వారితోఁ జెప్పి కాళి బ్రాహ్మణునితో నిట్లనియె. ఓరీ! నాలుక చాపుము. అనఁగానే వాఁడట్లే చేసెను. దేవి వానినాలుకపయిని వాగ్భవబీజమును వ్రాసినది. వెంటనే యతఁడు సర్వజ్ఞుఁడై పరమేశ్వరి ననేకవిధములుగా స్తుతిచేయ మొదలిడెను. అతఁడు చేసినస్తుతులకు సంతోషించి నీవిటుపయిని కాళిదాసువని ప్రసిద్ధినిబొందెదవు. నీతండ్రి నీకుంచిన కవిరత్ననామము సార్థకమయినది. కాళిదాసా! నీవు కోరినదంతయుఁ గరతలామలకమయి యుండును. అని వరమిచ్చి పరివారముతోఁ గూడ నాలయములోఁ బ్రవేశించి యంతర్ధానము నొందెను. అచ్చటి

నుండి బయలుదేఱి కాళిదాసు భార్యయొద్దకువచ్చి జరిగినసంగతి యం
తయుఁ జెప్ప నామె తనభర్త యిప్పటికి నిజముగా సర్వజ్ఞుఁడాయెఁగదా
యను సంతోషముచే నతనిని మాటిమాటికిని గౌఁగిలించుకొన్నది. అ
తఁడు శచీదేవితో నింద్రుఁడుంబలె నామెతోఁ జిరకాలము క్రీడించుచుం
డెను. మఱికొన్నాళ్ళకుఁ గలావతి గర్భమున నొకకుమారుఁడు పుట్టెను.
మహామతియగు కాళిదాసు జాతకర్మాదిసంస్కారములు చేసి యాశిశువు
నకుఁ గవీంద్రుఁ డని పురోహితపురస్సరముగా నామకరణముచేసి దక్షి
ణాదులచే బ్రాహ్మణులను సంతోషపెట్టెను. కవీంద్రుఁ డనుపేరుగల
యాశిశువు కృతోపనయనుఁడయి తండ్రియొద్దనే వేదములు చదివెను.
అతఁడును దేవియాలయమునకుఁ బోయి వేదోక్తవిధి నాయంబను బూ
జింపఁగా భక్తవత్సలురాలగుదేవి ప్రత్యక్షమయి కవీంద్రునకు నఱువది
నాలుగువిద్యలను దయచేసినది. అతఁ డింటికి వచ్చి కాళికాప్రసాదము
ను దల్లిదండ్రులతోఁ జెప్పెను. ఇట్లుండఁగా నొకనాఁడు కొడుకు దగ్గఱ
నుండఁగానే కాళిదాసకలావతులు విద్యాప్రసంగము ప్రారంభించిరి. వా
దము ముదిరినది. నీ కేమియుఁ దెలియదని యామె భర్తనన్నది. ఆమా
టతోఁ గాళిదాసు కోపించి నీవు నాతల్లివి నీవు గురువవు. అని భార్య
పాదములకు నమస్కరించి యింటినుండి బయటికి వచ్చెను. తనకు నమ
స్కరించి పోవుచున్న మగని జూచి నీవకార్యము చేసితివి గనుక నీకు
స్త్రీచేతనే మరణము గలుగుఁగాక యని కలావతి శపించినది. విద్వ
ద్బృందనమస్కృతుఁడగు కాళిదాసు తరువాతను వేశ్యయం దనురక్తుఁ
డయి యాయుజ్జయినిలోనే యుండెను. తరువాతను వరరుచి ధారాపట్ట
ణము ప్రవేశించి యనేకవిధములుగా భోజరాజుచే సన్మానింపఁబడు
చుండెను. ప్రతిదినము రాజట్లు వరరుచిని సన్మానించుచుండుట సహింపఁ
జాలక యందఱును నొకచోఁగూడి యీవరరుచి మనలను ధిక్క
రించి రాజుచే మిగుల గౌరవింపఁబడుచున్నాఁడు. కావున వానికిని
రాజునకును బెద్దవిరోధమును గలిగింపవలయును. అప్పుడు మనమ
నస్సులలోని దుఃఖము చల్లాఱవలయు నని యాలోచించిరి. తరువా
తను విద్వాంసు లందఱును గోపపూరితులయి రహస్యమందు
డి యొకశూద్రుని రావించి వానికి వలసినంతధన మిచ్చి గౌరవించి



యిట్లనిరి. ఓయీ! శూద్రుఁడా! నీవు మాకుఁ జేయఁదగినకార్య మొ
కటి యున్నది. ఈపట్టణములో భోజరాజుచే గౌరవింపఁ బడుచున్నవాఁ
డొకఁడు గలఁడు. వానిపేరు వరరుచి నీవును వినియే యుందువు. వానిని
రాజుదగ్గఱ మాయన్న యని చెప్పుము. ఇటుపయిని నీకుఁ గావలసినం
తధన మిచ్చెదము. అని బోధించి యాశూద్రుని బంపిరి. మఱునాఁడు
తెల్లవాఱఁగానే వాఁడు భోజసభకుఁ బోయెను. పండితులచేతను సా
మంతరాజులచేతను నిండియున్న యాసభకుఁ బోయి రాజునకు నమస్క
రించి పండితులందఱును వినుచుండఁగా నిట్లని విన్నవించెను. మహాప్రా
జ్ఞుఁడ వగునోభోజభూపాలకా! నావిన్నపము చిత్తగించి తోఁచినరీతిని
నావ్యవహారము పరిష్కరించుము. అనఁగానే యది యేదో విన్నవించు
కొమ్మని రాజుత్తర మొసంగెను. రాజుగారియనుమతి కాఁగానే వాఁడు
నిస్సంశయముగా నిట్లనియె. రాజా! ఈవరరుచి యనువాఁడు నాయన్న.
నేనును వీఁడును విభక్తుల మయితిమి. నాధన మంతయు నపహరించి
దేశాంతరము పోయెను. ఎంత వెదకినను దొరకినవాఁడే కాఁడు. ఇన్నా
ళ్ళకు మీసభలో నున్నాఁ డని తెలిసి వచ్చితిని. నాధనము నాకిప్పిం
చుట ధర్మము. అని రాజుతోఁ జెప్పి నిర్భయముగా వరరుచిని గట్టుకొం
గు పట్టుకొని లాగ మొదలుపెట్టి "అన్నా! ముందు నీవెంతధనము నాది
యపహరించితివో అది యీయకుండ నిన్ను వదలువాఁడను గాను."
అని వరరుచిని లాగుచున్న శూద్రుని జూచి సభాసదు లయినయాపండి
తులు పరమసంతోషభరితులయిరి. రాజు శూద్రుని జూచి యిట్లనియె.
శూద్రా! నీవ్యవహారము గొప్పది రేపు విచారించెదము. అని వానిని
బంపించి పండితులను జూచి యిట్లనియె. పండితులారా! మీరందఱును
నామాటలు వినుండు. నేనిట్టివ్యవహార మిదివఱ కెన్నఁడును వినియెఱుఁ
గను. రేపుమాత్ర మీవ్యవహార మెట్లు నిర్ణయింపఁ బడఁగలదు?
ఇదిచాలఁ జిక్కుగ నున్నది గనుక మీరుగూడ యోజింపుఁడు. అను
రాజుగారిమాటలు విని సభాసదు లగుపండితులు కపటము మనసులో
నుంచుకొని యిట్లు బదులు చెప్పిరి. ప్రభూ! మీ యీవరరుచి యెవరో
యెఱుఁగము. వీనికి సంతతి యున్నట్లు తెలియదు. తల్లిదండ్రులసంగతి
మొదలే తెలియదు. ఇతఁడు నిజముగా శూద్రుఁడే యగునేని వెంటనే

15

బహిష్కరింప వలసి యుండును. మేముగూడఁ జాల దక్షిణ లిచ్చి ప్రాయశ్చిత్తము చేయించుకొనవలసి యుండును. ఇన్నాళ్లును దెలియకయితనిని గురువని భావించుచున్నాము. బ్రాహ్మణుఁడై పుట్టినవాఁ డెవఁడయినను శూద్రునకు నమస్కరించునా ? అని యిట్లుచెప్పిన పండితులమాటలు విని భోజుఁడు చింతాపరాయణుఁడై యప్పటికిఁ బండితులనిండ్లకుఁ బంపించెను. తరువాతను రాజు వరరుచినిజూచి యిట్లనియె. వరరుచీ! నీవు ను వేగముగా నింటికిఁబొమ్మన్న. రేపుదయము పండితులు వచ్చునప్పటికి సభకురమ్ము. అనిచెప్పి యతనినిగూడ నింటికిఁబంపించి వందిమాగధుల సుతులువినుచుఁ దన యంతిపురిలోఁ బ్రవేశించెను. తరువాతను వరరుచి చింతాక్రాంతచిత్తుఁడై యిదియంతయుఁ బండితులు చేసినకృత్రిమమని నిశ్చయించి యర్ధరాత్రసమయమున లేచి యపవాదనివారకముగ గంగాస్నానము చేయుటకు బయలుదేఱి తిన్నఁగాఁ గాశీపట్టణము చేరి మణికర్ణికాఘట్టమున యథావిధిగా స్నానము చేసి యఘమర్షణఋక్కులను జపించెను. తరువాతను నిత్యకృత్యములు తీర్చుకొని విశ్వనాథుని విశాలాక్షిని ఢుండివినాయకుని మిగిలిన దేవతలను సందర్శించి నమస్కరించి తీర్థోపవాసముచేసి విధిగా శ్రాద్ధముపెట్టి యచ్చటినుండి బయలుదేఱి గయవచ్చి గయలోఁ బితరులకుఁ బిండదానముచేసి ప్రయాగ చేరి త్రివేణిలో మునిఁగియచ్చటనుండి మరలఁ గాశివచ్చి యచ్చట నొకసంవత్సరమువఱకును విద్వత్సేవితుఁడై యుండెను. బుద్ధిమంతుఁడగు వరరుచి యొకప్పుడు మణికర్ణికకుఁబోయి స్నానముచేసి ఓహో భాగీరథీదేవి! సాగరస్వర్గదాయిని! జహ్నుపుత్రి! మహాదేవజటాజూటవిలాసిని! అంబ! నీదరిసెనమువలన నేమి ముక్తి కలుగునఁట! ఇఁక స్నానముచేసినచో నేమి ఫలముగలుగునో తెలియదు. అమ్మా! ఇట్టి వ్యాసులమాటయే నిజమయినచో మహాపవాదకుఁ బాలయియున్న నన్నుఁ బవిత్రునిఁజేయుము. అని యనేకవిధములుగా స్తుతిచేయఁగా గంగ ప్రసన్నమయి నవరత్నఖచితమయిన కంకణ మాపండితునికిచ్చి యిట్లన్నది. ఓయీ! వరరుచీ! నీకుఁ బాపమేలేదు. అది నిజమయిన యపవాదముగాదు. సభలోని పండితులు గల్పించినది. కనుక నీవు వెంటనే భోజునిసభకుఁ బొమ్ము. నే నీపుడిచ్చినకంకణము చూపించి యారాజుతోఁ "ఓ భోజభూపాలకా!



శూద్రుఁడే నాతమ్ముఁడయినచో నిట్టిది రెండవకంకణము వానిదగ్గఱ నుండవలయునుగదా! దానిని దెమ్మనుము. వాఁడు నిజముగాఁ దెచ్చినచో నాకుఁ దమ్ముఁడే" అనుము. అని వరరుచికి బోధించి భోజపురికిఁ బంపి గంగ తానంతర్ధాన మయినది. పిదప వరరుచి సభకువచ్చి గంగ చెప్పినచొప్పుననే చెప్పెను. అంత భోజరాజు శీఘ్రముగా సభకు వచ్చి శూద్రుని రప్పించి కఠినముగా నిట్లనియె. శూద్రుఁడా! నీవు నిజముగా వరరుచియనుజుఁడవే యయినచో నిటువంటిది హస్తకంకణమును వెంటనే మాకుఁ జూపింపుము. ఇది వరరుచిహస్తకంకణము. నీ వతనితమ్ముఁడవే యయినచో నీ దగ్గఱనుగూడ నిట్టిదియుండి తీఱవలయును గదా! అట్లు తెచ్చి చూపనేని వెంటనే నీకు శిరశ్ఛేదము చేయింతును. ఇట్లు భోజుఁ డనఁగానే వాఁడు భయపడి గడగడ వడఁకుచు నిట్లనియె. ఓ మహారాజా! నే నేకర్మమును నెఱుఁగను. నీసభలోనిపండితు లందఱును నేకీభవించి నాకుఁ జాల ధన మిచ్చి యి ట్లనుమని బోధించిరి. కావున నే నిట్లనిందిత మయినమాట లంటిని. ఇది యథార్థము. నే నజ్ఞానమువలనఁ జేసితిని. నన్ను మన్నింపుము. నేను శూద్రుఁడను. అజ్ఞానిని నన్ను రక్షింపుము. అని బ్రతిమాలి పాదములమీఁదఁ బడిన శూద్రుని కశాఘాతములచే నొప్పించి శాస్త్రములను బర్యాలోచించి మహాఘోరమగు కారాగృహములో నుంపించెను. తరువాతను రాజు భయముచే గడగడ వడఁకుచున్న పండితులను బ్రత్యేకముగాఁ బిలిచి యనేకవిధములుగా నిందించెను. పిదప సింహాసనమునుండి దిగి మహాప్రాజ్ఞుఁ డగు వరరుచిని కౌఁగిలించుకొనెను. పిదప పాదములపైఁ బడి నమస్కరించి యనేకవిధములుగా స్తుతిచేసి చేతులు జోడించికొని యిట్లనియె. వరరుచీ! నీవే శబ్దశాస్త్రమును బాగుగాఁ దెలిసిన మహాపండితుఁడవు. అపశబ్దములచే నిండినగ్రంథముల నన్నింటిని సుశబ్దములచే నలంకరించితివి. పరమమూఢు లగుబ్రాహ్మణులను మహాపండితులను జేసితివి. నీకంటె నధికుఁడు గాని నీతో సమానుఁడు గాని యగుపండితుఁడు లేఁడు. మహాత్ముఁడ వగు నీవలన వేదశాస్త్రములు నేర్చుకొంటిని. ఇటుపయిని నాకు వేదాంతశాస్త్రముగూడ నేర్పుము. అనియిట్లు భోజరాజు ప్రార్థింపఁగా రహస్య మగు వేదాంతశాస్త్ర మంతయు బోధపఱిచెను. సర్వోపనిషత్తులయర్థమును

రాజునకుఁ జెప్పెను. అప్పుడు వరరుచి యిట్లనియె. రాజా! జాగ్రత్స్వప్నసుషుప్తులయందు దేదివ్యజ్యోతి వెలుంగుచుండునో అదియే పరబ్రహ్మమని తెలిసికొనుము. బ్రహ్మమొదలు స్తంబమునఱకును నేతేజస్సు నిండి యున్నదో అదియే పరబ్రహ్మ మని తెలిసికొమ్ము. ఏది యణువుకంటె నణువుగాను, మహత్తుకంటె మహత్తునునయి యున్నదో అదియేపరబ్రహ్మ మని తెలిసికొమ్ము. ఏది సర్వజగత్తులకును సాక్షిభూతమయి ప్రకాశించుచుండునో అదియే పరబ్రహ్మ మని తెలిసికొమ్ము. తత్త్వమస్యాది మహావాక్యముల యర్థములచే యోగులు దేనిని బొందుదురో అదియే పరబ్రహ్మమని తెలిసికొమ్ము. సమస్తజగత్తుల సృష్టిస్థితి సంహారములకేదికారణమో అదియే పరబ్రహ్మమని తెలిసికొమ్ము. దేనివెలుఁగు ననుసరించి సూర్యుఁ డాకాశమున వెలుఁగుచుండునో అదియే పరబ్రహ్మమని తెలిసికో. ఎవనియాజ్ఞచే మహేంద్రాదులు తమతమపనులయందుఁ బ్రవర్తింతురో అదియేపరబ్రహ్మమని తెలిసికొనుము. బ్రహ్మ విష్ణుశివాదులకేదిధ్యానింపఁ దగినవస్తువో అదియే పరబ్రహ్మమని తెలిసికొనుము. అని యారీతిగా ననేకవిధములుగా మాటిమాటికిని, బోధపఱిచి యపుడు వరరుచి చిఱునగవుతో నిట్లనియె. రాజేంద్రా! ఈసభాసదు లందఱును నిస్సందేహముగాఁ గృతఘ్నులే. కాని వారిపైని గోపింపకుము. ఈబ్రాహ్మణులవిషయమై చేసినయుపకారము బూడిదలో వ్రేల్చినహవిస్సుచందమయినదని యెఱుంగుదును. బ్రాహ్మణులు పరస్పరము సహజశత్రువులు. కుక్కలు, సింహములు, గజములు నెట్లో యట్లే వీరును బోరాడుచుందురు. పూర్వము పితృవధచే గోపించిన ప్రతాపవంతుఁడగు పరశురాముఁడు తనపరశువుచే భూమి నిరువదియొక్కమాఱు నిఃక్షత్రియనుగాఁజేసి యారాజుల రక్తముచే పితరులకుఁ దర్పణముచేసి వారిమంచిమాటలచే మరల శాంతించెను. అపుడు భూమినంతను కాశ్యపునకు దారపోసెను. పిదప కాశ్యపుఁడు పరశురామునితో నిట్లనియె. ఓయీ రామా! నీవు రాజులనందఱను జంపితివి. నీవే నాకీభూమినంతయు దానమిచ్చితివి. అట్టి నాభూమిలో నీవు తపస్సుచేసికొనుచుంటివేని నీతపస్సులో సగముతపస్సు నా కీయవలసియుండును. అట్లు నీవు సమ్మతమ్మయినయెడల నాభూమిలో నుండుము. లేనిచో మఱియొకచోటికిఁ బోవలయును. గడియయైనను నాభూమిలో నుండవలదు. అని యిట్లు చెప్పిన



కాశ్యపుని యత్యద్భుతమైన వాక్యములను విని మహాతేజశ్శాలి యగు పరశురాముఁడు కోపించి "బ్రాహ్మణుల కెప్పటికిని భూమియం దాధిపత్యము లేకుండుఁగాక. ఏమన:; వీరు పరశ్రేయస్సహనము లేనివారు. వీరికెన్నటికిని నైకమత్యముండదు." అని శపించెను. ఇట్లు శపించి యతఁడు సముద్రుని యాచించెను. అపుడు సముద్రుఁ డిట్లనియె. రామా! నీకే మాత్రపుభూమి గావలయునో చెప్పుము. అని యనఁగఁగానే పరశురాముఁడు తనచేతనున్న గొడ్డలి విసరి యది యెంతదూరముపోవునో అంతవఱకుఁ జాలునని సముద్రుఁ డల్లియని తొలఁగిపోయెను. అదియే పరశురామునిచేఁ గల్పింపఁబడిన కేరళదేశము. అచ్చటను బ్రాహ్మణాదులు నాలుగుజాతులవారును గలరు. ఆదేశములోని స్త్రీలు స్వర్గములోని స్త్రీలను మించియుందురు. అచ్చటనే పద్మనాభస్వామి వేంచేసి యున్నాఁడు. అతఁడు శేషాంకశాయి భక్తకల్పద్రుమము. ఇప్పటికి నతఁడు బ్రహ్మాదులచేఁ బూజింపఁబడుచు నుండును. పూర్వము పరశురామునిచే శపింపఁబడిన బ్రాహ్మణుల కిటువయిని యముఁడే శాసకుఁడు. వారు ఘన్నపాపులు. కావున నోభోజరాజా! నేను నీకొక రహస్యమయినసంగతి చెప్పెదను వినుము. నేను బూర్వము శివభగవానులవారిచేఁ బ్రేరితుఁడనై భూలోకమునకు వచ్చితిని. నేనతనికిఁ గుమారుఁడను. నాపేరు దేవాంగుఁడు. ఇఁకఁ గైలాసమునకుఁ బోవ నుద్యుక్తుఁడనై యుంటిని. అనిచెప్పి రాజు నాశీర్వదించి రాజునకు దివ్యవస్త్రములు దివ్యయజ్ఞోపవీతములు నిచ్చి కైలాసము చేరుటకై శివుని స్మరించెను. తలంచినంతనే కోటిసూర్యప్రకాశమాన మగువిమానము వచ్చినది. ఆవిమానము వర్ణనాతీతమయి యున్నది. దానిని జూచి ధారాపురవాస్తవ్యులు రాజు పరమానందభరితు లయిరి. తరువాతను రాజు వరరుచిని విధియుక్తముగాఁ బూజించి వస్త్రములు మాల్యములు భూషణములు సమర్పించి చేతులు జోడించుకొని యెదుట నిలువఁబడెను. తరువాతను వరరుచి భక్తియుక్తులగు రాజదంపతులయొద్ద సెలవంది సంతోషించుచు నావిమానము నారోహించెను. అపుడు దేవతలు సంతోషించి పువ్వులవాన గురిపించిరి. గంధర్వులు పాడిరి. అప్సరస

లాడిరి. దేవదుందుభులు మ్రోఁగినవి. భూమియందుండు నాలుగు జాతులవారును, విమానస్థుఁడగువరరుచికి నమస్కరించిరి. వరరుచి తనదివ్యతేజస్సుచే దశదిశలను వెలిగించుచు సిద్ధాదులచే సేవింపఁబడుచు విమానముతోఁ గైలాసము చేరెను. తనకొడుకు మరలి వచ్చినందులకు సంతోషించి శివుఁడు శారమ్మని కౌఁగిలించుకొనెను. తరువాతను దేవాంగుఁడు పార్వతీపరమేశ్వరులకు నమస్కరించి భక్తిపూర్వకముగా నిట్లనియె. తండ్రీ! నీయాజ్ఞను నెఱవేర్చి వచ్చితిని. నీపుత్రుఁడ నగునన్ను రక్షింపుము. అనుదేవాంగుని దగ్గఱఁ గూర్చుండఁ బెట్టుకొని విష్ణురూపుఁడగు శివుఁడు పరమానందభరితుఁ డాయెను. ఈరీతిగా వరరుచి కైలాసము చేరినవెనుకఁ గవిశ్రేష్ఠుఁడగు కాళిదాసు భోజసభకు వచ్చెను. భోజరాజు తన్ని ననేకవిధములుగా గౌరవించెను. మునులారా! వరరుచియొక్క యవతారకథ యీరీతిగా జరిగినది. దీనిని జదివినవారు విన్నవారు ధనధాన్యములతోడను బుత్రపౌత్రాదులతోడను గూడి యిహలోకములో సమస్తసుఖములు ననుభవించి దేహాంతమందుఁ గైలాసము చేరి యింద్రాదిపూజితులై పునరావృత్తి లేకుండ నుందురు.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమున వరరుచి యవతార మన్నది యిరువదియాఱవ యధ్యాయము.

---

## ఇరువదియేడవ యధ్యాయము.

సూతు—తరువాత నామోదపురాధీశుఁడగు దివ్యాంగునికి నందియను కుమారుఁడును, అతనికి నీలకంఠుఁ డనువాఁడును బుట్టిరి. నీలకంఠునకు శంభుదేవుఁడు పుట్టెను. అతనికి హేమాంగుఁడు; అతనికిఁ జంద్రాంగుఁడు, వానికి భద్రబాహువు, అతనికి వీరభద్రుఁడు పుట్టెను. వీరభద్రునికి విందుఁడు పుట్టెను. మఱియు నావీరభద్రునకు శూలపాణి, యరిందముఁడు నని మఱియిద్దఱుకొడుకులు పుట్టిరి. ఆశూలపాణికి జయసేనుఁ డనువాఁడు పుట్టెను. అతనికిఁ జిత్రసేనుఁడు పుట్టెను. అతనికి సువిక్రముఁడు, వానికి గంగాధరుఁడు, పుట్టెను. ఆగంగాధరునకే విద్యావిలాసుఁడని యింకొక పేరుగలదు. అతనిభార్యపేరు విద్యావాణి. ఆమె పతిభక్తివశంవదురాలు. కాని యాదంపతులకు సంతతి లేకపో



యినది. వారు రహస్యముందుండి యిట్లనుకొనిరి. అయ్యో! బిడ్డలు లేనివారి కెంతధనమున్న నేమి? ఎంత సంపదయున్న నేమి? పుత్త్రిలు లేనివారికి గతులు లేవనికదా శ్రుతి చెప్పుచున్నది. అని వారనుకొనుచుండఁగా నశరీరవాణి యిట్లనియె. మీకుఁ దప్పక పుత్త్రిసంతతి గలుగును. అనుమాట విద్యావిలాసుఁడు విని చాలసంతోషించి యపుడు భార్యతో నిట్లనియె. విద్యావాణీ! భయపడకుము తప్పక మనకు సంతతి గలుగును. ఆకాశవాణిపలుకు చెప్పుడును దప్పనదిగాదు. అని భార్యనోదార్చి తాను దీర్ఘయాత్రకై బయలుదేఱెను. అతఁడు మహాపండితుఁడు. వలసినంతధనము లొట్టియలమీఁదఁ బడవేయించి దాసీదాసాదులతోఁ గూడి సర్వాభీష్టప్రదాయినియగు వారాణసిలోఁ బ్రవేశించెను. తరువాతను బురోహితసమేతముగా మణికర్ణికకుఁ బోయి యథావిధిగా నందు స్నానముచేసెను. మఱియు నాతీర్థమునం దుండు వారికి యథేష్టముగా వస్త్రములు దక్షిణలు మొదలగునవి యిచ్చెను. అక్కడినుండి బయలుదేఱి విశ్వనాథుని విశాలాక్షిని మిగిలిన దేవతలను భక్తిపూర్వకముగా సందర్శించి పూజించి నమస్కరించి యాభరణములు సమర్పించి యచ్చటినుండి బయలుదేఱి గయకు వచ్చి యక్షయవటమూలమునఁ బితరులకుఁ బిండదానము చేసెను. తరువాతను బదరికారణ్యమునకుఁ బోయి నారాయణుని సందర్శించెను. తరువాతను బదరీకేదారమునకుఁ బోయి, యాదేవుని బూజించి యచ్చటినుండి జ్వాలాముఖక్షేత్రమునకుఁ బోయి యందు జ్వాలామయుఁడగు దేవుని విధిగాఁ బూజించి శ్రీశైలమునకుఁ బోయెను. అందు భ్రమరాంబాసహితుఁడైన మల్లికార్జునుని యథావిధిగాఁ బూజించి యనేకవిధములుగా స్తుతి చేసి యక్కడనుండి వేంకటాద్రికిఁ బోయి యందు శ్రీనివాసుని శ్రీదేవితోఁగూడఁ బూజించి యచ్చటినుండి కాంచీక్షేత్రమునకుఁ బోయి యచ్చట నేకామ్రేశ్వరుని కామాక్షిని జూచి సంతోషించి పూజాదిక మాచరించి యటుపయి శ్రీదేవితోఁగూడ వరదరాజును సేవించి సర్వదేవనమస్కృతమగు చిదంబరక్షేత్రమునకు బయనమాయెను. అక్కడ నాకాశరూపుఁ డగు శివుని సందర్శించి పూజాదులు చేసి యందఱకును మోక్షమిచ్చు నరుణాద్రికిఁ బోయెను. అచ్చటి మహేశుని

బూజించి వైద్యనాథక్షేత్రము, మాయూరక్షేత్రము, కుంభకోణము, మొదలగు క్షేత్రములకుఁ బోయి ప్రధాన దైవతములఁ బూజించి తరువాత శ్రీరంగక్షేత్రమును బ్రవేశించెను. వేదశృంగము, ప్రణవాకారము నై యత్యద్భుతసంధాయక మగు విమానమును జూచి స్వామిని సేవించి పిదపఁ గావేరిని సేవించి తిన్నఁగా నక్కడ నుండి పాండ్యకవాటమునకుఁ బోయెను. అచ్చట మధుర రాజధాని. అది దివ్యమంటపశోభితము, దివ్యగోపురసంయుతము, సప్తప్రాకారవేష్టితము. అందు సుందరేశుని మీనాక్షీవల్లభుని శివుని కదంబవననాయకుని సేవించి విద్యావిలాసుఁ డనేకవిధములుగా స్తుతించెను. తరువాత నచ్చటినుండి రామేశ్వరమునకుఁ బోయెను. అచట ధనుష్కోటిలో స్నానము చేసి రామలింగస్వామిని సేవించి యచ్చటినుండి యనంతశయనక్షేత్రమునకుఁ బోయి శేషశాయి యగుపద్మనాభస్వామిని సేవించి యక్కడనుండి కల్యాణనిలయ మగుతనయామోదపట్టణములోఁ బ్రవేశించెను. ఇంటికి వచ్చి యావిద్యావిలాసుఁ డను బ్రాహ్మణుఁడు విశ్రాంతి నొందెను. ఆయనభార్య విద్యావాణి పతిరాకకుఁ జాల సంతోషించి మందహాససుందరవదనారవిందయై పతిపాదారవిందములకు వందన మాచరించినది. క్షేమపూర్వకముగ వచ్చితిరా? అని యడిగినది. ఏయేక్షేత్రములు, ఏయేతీర్థములు సేవించితిరి? సేవించినందుల కేమిఫలము ప్రాప్తించినది? అది యంతయు దయయుంచి చెప్పవలయు ననఁగా నతఁడు సంతోషముగా నామెతో నిట్లనియె. ఓ పతివ్రతాతిలకమా! మహాభాగురాలా! సావధానచిత్తురాల వయి వినుము. నేను జూచినవి సేవించినవి యన్నియుఁ జెప్పెదను. గంగాదిమహానదులలో స్నానము చేసితిని. కాశీ మొదలగు శివక్షేత్రము లన్నియు సేవించితిని. శ్రీరంగము మొదలగు విష్ణుక్షేత్రములు సేవించితిని. అని యారీతిగాఁ దన తీర్థయాత్రావృత్తాంతమంతయు వినిపించినపుడు విద్యావాణి సంతోషముచే మాటిమాటికిని బెనిమిటిని గౌఁగిలించుకొన్నది. తరువాత నామె భర్తతో నిట్లనియె. నాథా! కపిలేశుఁడను మహాదేవుఁడు భక్తులకు సంతానము నిచ్చునఁట! కనుక మీ రాతని బూజింపుఁడు. అని భార్య చెప్పఁగానే యాబ్రాహ్మణుఁడు కపిలేశ్వరుని బూజించెను. అతఁడు ఋతుస్నాత యగుభార్యను



కపిలేశ్వరుని మనస్సునఁ దలంచుకొనుచుఁ గవయుఁడు విద్యావాణి కపిలేశుని యనుగ్రహమువలన గర్భవతి యయి భర్త కమందానందమును గలిగించినది. పదినెలలు నిండినతరువాత నామె యొకకుమారుని గన్నది. విద్యావిలాసుఁడు కుమారుఁడు పుట్టెనని వినిసంతోషించుచు స్నానము చేసి జాతకర్మ మాచరించి బ్రాహ్మణులకు ధనాదు లిచ్చి సంతసపఱిచెను. తరువాతను బదునొంకడవదినమున బ్రాహ్మణులను బిలిచి పుత్త్రదారసమన్వితుఁడై పుణ్యాహవాచనము చేయించి కుమారునికి నామకరణమహోత్సవము చేయించెను. లేకలేకపుట్టిన బిడ్డనివిషయమై చేయునుత్సవముసంగతి యెట్లుండునో వర్ణింపనేల? వచ్చిన బ్రాహ్మణు లందఱకును ధనము రత్నములును, బంధువులకుఁ జీనీచీనాంబరములును, మంగళగాయనులకు దివ్యవస్త్రములు దివ్యాభరణములును తాంబూలఫలపుష్పాదులును నిచ్చి సంతోషపెట్టెను. ఆబిడ్డఁడు తండ్రియుంచిన దేవశాలియను నామముచే భూమిలోఁ బ్రసిద్ధికెక్కెను. ఇట్లు శుక్లపక్షపుచంద్రునివలె నానాటికి వృద్ధి నొందుచున్న కుమారునికి గర్భాష్టమమున వేదోక్తవిధి నుపనయనము చేసెను. అనంతరము శివదీక్ష చేసి విధిగా శివపంచాక్షరి యుపదేశించెను. ఆనాఁడు విద్యావిలాసుఁడు తనకుమారునియభివృద్ధికై యనేకములు దానములు చేసెను. గోదానములు, భూదానము, కన్యాదానము, గజదానము, అశ్వదానము, మొదలగు దానములు బ్రాహ్మణులకు బంధువులకుఁ జేసిసంతోషింపఁ జేసెను. ఇట్లుపనయనము పంచాక్షరోపదేశము కుమారునికిఁ జేసి విద్యావిలాసుఁడు కృతార్థుఁడనైతినని సంతోషించుచుండెను. తరువాతను దేవశాలి యనువాఁడు చిరకాలము గురుకులవాసము చేసి గురుకృపవలన సాంగము లగువేదముల నభ్యసించెను. మఱియు మీమాంస, న్యాయశాస్త్రము, ధర్మశాస్త్రములు, అష్టాదశపురాణములు, ఉపనిషత్తులు, మఱియు మిగిలిన యితర విద్యలు నేర్చుకొనెను. ఇట్లు గురువువలన విద్యలు నేర్చుకొని యాయనచే ననుజ్ఞాతుఁడై వైరాగ్యము నవలంబించి దేశసంచారము చేయుచుండెను. మహామతి యగు నాదేవశాలి లోకములమేలుకొఱకు శైవపురాణములు, ఆగమములు రచించెను. అతఁడు కందమూలఫలాహారుఁడయి కొండగుహలలో నుండి



65

యింద్రియములను స్వాధీనము చేసికొని యష్టాంగయోగము నభ్యసిం
చుచు సదా హృదయపద్మమునందు శివునినే ధ్యానించుచు నుండెను.
యోగమార్గము దెలిసిన ఋషులు మొదలగు వారిచే మాటిమాటికిని
బూజింపఁ బడుచుండెడివాఁడు. ఇట్లు నిర్వైరముగా నుండు నాదేవశాలి
కిలోకములో నిరుపమాన మయినకీర్తి గలిగినది. ఆదేవశాలి యొకప్పుడు
శూరమానియగు వీరవల్లభుఁ డేలుకల్యాణపట్టణమును గూర్చిపోయెను.
కృష్ణాజినమును ధరించి బంగారుజన్నిదము వైచుకొని దివ్యమయినకౌ
పీనము గట్టుకొని పాదములకుఁ బాదుకలు బాగుగా నమరించి హస్త
భూషణముగాఁ బుస్తకము చేతఁబట్టుకొని సర్వావయవములయందును
భస్మము వెలుంగుచుండఁగా రుద్రాక్షాభరణములు ధరించి చెవులకుఁ
గుండలము లలంకరించి వచ్చుచున్న యాదేవశాలిని జూచి యందఱును
భయభక్తులతోఁ గూడి దూరముగాఁ దొలఁగిపోవుచుండిరి. ఈయాకార
ముతోఁ గల్యాణపురము ప్రవేశించునప్పటి కచ్చట నెచ్చటఁ జూచినను-
జైనులే తప్ప నితరమతమువారు గానరారైరి. రాజుకూడ జైనమతస్థుఁ
డేయగుటచేఁ దానిట్లని యోజించెను. ఈభూలోకములో నున్నజైనమ
తము నెట్లు నశింపఁజేయఁ గలను? అని విచారించుచు మాటిమాటికి
శివకథారసము వెదఁజల్లుచు జైనుల కందఱకును శివతత్త్వము బోధించు
చుండెను. ఇట్లు దేవశాలి బోధింపఁగా జైనులుతమమతము విడిచి శివ
దీక్షాపరులైరి. అతనినే సద్గురునిగా భావించి యతనివలన శివపంచాక్ష
రీమంత్రము నుపదేశమును బొంది జపించుచు శివపూజాపరాయణుల
యిరి. ఈరీతిగా నతఁ డందఱుజైనులను శైవులనుగాఁ జేయుచుండఁగా ని
తఁడేశంకరుఁడు భూమిపై నవతరించినవాఁడు, అని జను లనుకొనుచుం
డిరి. ఒకప్పుడు రాజపుత్త్రుఁడు జగద్దేవుఁడు తపోనిష్ఠాగరిష్ఠులచే సేవింపఁబ
డుచున్నదేవశాలికి మ్రొక్కి సాదరముగా నిట్లనియె. స్వామీ! నీవేయీ
శ్వరుఁడవు. సర్వలోకములకును నీవేగురువవు. నాకును పంచాక్షరీమం
త్రము నుపదేశించి యనుగ్రహింపుము. అని రాజపుత్త్రుఁడు ప్రార్థిం
పఁగా, మహాజ్ఞాని యగుదేవశాలి యారాజకుమారునికి శివదీక్ష యిచ్చి
యతనికోరికప్రకారము శివపంచాక్షరీమంత్ర ముపదేశించెను. జగద్దేవుఁ
డామంత్రమునే సదా జపముచేయుచు శివధ్యానాసక్తుఁ డయిజితేంద్రి



యుఁడాయెను. అతఁడు జైనసంఘమును దూరీకరించి సదా శివభక్తులను
జేరఁదీసికొని సర్వకాలసర్వావస్థలయందును శివపూజాసమాసక్తుఁడై
కనుపచుండెను. మంత్రు లారాజకుమారునిసంగతి యంతయుఁ దెలిసి
కొని తండ్రితోఁ జెప్పిరి. ఏమని యనిన నోరాజా! నీకుమారుఁ డగుజ
గద్దేవుఁడు మిక్కిలి బుద్ధిమంతుఁడు మనమతమును విడిచి శైవమతములోఁ
బ్రవేశించెను. దేవశాలియనువానివలన నుపదేశమును బొంది శివపం
చాక్షరమంత్రమును జపముచేయుచు శివపూజాపరాయణుఁడై నిత్య
మును శివునినే ధ్యానించుచు శివభక్తులతోఁ గలిసి యుండువాఁడు. ప్ర
తిదినమును శివకథామృతమును ద్రావుచు నిట్లే ప్రవర్తించుచున్నాఁడు.
ఇట్లని మంత్రులు చెప్పినమాటలు విని దేవశాలిని దనపట్టణము
నుండి బయటికిఁ బంపించెను. తరువాతను మంత్రిసమేతుఁడై కొడు
కును సభకు రావించి రాజు దుఃఖశోకములచేఁ బీడితుఁడై యిట్ల
నియె. నాయనా! నీవెంతో ప్రాజ్ఞుఁడవని సంతోషించుచుంటిని.
మనజైనమతముకంటె నెక్కువమతము లేదు. తనమతమును విడిచి
యెవఁడయినను మతాంతరములోఁ బ్రవేశించునా? పిశాచములతోఁ
గూడి క్రీడించుట, శ్మశానభూమి యిల్లు, బ్రహ్మకపాలము భిక్షాపాత్రము,
గల రుద్రు నెవరయిన నుపాసింతురా? కనుక నాయనా! లోకోత్తర మ
యిన మన మతములోననే యుండుము. అని యీరీతిగాఁ గుమారుని
నియమించి వీరవల్లభ మహారాజు కుమారుని, జైనులగురువుతోఁ
గూడ స్వగృహమునకుఁ బంపెను. తరువాతను ప్రాజ్ఞుఁ డగుజైనగురువు
రాజకుమారునికి జైనశాస్త్రము లన్నియు బోధపఱిచెను. ఎంత బోధిం
చినను శైవమతమును విడువఁడాయెను. రాజుచే బహిష్కరింపఁబడిన
దేవశాలి తటాకములచే శోభించు నొక యరణ్యములోఁ బ్రవేశించెను.
దేవశాలి యాయడవిలోఁ బ్రవేశించి యచ్చటి తామరకొలనిలో స్నా
నముఁ జేసి చర్మవసనమును గట్టుకొని శుచియై దేహమునిండ విభూతి
పూసికొని రుద్రాక్షహారాదికమును ధరించి సంధ్యావందనము చేసి
కొని రాజయోగము నవలంబించి ధర్మార్థకామమోక్షముల నిచ్చు
పంచాక్షరీమంత్రమును జపము చేయుచు జ్యోతిస్స్వరూపుఁడగు శివుని
సదా హృదయకమలమునందు ధ్యానము చేయుచుఁ దరువాతను గ్రమ

ముగా ధైర్యశాలి యగు నతఁడు మనస్సును సహస్రారమునందు స్థాపిం
చి చిద్రూపుఁ డగుపరమేశ్వరుని వేదవాక్కులచే స్తుతించెను. ఇట్లు దేవ
శాలి చేయు తపస్సుచే, జరాచరాత్మక మగు జగమంతయు వేఁడి యె
క్కిపోయినది. అట్టి తనగురువును జూతమను బుద్ధి గలిగి జగద్దేవుఁ డను
రాజకుమారుఁ డుండఁగా నాసంగతి కనిపట్టి వానిస్నేహితులు వాని
వృత్తాంత మంతయు రాజుతోఁ జెప్పిరి. రాజు కొడుకుసంగతులు విని
భయపడి కొడుకును బిలిపించి కోపముతో నిట్లనియె. ఓరీ! దురాత్ముఁ
డా! దుర్బుద్ధీ! శైవమతమును విడువుము. అట్లు చేయనిచో నిన్ను
నీగురువునుగూడఁ జంపించెదను. అని యన్న తండ్రితోఁ గుమారుఁడు
శివభక్తివశంవదుఁడై యిట్లనియె. తండ్రీ! అనేకశాస్త్రములచే నిషే
ధింపఁబడిన జైనమతము మహానీచ మయినదని నాకుఁ దోఁచినది. కా
వున శ్రుతిస్మృతిసమ్మత మయిన యీ శైవమతము నవలంబించితిని.
మూఁడులోకములయందును శివునికన్న నెక్కుడు దైవము లేఁడు.
రాజా! నేను జెప్పినమాట యథార్థమని తెలిసికొనుము. శివుఁడే పర
బ్రహ్మము, శివుఁడే దిక్కు, శివుఁడే పరంజ్యోతి. ఈప్రపంచ మంతయు
శివుఁడే. కావున శివపంచాక్షరమంత్రము ముక్తిప్రదము శుభము నని
తెలిసికొని, యోగులు జపింతురు. శివుఁడే సదా పూజ్యుఁడు, మన మ
నఁగా నెంతటివారము. బ్రహ్మాదిదేవతలు మోక్షమును గోరు మునులు
నాయననే సదా ధ్యానించుచుందురు. కావున నో తండ్రీ! నీవును శివ
పూజాపరాయణుఁడవై శివపంచాక్షరీమంత్రమును జపము చేయుచుం
డుము. ఇట్లని కొడుకు చెప్పగానే రాజు కన్ను లెఱ్ఱఁజేసి సంకెళ్ళు వే
యించి కొడుకును జెఱసాలలోఁ బెట్టుఁడని యాజ్ఞాపించి నగరిలోనికిఁ
బోయెను. దూతలు రాజాజ్ఞను శిరసావహించి రాజపుత్త్రుని కారాగా
రములోఁ బ్రవేశింపఁజేసిరి. ఇట్లు చెఱసాలలో నుండి జగద్దేవుఁడు దుఃఖిం
చి తనగురు వగు దేవశాలిని ముక్తికై తలంచెను. మహాతపశ్శాలి
యగుదేవశాలి యతఁడు తలంచినంతనే శిష్యునిసంగతి యంతయుఁ
దెలిసికొని కన్నుల నిప్పులు రాల్చుచు దుర్మార్గుఁ డగురాజును జంపు
టకై శివమంత్రప్రభావమువలన నడవిలోని జంతువులను జతురంగబల
ముగా సృజించెను. సింహములను యోధులనుగాను, పెద్దపులులను



మహాబలవంతులనుగాను, ఏలుఁగుగొడ్లను మదపుటేనుఁగులనుగాను,
లేళ్ళను గుఱ్ఱములనుగాను, చక్రవాకపక్షులను వాయువేగమనోవేగ
ముగాఁ బోవురథములుగాను, కంటకవంతములగు వృక్షములను వాఁడి
యగునాయుధములనుగాను, రావిచెట్లు బాణములుగాను, బొంగువె
దుళ్ళు ధనుస్సులుగాను, జనపచెట్లను నారిగాను, లతాకుంజముల నమ్ము
లపొదులుగాను, నయినవి. బ్రహ్మవృక్షములు బ్రహ్మాస్త్రము లయి
నవి. ఇట్లు చతురంగబలము పూర్తి కాఁగానే దేవశాలి మిగుల సంతో
షించెను. పిదప సైనికు లందఱును వచ్చి వినయముగాఁ జేతులు జోడిం
చుకొని "ఈశ్వరా! మమ్మెందులకు సృజించితివి? మా వలనఁ గాఁదగి
నకార్యమేది? సెలవైనతోడనే యది యెట్టిదైనను జేసి తీర్చెదము." అని
యిట్లు చెప్పినసైన్యమును జూచి మేఘగంభీరవాక్కులతో దేవశాలి
యిట్లనియె. మహాబలవంతులగు సైనికులారా! మీరు కల్యాణనగర
మునకుఁ బోయి సైన్యముతోఁ గూడ వీరవల్లభభూపాలుని జంపివానికు
మారుఁ డగుజగద్దేవుని నాప్రియశిష్యుని జెఱసాలనుండి విడిపించివెంటనే
రండని యాజ్ఞాపింపఁగా దేవశాలియాజ్ఞను శిరసావహించి యాసైన్య
మంతయు బయలుదేఱినది. ఇట్లు బయలుదేఱి శత్రువులకు గర్భనిర్భేద
మగునట్లు సింహనాదములు చేయుచు యమదూతలవలె భయంకరులై
ధనుష్టంకారములు చేయుచు నానాభరణసంయుతులై కల్యాణపురమును
ముట్టడించిరి. గోపురములయందును ద్వారములయందును గాపున్నసై
నికులు దేవశాలియొక్క తపఃప్రభావముచే సృజింపఁబడిన సైన్యముచే
ముట్టడింపఁబడిన పట్టణముయొక్క యవస్థను జూచి భయంపడి యతివే
గముగాఁబోయి నమస్కరించి రాజుతో నిట్లనిరి. వీరవల్లభరాజేంద్రా!
మహాబలపర్రాక్రమశాలీ! మనపట్టణ మంతయు శత్రుసైన్యముచే ముట్ట
డింపఁబడియున్నది. మహావీరులకుఁ గూడ భయమును గలిగించుచు
న్నది. మఱియు నాసైన్యము నపూర్వమైనట్టి యాయుధములను ధరించి
బాణబాణాసనోజ్జ్వలమై యేనుఁగుల బృంహితములతోడను, గుఱ్ఱము
లసకిలింతలతోడను, భటుల సింహనాదములతోడను దిగ్గజములకుఁ
గూడ జెవుడు గలిగించుచున్నది. ఆసైన్యమంతయు నెక్కడనుండి వచ్చె
నదో యెవ్వరు పంపి యుందురో మాకొక్కింతయుఁ దెలియరాకుండ

నున్నది. ఇట్లు చెప్పిన దూతల మాటలు విని రాజు కోపపూర్ణుఁడై పండ్లు పటపట కొఱుకుచు మంత్రులతో నిట్లనియె. మంత్రులారా! వింటిరిగదా యిపుడు దూతలు వచ్చిచెప్పినమాటలు. ఇంతయాకస్మికముగా వచ్చినసైన్యమును జంపుటకై నాయాజ్ఞచే మనసైన్యమును బంపుఁడు. అని రాజు చెప్పఁగానే మంత్రులు త్వరతోఁ గూడినవారై తమచతురంగసైన్యమును సన్నద్ధముగాఁజేసిరి. అది శత్రుదుర్వారము, సర్వాయుధసమన్వితము, సముద్రముతో సమాన మయినది, యెప్పుడును జయమునే కాని పరాజయ మెట్టిదో యెఱుఁగనిది. తరువాత మంత్రులు సైన్య మంతయు సిద్ధ మయి యున్న దని రాజుతో విన్నవించిరి. పిదపఁ గల్యాణనగరనాయకుం డగువీరవల్లభుఁడు సర్వసైన్యముతోడను గూడినవాఁడై సర్వశస్త్రాస్త్రసంయుత మయినదియు మంచిగుఱ్ఱములు సారథియుఁ గలదియు నున్నతమయినజెండా గలదియు నగురథముపైఁ గవచము దొడిగికొని ధనుర్బాణములను ధరించి కూర్చుండి శత్రువులను జంపుటకై బయలుదేఱెను. అతనిసైనికులుసంతోషముతో శంఖముల నూదిరి. మహోత్సాహము గలుగునట్లురణభేరులు మ్రోఁగింపఁబడినవి. మఱికొందఱుసింహనాదములు చేసిరి. ధనుష్టంకారములు చేసిరి. ఇట్లు మహాకోపముగా వచ్చియున్నరాజును దత్సైన్యమును జూచి దేవశాలి పంపిన సైన్యమును యుద్ధోన్ముఖ మయినది. ఈ యుభయ సైన్యముల యుద్ధమును జూతమను కోరికచే దేవతలు సూర్యసమానముగా వెలుఁగుచున్న విమానములపైఁ గూర్చుండి యాకాశము నిండిరి. తపోధను లగుఋషులును నారదాదులును గంధర్వులును సిద్ధులును జారణులును మఱియు నింద్రుఁడు దిక్పతులును వైజయంత మను ప్రాసాదమెక్కి యుద్ధము చూచుచుండిరి. తరువాత యమపట్టణము నిండులాగున యుద్ధము ప్రవర్తించినది. రెండు సైన్యములవారును బరస్పరమును ముసలములు ముద్గరములు భిండివాలములు పరశ్వథములుశక్తులు గదలు శతఘ్నులు బాణములు మొదలగువానిచేఁ గొట్టుకొనుచుండిరి. రథికుఁడు రథికుని, గుఱ్ఱముపై నున్నవాఁడు గుఱ్ఱముపై నున్నవానిని, పదాతి పదాతిని, గజారూఢుఁడు గజారూఢుని నెదుర్కొనిరి. రెండు తెగలవారును స్వర్గమును గోరి యుద్ధము చేయుచుండిరి. సింహములవలె గర్జించుచుం



డిరి. మిక్కిలిగా వీరవాదములు పలుకుచుండిరి. నీ వెంతవాఁడవురా యన నీ వెంతటివాఁడవురా యనియు నే నెందఱినో జయించితి ననే నెందఱినో జయించితి ననియు నిన్ను జయించితిని జూడు మన నిన్ను నేనే జయించితిని జూడు మనియు నాతో సమానుఁడు లేఁ డన నాతో నంతకుముందే సమానుఁడు లేఁడనియు నాయెదుటినుండి పరాఙ్ముఖుఁడవై పాఱిపొమ్మన నాయెదుటినుండియే పరాఙ్ముఖుఁడవై పాఱిపొమ్మనియు ననుచు యుద్ధము చేయుచుండిరి. ఇట్లు రోమహర్షణముగాఁ బ్రవర్తించుచున్న మహాయుద్ధమును జూచి యింద్రాది బృందారకులు మిక్కిలి యాశ్చర్యమును బొంది సాధువాదములు చేయుచు గౌరవించిరి. యుద్ధభూమిలో మొండెములు లెక్కకు మిక్కిలిగా నాట్యము చేయుచున్నవి. రక్తము నదులై ప్రవహించుచున్నది. శివమంత్ర ప్రభావమువలన దేవశాలి సైన్యము పున్నమనాఁటిచంద్రుని జూచిన సముద్రమువలె వృద్ధి పొందినది. వీరవల్లభమహారాజుసైన్యము కృష్ణచతుర్దశినాఁటి చంద్రునివలె క్షీణించిపోయినది. ఇట్లు యుద్ధోన్మత్తులై యాయుధములను బ్రయోగించుచున్న దేవశాలిసైన్యముచేఁ గొట్టఁబడి వీరవల్లభుని సైనికులు కొందఱు మూర్ఛిల్లిరి. కొందఱు చచ్చిపడిపోయిరి. మఱి కొందఱు మూత్రపురీషములు విడుచుచుఁ బాఱిపోయిరి. అపుడు కొందఱు సైనికులు రాజునొద్దకు వచ్చి శరణు చొచ్చిరి. అట్లు శత్రువులచేఁ బీడితులయి తనయొద్దకు వచ్చియున్న సైన్యమును జూచి వీరవల్లభుఁడు రోషద్వేషములతోఁ గూడినవాఁడై ధనుర్ధరులలోఁ బేర్వడినవాఁడు గనుక యుద్ధభూమిలోనికి వచ్చి దేవశాలిసైన్యమును దహించుచున్నవాఁడో యనులాగునఁ జూచి వెంటనే ధను వెక్కువెట్టి వేనవేలు బాణములు వారిపై విడిచెను. అపుడు వీరవల్లభునిధనుస్సునుండి పడుబాణములకు లెక్కయే లేకపోయినది. అట్లు గొట్టఁబడి దేవశాలిసైన్యములోనివారు కొందఱు సింహములవలె గర్జించిరి. మఱికొందఱుచే విడువఁబడిన బాణములచే వీరవల్లభుఁడు మిక్కిలిని గొట్టఁబడి యపుడు కను లెఱ్ఱఁజేసి నిరుపమానమయిన యాగ్నేయాస్త్రమును బ్రయోగించెను. అపుడు దేవశాలిసేనాపతి శంకరుఁ డనువాఁడు వారుణాస్త్రమును బ్రయోగించి దానిని జల్లార్చెను. తరువాతను వీరవల్లభుఁడు వారు

ణాస్త్రమును బ్రయోగింప శంకరుఁడు వాయవ్యాస్త్రమును బ్రయోగించి దానిని వారించెను. పిదప వీరవల్లభుఁడు యామ్యాస్త్రమును బ్రయోగింప శంకరుఁడు రౌద్రాస్త్రమును బ్రయోగించి దాని మద మణఁచెను. వీరవల్లభుఁడు నారాయణాస్త్రమును బ్రయోగింపఁగా శంకరుఁడు మహేశాస్త్రమును బ్రయోగించి వారించెను. తరువాతను శంకరుఁడను వాఁడు చాలఁ గోపించి సర్వలోకభయంకర మయిన బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను. దానితో వీరవల్లభభూపాలుని శిరస్సు తెగి క్రిందను బడిపోయినది. వెంటనే దేవశాలిసైనికులు జయభేరి వాయించిరి. పూర్తిగా సంతోషించి శంఖము లూదిరి. మింట దేవదుందుభులు మ్రోఁగినవి. పుష్పవర్షము గురిసినది. గంధర్వులు పాడిరి. అచ్చర లాడిరి. అపుడు దేవశాలిసైనికులు, సేనాధిపతిని బురస్కరించుకొని నిరానందులగు జనులతో నిండిన కల్యాణపురములోఁ బ్రవేశించి మహామతియగు జగద్దేవుని జెఱసాలనుండి విడిపించిరి. పిదప నేనుఁగు నలంకరించి యతనిని దానిపైఁ గూర్చుండఁబెట్టి సంతోషముగా దేవశాలియొద్దకుఁ దెచ్చిరి. జగద్దేవుఁడు తనగురువగు దేవశాలినిజూచి యేనుఁగునుండిదిగి యాయనపాదములకు నమస్కరించెను. మఱియు శ్రుతి స్మృత్యాగమములయందుఁ జెప్పఁబడినరీతి ననేకవిధములుగా స్తుతించి పరమాత్ముఁడగు శివునిఫాలనేత్రమునుండి పుట్టిన యోదేవశాలీ! ప్రణతార్థప్రదాయక! విద్యావిలాసతనయా! సద్గురూ! నీభక్తుఁడ నగు నన్ను సంసారసముద్రమునుండి యుద్ధరింపుము. దురాచారభూయిష్ఠమై యశిష్టులగువారిచే సేవింపఁబడుచున్నదియు శ్రుతిస్మృతులకు విరుద్ధమును నగు జైనమతమును రూపుమాపుము. నేను నీవుపదేశించిన శివపంచాక్షరీమహామంత్రముచే సమస్తపాపములును బోయినవాఁడ నయితిని. నీనామమును స్మరించుటచేతనే పవిత్రుఁడ నయితిని. నీవే నన్ను చెఱసాలనుండి విడిపించి రక్షించితివి. అని యిట్లు పాదములపైఁబడి నమస్కరించుచున్న శిష్యుని బద్ధాంజలిని జగద్దేవుని గురువగు దేవశాలి లేవఁదీసి కూర్చుండఁబెట్టి చేతితో నిమురుచు నిట్లనియె. జగద్దేవా! మహాబుద్ధీ! మద్భక్తులలో మొదటివాఁడవు. నేను జెప్పుసంగతి సావధానముగా వినుము. మూఁడులోకములయందును శివునికంటెఁ బయిగా నుండు వస్తు వెదియును లేదు. కావున



నేనిపుడు జైనుల నందఱను నాకోపాగ్నిచే దహించెదను. అని చెప్పి శపించుటకు జలము చేతఁబట్టుకొనఁగానే శివభక్తాగ్రగణ్యుఁడును, భస్మోద్ధూళితసర్వాంగుఁడును, రుద్రాక్షమాలావిరాజమానుఁడును నగు నంది వచ్చి దేవశాలితో నిట్లనియె. మహామతి వగునో దేవశాలీ! జైనులను జంపుటకు శాపమీయకుము. వలదువలదు. ఇటుపైని జైనమతము శైవమతమే యగును. ఇట్లని శివభగవానులవారితాత్పర్య మయి యున్నది. నేనువచ్చి నీకు స్పష్టపఱిచితిని. శివునియాజ్ఞ నెవ్వరును దాఁటఁ దగదు. ఇట్లు కైలాసమునందుండి శివునియాజ్ఞాప్రకారము వేగముగా నీయొద్దకు వచ్చితిని. శివుఁడు చెప్పినదంతయు నెఱవేర్చుకొంటివి. ఇఁక పార్వతీపరమేశ్వరులను దర్శించుటకుఁ గైలాసమునకు రమ్ము. అని యిట్లు నంది చెప్పఁగానే దేవశాలి జగద్దేవుని కల్యాణపురమునకు రాజునగాఁజేసి యతని ననేకవిధములుగా నాశీర్వదించి వెంటనే దేవాంగుఁ యుపోయెను. అపుడు దేవదుందుభులు మ్రోఁగినవి. పుష్పవర్షము గురిసినది. గంధర్వులుపాడిరి. అచ్చరలాడిరి. అపుడు శివునిచేఁ బంపఁబడినదియు శివభక్తులచే నిండినదియు ఘంటామణి మహాధ్వనులు గలదియు నృత్యగీతవాద్యములచే నొప్పుచుండునదియుఁ గామగమనము గలదియుఁ గోటిసూర్య ప్రకాశమానమును నవరత్నఖచితమై దివ్యాశ్వములచేతను, దివ్యగజములచేతను బూన్పఁబడినదియు నగు విమానమును జూచి దేవాంగుఁడు తనశిష్యుఁడగు జగద్దేవునితోఁ జెప్పి నందితోఁగూడ నందధిరోహించెను. అట్లు దేవాంగుఁడు నందితోఁగూడ విమానమెక్కి నత్తోడనే యది యర్ధక్షణములోఁ గైలాసముచేరినది. శివాత్మజుఁడగు దేవాంగుఁడు విమానమునుండి దిగి పార్వతీపరమేశ్వరులకు నమస్కరించెను. అట్లు వచ్చియున్న కొడుకునెత్తుకొని ముద్దులాడి శివుఁడు తొడపయిఁ గూర్చుండఁబెట్టికొని యమందానందమును బొందెను.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమున
దేవశాలియవతారపరిపూర్తి యన్నది
యిరువదియేడవ యధ్యాయము.

---

## ఇరువదియెనిమిదవ యధ్యాయము.

సూతుఁడు—మునులారా! నారదుఁ డొకప్పుడు మహాదేవుని సేవించుటకై కైలాసమునకుఁ బోయి యాయన ననేకవిధములుగా స్తుతించి చేతులు జోడించుకొని యెదుట నిలువఁ బడి యుండఁగా శివుఁ డిట్లనియె. నారదా! భూలోకములో నాయాచారము బాగుగా జరుగుచున్నదా? యన నతఁ డాయన కిట్లనియె. దేవా! భూవలయమునందంతటను నేను దిరుగుచుంటిని గాని యెక్కడఁ జూచినను వైష్ణవులే మెండుగాఁ గనుపట్టుచుండిరి గాని ముచ్చటకైనను శైవుని జూడనైతిని. అని యిట్లు నారదుఁడు చెప్పఁగానే విని శివుఁడు దేవాంగుని జూచి యిట్లనియె. ఓయీ దేవాంగా! నీవు భూలోకములో శైవుఁడ వయి సర్వసంపదల నీయఁజాలిన నావ్రతమును వ్యాపింపఁజేయుము. అని యిట్లు శివుఁడు చెప్పఁగానే దేవాంగుఁడు చిత్త మట్లే చేయుదు నని భూలోకమునకు బయలుదేఱిన దేవాంగుని జూచి నవ్వుచుఁ బార్వతి యిట్లనియె. నాయనా! నేను బూర్వము చౌడేశ్వరి నయి నీశత్రుల నందఱను జంపి నీ కిష్టమయినవరము లిచ్చితిఁగదా! కావున నీకులమువారందఱును జౌడేశ్వరిని భక్తిశ్రద్ధాతాత్పర్యములతోఁ బూజించుచుందురుగాక. ఆమె సర్వదుఃఖనివారిణి. పూర్వము శ్రీరాముఁడు రావణుని వధించి రామేశ్వరక్షేత్రమునందుఁ బూజించిన రామలింగస్వామిని నీవు సదా పూజించుచుండుము. అతఁడు పూజింపఁబడి ధర్మార్థకామమోక్షముల నిచ్చును. మఱియు నాదేవుఁడు నీవంశపువారిచే సాదరముగాఁ బూజింపఁదగినవాఁడు. నీవంశస్థులు రామలింగస్వామిని చౌడేశ్వరిని బూజించుచుండుటవలన సమస్తమైన కోరికలను బొందుచుందురు. ఇట్లని చెప్పి యీశ్వరుని ఫాలనేత్రమునుండి పుట్టిన దేవాంగుని బయనము చేయించి పంపినది. తరువాతను భూమిపై నామోదపురాధీశ్వరుఁడైన గంగాధరుని కుమారుఁడు వీరరుద్రుఁ డను నతనికి దేవాంగుఁడు పుత్త్రుఁడై పుట్టెను. తరువాతను వీరరుద్రమహారాజు పదునొకండవదినమున వేదోక్తవిధానమున జాతకర్మాదికమును జేయుటకుఁ బ్రారంభించెను. అపుడు కుమారస్వామితోఁ గూడ గౌరీపతి వృద్ధబ్రాహ్మణరూపముతో రాఁగా నతనిని జూచి వీరరుద్రుఁ డానం



దించి యథావిధిగా షోడశోపచారములచేఁ బూజించి సువర్ణవికారమ
యిన పీఠపయిం గూర్చుండఁబెట్టెను. తరువాత నాభగవంతుఁడు సా
క్షాత్తుగా వీరరుద్రునికుమారునకు యథావిధిగా నాగమోక్తవిధాన
మున లింగదీక్ష చేసి యాబిడ్డనికి దేవదాసుఁ డని నామకరణము చేసె
ను. ఆ యుత్సవసందర్భమున దేవదుందుభులు మ్రోఁగినవి. పుష్పవర్ష
ము గురిసినది. గంధర్వులు పాడిరి. అచ్చరలాడిరి. తరువాతను కుమారస్వా
మితోఁ గూడ నాభగవానుఁ డందఱును జూచుచుండఁగానే యంతర్ధాన
మునొందెను. అపుడు "ఇచ్చటి బ్రాహ్మణుఁ డేడీ యేడీ" అని కోలా
హలము గలిగినది. అట్టిసమయమున నాకాశవాణి యందఱును విను
లాగున "ఓయీ వీరరుద్రభూపాలా! రామలింగస్వామి యగు శంక
రుఁడు స్వయముగా దయచేసి నీకుమారునకు లింగదీక్ష చేసి నామకర
ణము చేసి వెంటనే యంతర్ధాన మాయెను. కావున నీకుమారుఁడు రామ
లింగస్వామియందు భక్తిగలిగి చౌడేశ్వరీదేవిని బూజించుచుండువాఁడగు
ను. బుద్ధిశాలి యగు నీకుమారుఁడు భూలోకములో వీరశైవమతము ను
ద్ధరింపఁగలఁడు" అని వినవచ్చినది. అది విని యందఱును మిగుల నానం
దించిరి. తరువాతను కుమారుని యభివృద్ధికై వీరరుద్రుఁ డనేకములగు గొ
ప్పగొప్ప దానములును చిన్నచిన్న దానములును జేయించెను. ఆబాలుఁడు
బాలసూర్యునిపగిది వృద్ధి బొందుచుండెను. అంత నక్కడఁ గైలాసమున
శివుఁడు గద్దియపైఁ గూర్చుండి యాసమీపమున నున్న దేవాంగునిభా
ర్యను, దేవదత్తయనునామెను జూచి "దేవదత్తా! నీవు బంగాళాధీశ్వ
రుని భార్యయైన సులక్షణయందుఁ గుమారితవై పుట్టుము" అనఁగానే
యాయనయాజ్ఞను శిరసావహించి యాదేవదత్త, బంగాళరాజుభార్య
యొక్క గర్భమునఁ బ్రవేశించి పదియవనెలను సర్వలక్షణలక్షితు
రాలై పుట్టినది. బాలిక పుట్టఁగానే తండ్రియగు చంద్రశేఖరమహారాజు
బంధువులతోఁ గూడ నానందించెను. జాతకర్మాది క్రియలు నిర్వర్తించి
విశేషముగా బ్రాహ్మణులను గౌరవించెను. అపు డశరీరి యగుపురుషుఁ
డు "రాజా! నీకుమారితకు దేవదత్త యని పేరుంచి వీరరుద్రమహీ
పాలునికుమారుఁడగు దేవదాసున కిచ్చి పెండ్లి చేయుము" అని బంగా
ళరాజునకుఁ జెప్పెను. రాజు ఆమాట విని యట్లే చేయుదు మని

70

యించెను. అప్పటికి దేవదాసుఁడైదుసంవత్సరములవాఁడు. ఆబాలుఁ
డందఱను మిగుల నానందింపఁ జేయుచుండెను. తండ్రి సకాలమున ను
పనయనముచేసి గురువులవలన నెల్ల విద్యలను జెప్పించెను. సర్వవిద్యా
విశారదుఁడును బుద్ధిశాలియు నగు నీ కుమారుఁడు దేవదాసునకు నా
కూఁతును దేవదత్తయను కన్యకను నిస్సందేహముగా నే నీయఁదలఁ
చితి నని బంగాళరాజు శుభలేఖను బంపెను. తరువాతను వీరరుద్రభూ
పాలుఁడు సంతోషించి భార్యాపుత్త్రులతోడను జతురంగ బలముతోడను
బురోహితపురస్సరముగా బయలుదేఱి బంగాళ రాజునింటికి నేఁగెను. బం
గాళరాజు వచ్చిన పెండ్లివారిని జూచి చాలసంతోషించి యల్లుని వియ్యం
కుని గాఁగిలించుకొని తగు విడిది యేర్పాటుచేసి యందుఁ బెండ్లివారినుంచి
పట్టణ మంతయు నలంకరించుఁ డని సేవకుల కాజ్ఞాపించెను. సేవకులు,
పట్టణములోని వారును రాజాజ్ఞను శిరసావహించి పట్టణ మలంకరించిరి.
తరువాతను జంద్రశేఖరమహారాజు తౌర్యత్రిక సమేతముగా మాతాపి
తృ సమేతుఁడగు దేవదాసుని నెదుర్కొని తనయింటికిఁ దీసికొనిపోయె
ను. తరువాతను విద్వాంసుఁడగు పురోహితుఁడు కల్యాణమంటపమునఁ
బ్రవేశించి యచ్చటకు వధూవరులను రావించి యగ్నిని బ్రజ్వలింపఁజేసి
వేదమంత్రములచే వైవాహికవిధానమును నెఱపెను. అపుడు బంగాళ
రాజు తనకుమారితను బాగుగా నలంకరింపించి మంత్రోదకపురస్సర
ముగా దేవదాసునికి ధారవోసెను. అప్పటి మంగళవాద్యముల చప్పు
డు ముల్లోకములను వ్యాపించినది. దేవదుందుభులు మ్రోఁగినవి. పూ
లవాన గురిసినది. గంధర్వులు పాడిరి. అచ్చర లాడిరి. వందిమాగధులు
స్తుతించిరి. పురస్త్రీలు గౌరీకల్యాణము మొదలగు పాటలుపాడి నీరాజ
నము పట్టిరి. అపుడు బంగాళరాజు కూఁతునకు, అల్లునికిని బరిమితిలేని
వస్తువులను గానుకగా నిచ్చెను. మఱియుఁ దక్షిణవారిని యథాన్యా
యముగా సత్కరించెను. అపుడు వీరరుద్రమహారాజు చాల సంతోషిం
చి తన యామోదపట్టణమునకు వచ్చెను. దేవదాసుఁడు భార్యతోఁ
గూడి రతిదేవితోఁ గూడిన మన్మథునివలె సంతోషించుచుండెను. మఱి
యు నతఁడు శివపూజాపరాయణుఁడును శైవపురాణకథోత్సుకుఁడును
నై యుండెను. ఎప్పుడును శివునినే ధ్యానించుచు శివభక్తులకే యన్నాది



దానము లిచ్చుచు శైవగోష్ఠితో నుండెడివాఁడు. శివప్రియుఁడగు దేవ
దాసుఁడు పలువురికి లింగదీక్షను జేయించెను. నిరీశ్వరులుగా నుండు
వారిమతము నంగీకరింపఁడాయెను. శూద్రులకుఁ, గోమట్లకు, రాజులకు
ను శైవమతమును బోధించి వారినందఱను వీరశైవులనుగాఁ జేసెను.
అది మొద లందఱును శైవవ్రతము నవలంబించి శివునియందు భక్తిగలిగి
భస్మరుద్రాక్షధారులై ప్రకాశించుచుండిరి. ఇట్లు జరుగుచుండఁగా నా
దేవదాసునకు శివునియనుగ్రహమువలన నేకోరాముఁ డనుకుమారుఁడు
పుట్టెను. అతనికే విరూపాక్షుఁ డని యింకొకపేరు గూడఁ గలదు. దేవ
దత్తచే లాలితుఁడగుచు నాబాలుఁడు వృద్ధి నొందుచుండెను. దేవదా
సుఁడు ప్రతిదినమును శైవమతమును బ్రకటించుచు రామలింగేశ్వరుని
పూజయం దాసక్తచిత్తుఁడై యొప్పారుచుండెను. అట్లుండుటను సహిం
పక బౌద్ధులుకోపించి శైవమతమును ధ్వంసము చేయవలయునని యా
లోచించి దేవదాసునితప్పులు వెదకుచుండిరి. అతఁ డొకప్పుడు యథా
విధిగా రామలింగస్వామిని బూజించి యింటికి మరలుచుండఁగా బౌద్ధు
లందఱును నేకీభవించి యతనిని దారిలో నడ్డుకొని "శివుఁ డెవ్వఁడు?
ఎచ్చట నున్నవాఁడు? నీవు శైవమతమే గొప్పది యని లోకములోఁ
జాటుచున్నాఁడవు. ఎవనిమంత్రమును, దీక్షను, పూజను నీవు కొనియా
డుచుందువో అట్టిశివుఁ డెచ్చట నున్నాఁడు?" అని యనుచున్న బౌద్ధు
లమాటలు విని దేవదాసుఁ డిట్లనియె. శివుఁడు సర్వవ్యాపి, నిత్యుఁడు,
విభువు, ఆత్మస్వరూపుఁడు, పరాత్పరుఁడు నని యెఱుంగుఁడు. అను దే
వదాసునిమాటలు విని బౌద్ధు లిట్లనిరి. ఇపుడు నీవుచెప్పిన శివుఁ డట్టి
వాఁడే యయినచోఁ బిపీలికలోనుండి నీవు చెప్పినదాని నతఁడనవలెను.
అని యనుచు నచటినుండి పోవుచున్న యొకపిపీలికను దేవదాసునకుఁ
జూపిరి. దేవదాసుఁడు వారిమాటలు విని పిపీలికను జూచి భక్తశంకరుం
డగు శంకరుని "శివ! శంభూ! దయాసింధూ! నీవు సర్వవ్యాపకుఁడ
వనుమాట నిజమే యయినచో బౌద్ధు లన్నరీతిని పిపీలికయందుండి చె
ప్పుము" అని ప్రార్థించెను. ఇట్లు దేవదాసుఁడు ప్రార్థించిన వెంటనే శివుఁ
డు పిపీలికయందుండి యిట్లనియె. ఓజనులారా! నేను జెప్పునది వినుఁ
డు. మీరందఱును భక్తిగలవారై యుండుఁడు. నేనే సాక్షాత్తు శివుఁ

డను, సర్వత్ర నిండియున్నవాఁడను, పరాత్పరుఁడను, పరమాత్మను, జగత్కర్తను, సర్వస్వరూపుఁడను. ఇందు సందియమొందవలసిన పనిలేదు. ఇట్లు చెప్పిన భగవంతుని మాటలువిని బౌద్ధులు పరస్పరము మోములు చూచుకొని దేవదాసునితో నిట్లనిరి. మహాబుద్ధివగు దేవదాసా! మామాటలు వినుము. ఈపిపీలిక నీమంత్రప్రభావమువలన నిట్లున్నది. ఇట్లే రామలింగేశ్వరుఁడు చెప్పినచో మేమందఱమును శైవుల మయి నీకు శిష్యుల మగుదుము. అని బౌద్ధులనఁగానే దేవదాసుఁడు బౌద్ధులతోఁగూడి రామలింగస్వామి సన్నిధికిఁబోయి యిట్లనియె. రామలింగేశ! చిద్రూప! వేదవేదాంతసంస్తుత! నీవు సర్వాంతర్యామి వనుసంగతి పిపీలికయం దుండి యెట్లు చెప్పితివో అట్లే చెప్పుము. నీకు నమస్కారము అని దేవదాసుఁడు ప్రార్థించినతోడనే రామలింగస్వామి సింహమువలె గర్జించుచు మధురముగా నిట్లనియె. ఓరీ బౌద్ధులారా! మీరు నాయందు భక్తిగలిగి నామాటలు వినుఁడు. నేనే సాక్షాచ్ఛివుఁడను, సర్వవ్యాపిని, పరాత్పరుఁడను, మోక్షదాతను, జ్ఞానవిజ్ఞానవిగ్రహుఁడను, పరమాత్మను, జగత్తులకుఁ గర్తను హర్తను విధాతను సర్వరూపుఁడను నని యెఱుంగుఁడు. అని యిట్లు రామలింగస్వామి చెప్పినమాటలు విని బౌద్ధులందఱును దేవదాసునకు శిష్యు లయిరి. అప్పుడు దేవదాసుఁ డచ్చట నున్నయందఱు బౌద్ధులకును యథావిధిగా శివదీక్ష యిచ్చెను. తరువాతను దేవదాసుఁడు బంధుపోషణాసక్తుఁడయి యన్నదానమును చేయుచు నాపట్టణముననే యుండెను. ఇట్లుండఁగా నొకప్పుడు కోటిమంది బ్రాహ్మణులు షడ్రసోపేతముగా నన్నము పెట్టుమని దేవదాసు నడిగిరి. అపుడు దేవదాసుఁ డాయూరిలోని గంగాధరుఁడను కోమటియింటికిఁ బోయి సంగతియంతయుఁ జెప్పి కావలసినసంభారము లిమ్మని కోరెను. అపుడు కోమటి యతనిమాటలు విని కోపించి పెద్దగొంతుతో నిట్లనియె. ఓయీ! నీవు పండ్రెండేండ్లనుండి నాకొక్క కాసయిన నీయకుంటివి. కావున నిప్పుడు వచ్చినత్రోవనే చక్కఁగాఁ బొమ్ము. మాయింట నీకుఁ గావలసిన తండులాదికమగు సామగ్రి దొరకదు. ఇట్లని యాకోమటి చెప్పఁగానే పాప! మా దేవదాసుఁ డావృత్తాంతమంతయు భార్యతోఁ జెప్పఁగా నామె యిట్లన్నది. నాథా! మన యేకోత్రాముఁ డనుపుత్త్రుఁ డున్న



వాఁడుగదా! వానిచేయి శంఖచక్రపద్మాదిరేఖలతో నొప్పారుచున్నది. వాఁడు తనకరమును గోరికనెఱవేఱుటకై పుట్టలో నుంచినయెడల నిస్సందేహముగా శివభగవానుఁడు కంకణ మిచ్చితీరును. అని భార్య చెప్పఁగానే దేవదాసుఁడు కొడుకును బిలిచి సాదరముగా నిట్లనియె. నాయనా! విరూపాక్షా! నీవు పుట్టలోఁ జేయియుంచితివేని పరమేశ్వరుఁడు తప్పక కంకణ మిచ్చును. అని తండ్రి చెప్పఁగానే విరూపాక్షుఁడు త్వరగాఁ దన చేయి పుట్టలో నుంచెను. అపుడు సర్పములు కంకణములుగాఁగల శివుఁడు నిరుపమానమయి యమూల్యమయిన కంకణము నాతనిచేతి కిచ్చెను. ఆబాలుఁ డది పుచ్చుకొని తనతండ్రిచేతి కిచ్చెను. దానిని బట్టుకొనిపోయి దేవదాసుఁడు కోమటి కిచ్చెను. అతఁడు సంతోషించి దేవదాసునకుఁ గావలసినసామగ్రి యంతయు నిచ్చిపంపెను. దేవదత్త యాసామగ్రి వంటచేసి బ్రాహ్మణులందఱకును దృప్తిగా భోజనము పెట్టినది. వారందఱును సంతోషించి మునుపటికంటె నాలుగురెట్లు క్షేమముగా నుండుమని దీవించిపోయిరి. ఇట్లుండఁగా నాగంగాధరుఁడను కోమటి యాకంకణము నపహరింపవలయునని మనసులో నాలోచించుచుండఁగా నాకంకణము పాము వానియింట మహాధ్వని చేసినది. వాఁడది విని భయపడి దేవదాసునియింటికిఁ బోయి "అయ్యా! దేవదాసా! నీవు మాయింట నుంచినకంకణము పామై మాటిమాటికిని గర్జించుచున్నది. నీ వీయవలసినధనమునకును నీకును బదివేల నమస్కారములయ్యా! వెంటనే వచ్చి నీ కంకణమును నీవు దెచ్చుకొమ్ము. నీకు మాయందంత దయయున్నచో దొరకినప్పుడు మాధన మీయవచ్చును." అని యింటికిఁ బోయెను. దేవదాసుఁ డాతనిమాటలు విని వైశ్యునియింటికి వేగముగాఁ బోయి శైవకంకణమును దీసికొని తిన్నఁగాఁ దనయింటికి వచ్చెను. తరువాత నాదేవదాసుఁడు తన నేర్పును బ్రకటింపఁ దలంచి యమూల్యమును, చిత్రమును, నిరుపమానమును నగు నొక దివ్యాంబరమును నేసి దానిని దేశింగరాజున కమ్ముద మనియుంచెను. ఆవస్త్రము మూఁడువందల యిరువదిమూరల పొడవును, పండ్రెండు మూరల వెడల్పును గలిగి యుండెను. అది పరమేశ్వరునికే తగినది గనుక వర్తకులు దానికి వెల నిర్ణయింపఁ జాలరైరి. కాని యొకఁ

మహాత్మ్యము దానికి మూఁడులోకములును దగినవెల యనునభిప్రాయము మనసులో నుంచుకొని మూఁడువ్రేళ్ళు చూపెను. అపుడు విష్ణుచక్రము ప్రళయకాలాగ్నివలె మండుచు వచ్చి వెల చెప్పిన వర్తకునిమూఁడువ్రేళ్ళను ఛేదించినది. అపుడు తక్కిన వైశ్యులు దానికి వెల లేదనియుఁ బరమేశ్వరుఁడే యది ధరింపఁ దగినవాఁడనియు నిర్ణయించిరి. ఇట్లు చెప్పినవైశ్యుల మాటలు విని దేవదాసుఁ డావస్త్రమును శివున కర్పింత మని యనుకొనెను. అట్లు నిశ్చయించుకొని దానిని శ్రీశైలనాథుఁడగు భగవంతునికి ధ్వజపటముగా సమర్పించెను. అంత దేవుఁ డావస్త్రముచే సంతోషించి దేవదాసున కంతము లేనంత సంపద నిచ్చి సాదరముగా నిట్లనియె. దేవదాసా! నీవు నాభక్తుల కన్నము యథేచ్ఛముగా నిచ్చుచుండుము. లోకములోనియన్నిమతములకంటెను నుత్తమ మగుశైవమతమును స్థాపించి వీలయినంత వేగముగా నాలోకమునకు రమ్ము. అని చెప్పి భగవంతుఁ డంతర్ధాన మాయెను. తరువాతను దేవదాసుఁ డింటికి వచ్చి యావైశ్యున కియవలసిన ధనమంతయు లెక్కప్రకార మిచ్చివేసి శైవులకుఁ బ్రతిదిన మన్నప్రదానము చేయుచుండెను. మఱియు మహాయోగి యగునాతఁడు ఋణవిముక్తుఁడై శైవులకు వస్త్రములు యజ్ఞోపవీతములు దానము చేయుచుండెను. క్రమముగా లోకమంతటను శైవమతమును వ్యాపింపఁజేసెను. ఇట్లు శైవమతము విస్తార మగుట చూచి బౌద్ధగురువు తనశిష్యుఁడగు దేశింగరాజు నొద్దకుఁబోయెను. ఆరాజు తనగురు వింటికి వచ్చుట చూచి యథావిధిగాఁ బూజించి కుశల మడిగెను. బౌద్ధగురువు తనకుశలమును జెప్పి సాదరముగా రాజును కుశలాదిక మడిగెను. రాజు తనకుశలాదికమును గురువునకును విన్నవించి యాయనతో మధురముగా నిట్లనియె. గురువర్యా! నేను బౌద్ధుఁడను నాభార్య శైవమతస్థురాలు. కావునఁ దాము పోయి నాభార్యకు బౌద్ధాచారమును బోధించి బౌద్ధమతమం దాసక్తురాలినిగాఁ జేయుఁ డపు డాగురు వామె యొద్దకుఁబోయి యుత్తమమయిన బౌద్ధాచార మంతయు నాయింతికి బోధింపఁగా సంగమాంబ యనునారాజభార్య బౌద్ధాచార మంతయు విని నవ్వుచు వేళాకోళముగా నతనితో నిట్లనియె. ఏమీ? మాగురు వగుదేవదాసుఁడు రామ



లింగేశ్వరస్వామిసన్నిధిలో బౌద్ధులనందఱను జయించె ననియు నది మొదలు బౌద్ధు లందఱును శైవమతము నవలంబించి రనియు విని యుంటిని. ఈసంగతి యందఱు నెఱింగినదే మీచెవులఁ బడనే లేదా! మఱియు నో బౌద్ధగురూ! అపు డొకయాశ్చర్యము గూడఁ గలిగినదఁట! అది యే మనఁగా బౌద్ధు లందఱును వినుచుండఁగా రామలింగేశుఁడు "నేనే శివుఁడను. సర్వత్ర నిండియుండువాఁడను, పరమాత్మను, ముక్తి నిచ్చువాఁడను, జ్ఞానస్వరూపుఁడను" అని యనేకపర్యాయములు చెప్పఁగా నానందరూపుఁ డగు నా పరమేశ్వరుని యమృతవాక్యములను విని యున్నారఁట! అది నీ చెవులఁ బడలేదు కాఁబోలును! అని చెప్పిన రాజపత్ని మాటలు విని రాజునొద్దకు వచ్చి జరిగిన వృత్తాంతమంతయు వినిపించెను. తరువాతను రాజు గురువుతో నాలోచించి భార్యను రావించి యామెతో నిట్లనియె. సుందరీ! నీగురువును నాగురువును బరీక్షింతము. నీగురువు నాగురువును జయించినచో నాగురువు శైవుఁడగును. నాగురువే నీగురువును జయించినచో నీగురువు బౌద్ధుఁ డగుఁగాక. అని యిట్లు రాజు సర్వలోకసమ్మతముగాఁ బలికి విని యాతనిభార్య యట్లే యని యంగీకరించినది. తరువాత రాజు దేవదాసుని గౌరవముగా రప్పించి యాతనితో నిట్లనియె. విద్వన్! ఇతఁడు నాగురువు. నీవు శైవగురుఁడవు. అదిగాక నీవు నాభార్యకును గురుఁడవు. నాకీబౌద్ధగురువు గురుఁడు. సర్వజ్ఞత్వము విషయమున మిమ్ముల నిద్దఱను బరీక్షింతుము. ఆపరీక్షలో నీవే నాగురువును జయించితివేని యతఁడు వెంటనే శైవుఁడగుటకెంతమాత్రము నభ్యంతరము లేదు. ఒకవేళ మాగురువే నిన్ను జయించెనేని యదిమొదలు నీవు బౌద్ధమత మవలంబించి తీరవలయును. అని రాజు చెప్పఁగానే యిరువురును మంచిదేయని యంగీకరించిరి. తరువాతను రాజు కుండలో నొకపామునుంచి సభలోనికిఁ దెప్పించి యిట్లనియె. ఓయీ దేవదాసా! అయ్యా! బౌద్ధగురూ! మీయిరువురును బూజ్యులు సర్వజ్ఞులని తలంచుచున్నారు గదా! కావున నీఘటములో నేమియున్నదో చెప్పుఁడనఁగా బౌద్ధగురువు పామున్న దనెను. అపుడు దేవదాసుఁడు బౌద్ధగురునివాక్యమును ఖండించి సర్వవ్యాపియు మోక్షదాతయు నగు శివుఁడు నాగాభరణధారియై యిందున్నాఁ డనెను. అనఁగానే రాజు

మూర్తి దీయించి చూచునప్పటికి దేవదాసుఁడు చెప్పినచొప్పుననే నాగాభరణభూషణుఁడై శివుఁడు ప్రత్యక్షమాయెను. తరువాతను రాజు శిష్యులతోఁగూడ గతగర్వుఁడై మోము వంచుకొనియున్న బౌద్ధగురునితో నిట్లనియె: బౌద్ధగురూ! నీవు దేవదాసుచే జయింపఁబడితివి కావున వెంటనే శివదీక్షను లింగదీక్షను బొందుమనెను. అని రాజు చెప్పఁగానే బౌద్ధగురువు భక్తిపూర్వకముగా దేవదాసునకు నమస్కరించి యిట్లు యాచించెను. దేవదాసా! సర్వజ్ఞా! సర్వలోకపూజితా! ఇపుడు నాకు నాశిష్యులకును, ఈమహారాజునకుఁ గూడ ముక్తికాంత నీయఁదగిన శివదీక్షను లింగదీక్షను రుద్రాగమోక్తవిధిగా నిమ్ము. అని బౌద్ధగురువు ప్రార్థించినతోడనే శివప్రియుఁడగు దేవదాసుఁ డందఱకును నట్లొయిచ్చి యందఱకును శివపంచాక్షరీమంత్రము నుపదేశించి శివపూజావిధానమును బోధించి తరువాతను సద్యోజాతుఁడును మహాదేవుఁడును నగు కుండలోని శివుని దన యామోదపట్టణమునకుఁ దీసికొనివచ్చి యథావిధిగా స్థాపించెను. ఆయనను భక్తిశ్రద్ధాతాత్పర్యములతో వేదోక్తములగు మంత్రములచేఁ బూజించుచుండెను. తరువాతను శిష్యవర్గసమన్వితుఁడై దేవదాసుఁడు కల్యాణనగరములోఁ బ్రవేశించి తపశ్శాలియగు జగద్దేవమహారాజును జూచెను. ఇంటికి దయచేసిన తనగురువును జగద్దేవుఁడుచూచి యథావిధిగాఁ బూజించి యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టెను. పిదప మహామతియగు దేవదాసుఁడు జగద్దేవునిపౌరులందఱకును విధిగా శివదీక్షను లింగదీక్షనుజేసి ధర్మార్థ కామమోక్షముల నీయఁజాలిన శైవపంచాక్షరమంత్రమునుగూడ నుపదేశించి శివపూజావిధానమును బోధించి యచ్చటినుండి తన యామోదపట్టణమునకు వచ్చి బంధుబృందసమన్వితుఁడై తన కుమారుఁడగు నేకోరామున కుపనయనము చేసెను. ఆయుత్సవసందర్భమున శైవులందఱకును విశేషముగా నన్నప్రదానము చేసి వస్త్రాదులచే సంతోషమును గలిగించెను. అనంతరము దేవదాసుఁడు తన కుమారుఁడగు నేకోరామునకు వివాహము గూడఁ జేసెను. అపుడు శివుఁడు కైలాసమునుండి దేవదాసునియింటికి వచ్చెను. దేవదాసుఁడు భార్యతోఁగూడ యథావిధిగాఁ బూజింపఁగా శివుఁడు సంతోషించి మధురముగా నిట్లనియె: దేవదాసా! నీవు లోకమం



తయు నామృతముతో నిండునట్లు చేసితివి. నాయనా! ఇటుపయిని పుట్టఁబోవువారికి గురువునుగా నీకుమారుఁడగు నేకోరాముని నభిషేకించుము. ఏకోరామునకు రుద్రుఁడనువాఁడు పుట్టును. అతనికిఁ గాలసేనుఁడనువాఁడు పుట్టఁగలఁడు. రుద్రునకును కాలసేనునకును బ్రహ్మనిర్మిత లగు కన్యలు భార్యలుగాఁగలరు. అని చెప్పి శివుఁ డంతర్ధానమాయెను. తరువాతను దేవదాసుఁడు సర్వగుణసంపన్నుఁడగు కుమారుని శైవగురుస్థానమున నభిషిక్తునింగాఁ జేసెను. ఈరీతిగా నీశ్వరుఁడు చెప్పినదంతయు ముగించి భార్యతోఁగూడ సదా హృదయమందు శివుని ధ్యానించుచుఁ బూజించుచుఁ గీర్తించుచు శివసాయుజ్యమును బొందెను. ఈ దేవదాసునిమాహాత్మ్యమును జదువువారికిని వినువారికిని లక్ష్మి దాసురాలై యుండును.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమున,
దేవదాసునియవతారకథాపరిపూర్తి యన్నది
యిరువదియెనిమిదవ యధ్యాయము.

---

## ఇరువదితొమ్మిదవ యధ్యాయము.

సూతు—తరువాత నో మునిపుంగవులారా! ఆమోదపట్టణాధీశుఁడును దేవదాసునికుమారుఁడును నగు విరూపాక్షున కుగ్రవిక్రముఁడగు రుద్రుఁడు పుట్టెను. మహాబాహుఁడగు విరూపాక్షుఁడు తన కుమారుఁడగు రుద్రుని సాదరముగా గురుపీఠమునం దభిషిక్తునిజేసి యతఁడు స్వర్గమునకుఁ బోయెను. పిమ్మట రుద్రుఁడు శిష్యమండలమును బాలించుచుఁ జిత్రవిచిత్రములగు వస్త్రములునేసి యందఱకు నిచ్చుచుండెను. అతఁడు శివాజ్ఞానుసారముగా బ్రహ్మనిర్మితయగుకన్యకను విధియుక్తముగాఁ బెండ్లియాడెను. రుద్రుఁ డామెయందు సర్వలక్షణసంపన్నుఁడగు కుమారుని గని యతనికిఁ గాలసేనుఁడని నామకరణముచేసెను. త్రిలింగదేశాధీశ్వరుఁడును శైవవ్రతపరాయణుఁడును నగు సోమనాథుని కూఁతురగు దుర్గళ యనుకన్యను దనకుమారుఁడగు కాలసేనునకు రుద్రుఁడు పెండ్లిచేసెను. పిమ్మటఁ గాలసేనుఁ డామోదపురమును బాలించుచు వస్త్రములునేసి యందఱకు నిచ్చుచుండెను. అతనికిఁ బుత్త్రోద్భావము

74

వలన నానాటికిఁ జింత యెక్కువయయినది. అతఁడు బ్రహ్మనిర్మితలగు నేనూటియిరువదికన్యకలను బెండ్లియాడెను గాని యొక్కతెయందును సంతతిలాభము గలుగకపోయినది. అనపత్యదుఃఖమును సహింపఁజాలక యాకాలసేనుఁడు ప్రయత్నపూర్వకముగా శివుని బూజింపమొదలిడెను. ఆతనిదృఢభక్తికి శివుఁడు సంతోషించి యతనికిఁ బదివేలమందిపుత్త్రులు గలుగునట్లు వరమిచ్చెను. తరువాతను శివప్రసాదమువలన నతనికిఁ బదివేలమంది పుత్త్రులుగలిగిరి. అపుడాతఁడు చాల సంతోషించుచుండెను. ఆ పుట్టినవారిలోఁ గొందఱపేళ్ళు చెప్పెదవినుఁడు. మొదటివాఁడు రూపసేనుఁడు, రెండవవాఁడు భద్రసేనుఁడు, మూఁడవవాఁడు చిత్రసేనుఁడు. అట్లే సత్యసేనుఁడు, సుషేణుఁడు, యజ్ఞసేనుఁడు, సేనాబిందు, యజ్ఞబిందువు, తృణబిందువు, జటాధరుఁడు, జయవంతుఁడు, జయశీలుఁడు, జయబిందువు, జితేంద్రియుఁడు, సత్యవ్రతుఁడు, సత్యవాది, సుందరాంగుఁడు, త్రిలోచనుఁడు, సాంబుఁడు, సారస్వతుఁడు, చైత్రుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వభానుఁడు, సంవిదానుఁడు, సంప్రహారుఁడు, సమగ్రుఁడు, సత్యభామఁడు, సరసుఁడు, సాహసి, సహస్వంతుఁడు, సుముఖుఁడు, సురానందుఁడు, సులభుఁడు, సుందరుఁడు, సుందరీప్రియుఁడు, శతానందుఁడు, శంభుదేవుఁడు, శంకరుఁడు, శివదర్శనుఁడు మొదలగువారు పదివేలమంది కాలసేనుని కుమాళ్ళు. తరువాతను కాలసేనుఁడు తనకుమాళ్ళందఱకును ఋషిపుంగవులచే నుపనయనములు చేయించి వేదాదివిద్యల నధ్యాపన చేయించెను. మఱియు వారి యందఱకును సకాలమున బ్రహ్మనిర్మిత లగు కన్యలనుదెచ్చి పెండ్లి చేసెను. కాలసేనుఁ డెవ్వరిచేఁ గొమకుల కుపనయనసంస్కారము చేయించెనో ఆమన్వాదులు వారికిఁ గూటస్థు లయిరి. వారు మన్వాదులగు ఋషుల గోత్రములయొక్క భేదమునుబట్టి యొకరిబిడ్డల కొకరు తమ బిడ్డలను వివాహాదుల కీయ నర్హత గలవారైరి. కాలసేనుఁడు తన పెద్దకొడుకగు రూపసేనుని గురుపీఠమున నుంచెను. అతఁడు గురుపీఠమును బాలించుచుఁ దమ్ములు దానును వస్త్రములు నేసి యందఱకు నిచ్చుచుండెను. ఇట్లు చిరకాలము పుత్త్రులతోఁ గూడి కాలసేనుఁ డామోదపురమును బాలించుచు నందఱకును వస్త్రము లిప్పించుచు సుఖముగా నుండెను. ఇట్లుండఁగాఁ



బరితాణమను పట్టణమందు శాలివాహనుని కుమారుఁడు శక్తి యనువాఁడు మహాబలవంతుఁడు ప్రజలను పాలించుచుండెను. ఆపట్టణమందు సోమశర్మ యనుబ్రాహ్మణుఁడు వేదపారగుఁడు గలఁడు. అతఁడు సంతతి లేక కులసిద్ధవటమునుగూర్చి పోయి యచ్చటివారిచేఁ బూజింపఁబడుచుఁ జంద్రమౌళీశ్వరుఁ డను పేరుతో నందఱకును వరముల నిచ్చుచు శివుఁ డుండుటను విని యచ్చటనే భిక్షాశనుఁడై సంతతికొఱకా దేవుని నిత్యమును సేవించుచునుండెను. మఱియు నతఁ డెప్పుడును జంద్రమౌళీశ్వరునియాలయములో నుండి యా శివుని బూజించుచు రాత్రి యందే నిదురించుచుండెను. ఇట్లుండఁగా ధనపాలుఁ డనువైశ్యుఁ డొకఁడు సంతతికై సిద్ధవటమునకువచ్చి యనేకరత్నములచేఁ జంద్రమౌళీశ్వరుని బూజించెను. రత్నాలపూజకు శివుఁడు సంతోషించి వైశ్యరత్నమా ! నీకుఁ గుమారు నిచ్చితి ననియెను. ఆమాట విని యావైశ్యుఁ డెంతయు సంతసించి యాశివాలయములోననే పాడుచు నాట్య మారంభించెను. ఆచప్పుడు విని నిద్రలో నున్న సోమశర్మ మేలుకొని యానందపరవశుఁడై నృత్యము చేయుచున్న కోమటిని జూచి మధురముగా నిట్లనియె. అయ్యా ! నీ కేమి యిట్లు నాట్యము చేయుచున్నావు ? నీ సంతోషమునకుఁ గారణ మేమి ? నాతోఁ జెప్పుము. అని యాబ్రాహ్మణుఁ డడుగఁగా వైశ్యుఁ డిట్లనియె. అయ్యా ! నేను సంతతికై యీ చంద్రమౌళీశ్వరుని రత్నములచేఁ బూజించితిని. ఆయన సంతోషించి నాకుఁ బుత్త్రి నొసంగెను. అందుచే సంతోషించి నాట్యము చేయుచుంటి ననెను. ఇట్లా బ్రాహ్మణునితోఁ జెప్పి యా వైశ్యుఁడు శివునకు నమస్కరించి యచ్చటినుండి బయలుదేఱి పోయెను. సోమశర్మ వైశ్యునికి శివుఁ డిచ్చిన వరదానముసంగతి విని స్పర్ధ పూని దుఃఖించి శివునిగూర్చి మొఱ్ఱపెట్టెను. ఆహా ! చంద్రమౌళీశా ! నీవే యింత పక్షపాతము చేయుచున్నావుగదా ! నేను జిరకాలమునుండి నిన్ను భక్తిశ్రద్ధాతాత్పర్యములతోఁ బూజించుచుండఁగా నాకు సంతతి నీయక వైశ్యుని కొక్కనాఁడే సంతోషించి పుత్త్రుఁడు కలుగునట్లు వరమిచ్చితివిగా ! ఇట్లు చేయుట నీకుఁ దగునా ? నీ వింత నిర్దయుఁడవును గృతఘ్నుఁడవును వని నే ననుకోలేదు. ఇపుడు నీపక్షపాతము దెలిసినది. నే నింతగాఁ బూవు

75

లవే. బూజించుచున్నను నీకు సంతోషము గలుగక పోయినది. వైశ్యుఁడు చేసిన రాళ్ళపూజకు వెంటనే సంతోషము గలిగినది. సరే దీనిని బట్టిచూడఁగా నీకు రాళ్ళపూజ యిష్ట మని తెలిసినది. నీకొఱకుఁ బూవులు నిత్యమును గోయుచుండుటచే నాచేతులు కాయలు కాచినవి. నీపూజకు పత్త్రిమోసికొని వచ్చుచుండుటచే నాశిరస్సు బట్టతల యయి పోయినది. నే నింతకష్టపడుచున్నను సంతోషింపక వైశ్యుఁడుచేసిన రాళ్ళపూజకు సంతోషించితివి. అట్లేని నేనును నీకు రాళ్ళతోనే నీసంతోషమునకై పూజచేసెదను. చిన్నచిన్న రాళ్ళచేఁ జేసిన పూజకే నీకు సంతోషము గలిగినదిగనుక నేను నీకుఁ బెద్ద పెద్ద రాళ్ళతోఁ బూజ చేసెదను జూడు మని యొకగొప్పబండరాయి తెచ్చి దుర్మతి యగు నాసోమశర్మ "మతిసంతోషింపుము" అని యా శివునినెత్తిమీఁదను బడవైచెను. ఆరాయి పడినతోడనే లింగము బ్రద్దలై పోయినది. అపుడు దేవుఁడు కోపించి యగపడకుండనే యా బ్రాహ్మణుని గూర్చి యిట్లనియెను. ఓరీ! దుర్బుద్ధీ! నీసాహసము వలన నీకే హాని గలిగినదిరా! నీవిట్టి చపలాత్ముఁడవై చేసినపనికి నేను సంతోషింతు ననుకొంటివిగా! నీకోపము నిన్నే భక్షింపఁ గలదు. నిస్సంశయము. అయినను నీవు మొదట నాకుఁ జేసినపూజకు సంతోషించితిని గావున నీకుఁ బుత్త్రి నిచ్చెదను. అతఁడు గొప్పవాఁడు గాఁగలఁడు. నీవు పడవైచినరాయితో నాశిరస్సు బ్రద్దలయినయట్లే నీకు గొడుకుపుట్టఁగానే శిరస్సు బ్రద్దలై పోవును. ఇట్టి మహాపాతక మాచరించితివి గనుక నీకుఁ బుట్టఁబోవు కొడుకు హీనవర్ణుఁడు గాఁగలఁడు. ఇట్లని యాచంద్రమహాళీశ్వరుఁ డూరకుండెను. సోమశర్మ తరువాతను జింతానందములతోఁ గూడినవాఁడై పరితాణపట్టణమునకు వచ్చి జరిగినవృత్తాంతమంతయు భార్యతోఁ జెప్పెను. శీలసంపన్నురా లగుసోమశర్మభార్యసుశీల యనునామె గర్భవతి యయి పదియవనెలను గుమారుని గన్నది. అతఁడు పుట్టఁగానే సోమశర్మశిరస్సు బ్రద్దలయినది. శివునిశాపమమోఘముగదా! పతివ్రతయగు నతనిభార్యయు మృతి నొందినది. తల్లిదండ్రులు లేనియాబాలుని మేనమామ యగుయజ్ఞశర్మ తనయింటికిఁ గొనిపోయి భార్య కప్పగించి పోషించుచుండెను. అతనికి ద్రుమ



ఘుఁడని నామకరణము చేసిరి. అతఁ డుపనీతుఁడై విద్య లభ్యసించుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు ద్రుమఘుఁడు మేనమామయాజ్ఞను శిరసావహించి సమిధలు దెచ్చుటకై యొక్కఁడే యడవికిఁ బోయెను. అతఁ డచ్చటఁ గుక్కతోఁ గ్రీడించుచున్న సింహమును జూచి యాశ్చర్యపడెను. ఆయాఁడుకుక్క గ్రామములో నుండునది గనుకఁ దిన్నఁగా బరితాణపురము ప్రవేశించి శక్తియను రాజుమందిరములోనికిఁ బోయినది. ద్రుమఘుఁడును దానివెంటనే వచ్చెను. కుక్క రాజమందిరములోనికిఁ బోవుట చూచి యతఁడు తనయింటికిఁ బోయెను. ఆకుక్కకు సింహవర్ణముగల రెండుపిల్లలు పుట్టినవి. ఆరెండును వీథులలో నెంగిళ్లు తినుచుఁ బెరుఁగుచుండెను. ఇట్లుండఁగా శక్తిరాజుకొడుకు తనయుద్యానవనములోఁ బ్రవేశించి యనేకకృత్యములను గుఱికొట్టుచుండెను. అంత నారాజకుమారుఁడు తాటిచెట్టును గుఱి చేసి దానితలను గ్రిందఁ బడునట్లు గొట్టెను. అతనియద్భుతకర్మమునకుఁ బౌరు లందఱును సాధువాదములు పలికిరి. అపుడు ద్రుమఘుఁ డారాజునకుఁ గల్గినగొప్పను జూచి సహింపనివానివలె రాజుతో నిట్లనియె. రాజా! నీవీచెట్టుమొదలొక్కబాణముచే నఱికితివేని గొనియాడఁదగినవాఁడవే కాని తలనఱికినంత మాత్రమున మెచ్చఁదగవు. అనియిట్లు ద్రుమఘుఁ డనుబ్రాహ్మణుఁడు చెప్పినమాటలు విని కోపించి ధనుర్బాణములు చేఁబూని యిట్లనియె. ఓయీ! ఊరకమాటలు చెప్పి పోవనెంచినచో నిన్ను దుగ్గెనను గదల నీయను. ఇదిగో ధనుర్బాణములు. నీవంత నేర్పరివి బలముగలవాఁడవును నగుదువేని యీతాటిచెట్టుమొదలు నఱుకుము చూత మనెను. ఇట్లు శక్తి చెప్పఁగానే ద్రుమఘుఁడు ధనుర్బాణములు గైకొని యందఱును జూచుచుండఁగానే పెక్కుతాటిచెట్లమొదళ్లు తెగి క్రిందఁ బడువడువున నొక్కబాణమును బ్రయోగించెను. తరువాత నాశక్తిమహారాజు యద్భుతకర్మమును జూచి చాలసంతోషించి యిష్టమునయినది కోరు మనెను. రాజునకుఁ దనయెడఁ గలిగిన దయకు సంతోషించి యారెండుకుక్కపిల్లలను దన కిమ్మని యాచించెను. రాజు చాల సంతసించి సింహమునకుఁ బుట్టిన యారెండుకుక్కపిల్లలనే కాక మఱియు నెన్నో గ్రామములను భూషణములను ద్రుమఘునికి దయచేసెను. ఇట్లు ద్రుమఘుఁడు రాజుతో

సఖ్యము గలిగి యుండెను. మహాబలపరాక్రమములు గల యాయిద్దఱును నొక్కే శరీరముగా నుండిరి. ద్రుమసుఁడా కుక్కపిల్లలను దనయింటికిఁ దీసికొనిపోయి పెంచుచుండెను. తానేతినునో వానికిని నదే పెట్టుచుండెను. ఆరెండుపిల్లలకును జక్కనిప్రక్కలు సిద్ధముచేసి తనపరుండుచోటున వానిని బరుండఁ బెట్టుకొనుచుండెను. మఱియు నారెంటికిని పట్టువస్త్రములతోఁ గంచుకములు కుట్టించి తొడుగుచుండెను. మహాతపశ్శాలియగు నాతనిమేనమామ యజ్ఞశర్మ యనునతఁడు తనమేనల్లుడగుద్రుమసుఁడాచారహీనుఁడగుట దెలిసి కోపముతోఁ గూడినవాడై శూద్రికా! నీ విటుపయిని మాయింటికి రావలదని నిందించెను. ఇట్లు మేనమామ చెప్పఁగానే యాద్రుమసుఁడు బ్రాహ్మణవేషమును విడిచి శూద్రుఁడయిపోయెను. అదిమొదలతనికి శూద్రికుఁడనియే పేరు ప్రసిద్ధమయినది. ఆశూద్రికుఁడు శాలివాహనుని కుమారుఁడగు శక్తి మహారాజుతో నానాఁటికి స్నేహము వృద్ధి నొందించుకొనుచునే యుండెను. ఇట్లుండఁగానే పాళదేశాధీశ్వరుఁడును బౌద్ధమతస్థుఁడును నగుసుదారకుఁడను నతఁడు శక్తిరాజును సేవించుటకై పరిశాపురమునకు వచ్చెను. అతఁడు శూద్రికుని యింటికిఁ బోయి యతనిచే గౌరవింపఁబడి యతని కిట్లు శకునము చెప్పెను. శూద్రికా! నీవు శక్తిమహారాజునకుఁ బ్రియమిత్త్రుఁడవు గదా! ఇట్టి మీయిద్దఱకు నాలుమాసములలోఁగాఁ బ్రబలవిరోధము రాఁగలదు. అపుడు నీవు మావైజయంతీపురమునకు రమ్ము. నేను జెప్పిన ప్రశ్న యెన్నటికిని వ్యర్థముగాఁబోదు. అట్లు మీయిరువురకును విరోధము సంభవించునపుడు నీవు మఱియే యితర పట్టణమునకును బోక తప్పక మాపట్టణమునకే రమ్ము. అని యతఁడిట్లు చెప్పఁగానే శూద్రికుఁడు మంచిదేయనెను. తరువాత నా బౌద్ధుఁడు శూద్రికుని సమ్మతింపఁజేసి తనపురము చేరెను. మఱికొన్నాళ్ళకు శక్తిరాజు సైన్యముతోడను శూద్రికునితోడను వేటకై యడవికిఁ బోయి యందందుఁ దిరిగి యాయామృగములను బెక్కింటిని జంపి రాజు శూద్రికుఁడొకచోఁ గూడిరి. బలమంతయు వెనుకను జిక్కియుండఁగానే వారిద్దఱును మృగములను గొట్టుచు సంచరించుచుండిరి. తరువాతను మహాధ్వనిచేయుచు లొంగకయుండుసింహము నొకదానిని శూద్రికుఁడు



గత్తితోఁ గొట్టి పడవైచెను. అట్లు పడవైచి తనచేత నున్నకత్తితోఁ గ్రుచ్చి యెత్తి యాదరముగా రాజున కిచ్చెను. అంత నాశక్తి నూతపుత్రులను బిలిచి యాసింహమును దానే చంపినట్లు చాటింపుఁడని చెప్పి వారిని బురికిఁ బంపెను. పౌరులు తమరాజుపరాక్రమమునకు సంతోషించి పట్టణమంతయు నలంకరించి రాజున కెదురుగా వచ్చిరి. ఆరాజుభార్య కేశినియనునామె భర్త కెదురుగాఁ బోవనుద్యుక్తురాలై నగల నలంకరించుకొని పూవుల నిచ్చుదానికై యెదురు చూచుచుండఁగా నది వచ్చి యనేకవిధము లయినపూలదండల నామె కిచ్చినది. ఆలస్యముగా పువ్వులుదెచ్చి యిచ్చినందుకై యామె దానిని బెదరించుచు నిట్లనియె. ఓసీ! నేను వేగముగాఁ బూవులు దెచ్చి యిమ్మని వర్తమానము పంపినను నీ వింతసేపెచ్చట నుంటివి? సింహమును జంపి వచ్చుచున్న నాభర్త కెదురుగాఁ బోవలసిన సంగతి యెఱుఁగవా! అని కోపపరిపూర్ణురాలయి యున్నరాజమహిషిని జూచి పూవులిచ్చునది వేళాకోళముగా నిట్లనియె. అమ్మా! ఎందులకాతొందర? కొంచెము శాంతింపుము. నాకుఁ దెలియనిసంగతియే లేదు. నిజముగా నీభర్తయే సింహమును జంపినయెడల నేనెప్పుడునునీకు వెలపుచ్చుకొనకయే పుష్పములఁ దెచ్చియిచ్చుచుందును. అడవిలో జరిగిన సింహవధప్రకార మంతయునిజముగాఁ జెప్పెదనువినుము. శూద్రికుఁడాసింహమును జంపి కత్తిఁ గ్రుచ్చి నీభర్తచేతి కిచ్చెనఁట! నామగఁడు పూవులకై యడవికిఁ బోయి యావృత్తాంత మంతయు నా కాదరముతోఁ జెప్పియున్నాఁడు. కావుననే నేఁడింతయాలస్యముగా నేను బూవులు దేవలసి వచ్చినది. అని చెప్పి పువ్వులది తనయింటికిఁ బోయినది. అది చెప్పినమాటలు విని రాజుభార్య భర్త కెదురుగాఁ బోక స్నానమందిరమునకుఁ బోయినది. తరువాతను రాజు పౌరులచే నెదుర్కోఁబడియుఁ దన కెదురుగా భార్య రాకుంట కేమి హేతువని యాలోచించి భార్య నడిగెను. సింహము నొకఁడెవఁడో చంపఁగా నీవే చంపినట్లు ప్రగల్భములు చెప్పుకొనుచున్న నిన్నెదుర్కొనకున్న నేమి తే యని నిందాపూర్వకముగా బదులు చెప్పినది. భార్యమాటలు విని రాజు చాల సిగ్గుపడి వెంటనే శూద్రికుని బిలిపించి విచారణ చేయకుండనే యిట్లనియె. ఓరీ! శూద్రికా! కృతఘ్నా! నిన్ను నేను నిజ

ముగా మిత్త్రుఁడ వని నమ్మియుంటిని. నీకును నాభార్యకును నేదో
సంబంధము లేకపోలేదు. సింహమును సంహరించినసంగతి నీవే దాని
తోఁ జెప్పితివి. అట్లు నీవే చెప్పనిచో దాని కావృత్తాంత మంతయు
నెట్లు తెలియును? నిన్నటిదినము నీవు నాభార్యతో నీవృత్తాంత మం
తయుఁ జెప్పి నన్నందఱిలోను సిగ్గుపుచ్చితివి. దీనిని బట్టి చూడఁగా
మీ యిద్దఱకును దప్పకుండ సంబంధ మున్న దని తేటపడుచున్నది.
నిన్ను నేను స్నేహితుఁడ వని తలంచుచున్నాఁడను గనుక నిన్నుఁ జంప
రాదు. కావున వెంటనే నాపురమునుండి పొమ్ము. అని చెప్పి తనకింక
రులచే నిర్ఘోషుఁ డగు శూద్రికుని గెంటించెను. మహాశూరుఁ డగు నా
శూద్రికుఁడు కోపపూర్ణుఁడయి వైజయంతీపురమునకుఁ బోయెను. సు
దారకమహారా జతని బ్రీతిపూర్వకముగా నెదుర్కొని గౌరవించెను. శక్తి
రాజు తనకుఁ జేసిన యవమానమును స్మరించుకొనుచు సుదారకునితో
నాలోచించి చతురంగబలమును వెంటఁబెట్టుకొని శక్తిరాజుతో యుద్ధ
ముచేయుటకై వచ్చి యాతని పట్టణమును ముట్టడించెను. తరువాతను
శక్తిరాజు మంత్రులతో నాలోచించి శూద్రికునితో యుద్ధముచేయఁ
దగిన శక్తిలేనివాఁడై మిక్కిలి బుద్ధిమంతుఁ డగుకాలసేనుఁ డనుమంత్రిని
బిలిపించెను. అతఁడును జతురంగబలముతో పరిత్రాణపురమునకు వచ్చె
ను. కాలసేనునిరాక విని శూద్రికుఁడు భయపడినవాఁడై సుదారకునితో
నిట్లాలోచించెను. మనము మహాబలశాలి యగు కాలసేనునితో నెట్లు
యుద్ధము చేయఁగలము? పుత్త్రులతోఁ గూడివచ్చిన కాలసేనుని
మన మెట్లెదిరింపఁజాలుదుము? అని యిట్లాలోచించు చుండఁగా నపు
డాకాశవాణి యిట్లనియె. మీరు కాలసేనునకు భయపడ నవసరము
లేదు. నామాట వినుఁడు. సహ్యపర్వతముపైని పంచపుటుఁ డను బొ
గుఁడు గలఁడు. అతఁడు బలవంతుఁడు, మాంత్రికుఁడు, మాయావియు
ను గనుకఁ గాలసేనుని జయించును. మీరు వెంటనే యతనియొద్దకుఁ
బోయి తీసికొనిరండు. మీకుఁ దప్పక యతనివలన జయము గలుగును.
అను నాకాశవాణిపలుకులు విని శూద్రికుఁడు సంతోషపూర్ణుఁ డయి
వెంటనే సహ్యపర్వతమునకుఁ బోయి వినయముగా నతనిని బ్రతిమాలి
యతనితోఁ గూడ పరిత్రాణపట్టణమునకు వచ్చెను. తరువాతను మా



యావియగు పంచపుటుఁడు కాలసేనునికి శివుఁ డిచ్చినయాయుధములను
రాత్రి యపహరించెను. అందువలన శూద్రికాదు లందఱును సం
తోషించిరి. తరువాతను శక్తికిని శూద్రికునకును యుద్ధము జరిగి
నది. కాలసేనుఁడును పంచపుటుఁడును యుద్ధము చేయుచుండిరి.
రూపసేనుఁడును సుదారకుఁడును మఱియొకచో యుద్ధమ్ము చేయు
చుండిరి. ఇట్లాయాఱుగురకును ఘోరముగా యుద్ధము జరిగినది. జ
యమును గోరుచుండు యోధులు పెక్కుమంది చచ్చిరి. దివ్యాయుధము
లన్నియుఁ బోవుటచేఁ గాళసేనుఁడు విక్రమించి పంచపుటునితో యుద్ధము
చేసిచేసి యనేకులను జంపి తుదకు యుద్ధములో శరీరమును విడిచె
ను. అతనికుమారుఁడు రూపసేనుఁడు శోకక్రోధములతోఁ గూడి
నవాఁడై పంచపుటు నెదుర్కొని యిట్లనియె. ఓరీ! దురాత్మా! దొంగత
నముచేతనఁటరా యుద్ధములో జయముపొందుట! మాతండ్రియగు కా
ళసేనునియాయుధముల నన్నింటిని నీ వపహరించితివి. ఇఁక నెక్కడికి
రాఁ బోఁగలవు? నాచేతఁ జిక్కితివే. క్షణమాత్రము నాయెదుట నిలువఁ
బడుము. పిడుగులవంటి నాబాణములచే నీమర్మస్థానములను భేదించి
యిప్పుడే నిన్ను యమపట్టణమునకుఁ బంపించెదను జూడుము. అని యి
ట్లు రూపసేనుఁడు చెప్పఁగానే పంచపుటుఁడు కోపించి యాతనిపై బా
ణవర్షము గురిపించెను. రూపసేనుఁ డాబాణములచే నాచ్ఛాదింపఁబడిన
వాఁడై క్షణమాత్రముననే యాబాణముల నన్నింటిని వారించి పంచ
పుటుని విరథునిజేసి వాఁడియగు బాణములచేఁ గుండలములతోఁగూడ
నాబొదునిశిరమును శరీరమునుండి క్రిందఁబడవైచెను. ఇట్లు రూపసేనుఁ
డు తనతండ్రిని జంపిన పంచపుటుని జంపి వానిసేనను బరువెత్తించెను.
శూద్రికుఁడు శక్తినిజంపి యతనిసైన్యమును బరువెత్తించెను. ఇట్లు
శూద్రికుఁడు శక్తిని జంపి యతనికుమారుని చిత్త్రవర్మయనువానిని త
దాసనమం దభిషిక్తునిజేసి రూపసేనుని కప్పగించి వైజయంతీపురమున
కుఁ బోయెను. రూపసేనుఁడు చిత్రకర్మునికోట కాపరిత్రాణపురములోనే
యుండి కొన్నాళ్ళు గడచినవెనుకఁ ధనయామోదపురమునకుఁ బోయె
ను. తరువాత నతఁడు పైతృకమగు సింహాసన మధిష్ఠించి తమ్ములతోఁ
గూడ ధర్మముగా రాజ్య మేలుచుండెను. దేవాంగునివంశమువారగు

78

కాళసేనునికుమారులు సముద్రతరంగములవలె వృద్ధి నొందుచుండిరి. ఋషులచే సంస్కరింపఁబడిన యాకాళసేనుని కొడుకుల గోత్రములు మొదట నూటరెండుగా లెక్కపెట్టఁబడినవి. తరువాత నవి క్రమముగాఁ బదునేనువంద లయినవి. మూఁడులక్షల యేఁబదివేల యిండ్లవారగు నీ కాళసేనునివలన జన్మించిన దేవాంగవంశమువారిలో నారదోపదేశము ను బొందినవారు వైష్ణవులును దక్కినవారు పరిశుద్ధులగు శైవులును నయి యుందురు. మునిపుంగవులారా ! పవిత్రమును, పాపనాశక మును నగు దేవాంగునిచరిత్ర మంతయు మీకుఁ జెప్పితిని. ఎవరు దీనిని జదువుదురో, యితరులకు వినిపింతురో తాము విందురో వా రికి సర్వకార్యములును సిద్ధించును. మఱియు దీర్ఘాయురారోగ్య పుత్రపౌత్ర ధనకనకవస్తువాహనసమృద్ధి గలిగి యుందురు. ఈదే వాంగచరిత్రను ముందుగాఁ బారాణికు నర్చించి మఱియు వినవలయును. అట్టివారికి మహాదేవునియనుగ్రహమువలన నెల్లమనోరథములును నీడే రును. ఈదేవాంగచరిత్రపుస్తకమునకుఁ బట్టుదారము నిచ్చువారు నిర్మ లమయిన జ్ఞానము గలిగి బ్రహ్మలోకములోఁ బూజింపఁ బడుచుందురు. పరిశుద్ధమయిన యీదేవాంగమహాచరిత్రమును వినువారు పార్వతి యనుగ్రహమునకుఁ బాత్రులయి తమతమకోరికలను బొందుచుందురు. అని యిట్లు వ్యాసశిష్యుఁడగు సూతుఁడు చెప్పిన బ్రహ్మాండపురాణోత్తర ఖండములోని దేవలమహాని వృత్తమును పుణ్యప్రదమయినదానిని విని శౌనకాదిమునీంద్రు లందఱును బరమానందమును బొందిరి.

శా. శ్రీదేవీచరణాబ్జభృంగ మయి సుశ్రీ మీఱఁగా నెంతయు
నైవద్యమ్మును గాంచి మించిన పు. సూ. నా. తీర్థులన్వానిచే
నీదేవాంగచరిత్ర మీపగిది వ్రాయింపించి ముద్రించెఁ దా
నాదేవాంగకులోద్భవుండు తులసింగాఖ్యుండు ప్రఖ్యాతిగన్.

ఇట్లు శ్రీబ్రహ్మాండపురాణములోని దేవాంగచరితమున సూతశౌనకాది
సంవాదరూప మయినదాన దేవాంగవంశకథన మన్నది
యిరువదితొమ్మిదవయధ్యాయము.

దేవాంగపురాణము సమాప్తము.

ముగా మిత్త్రుఁడ వని నమ్మియుంటిని. నీకును నాభార్యకును నేదో సంబంధము లేకపోలేదు. సింహమును సంహరించినసంగతి నీవే దాని తోఁ జెప్పితివి. అట్లు నీవే చెప్పనిచో దాని కావృత్తాంత మంతయు నెట్లు తెలియును? నిన్నటిదినము నీవు నాభార్యతో నీవృత్తాంత మంతయుఁ జెప్పి నన్నందఱిలోను సిగ్గుపుచ్చితివి. దీనిని బట్టి చూడఁగా మీ యిద్దఱకును దప్పకుండ సంబంధ మున్నదని తేటపడుచున్నది. నిన్ను నేను స్నేహితుఁడ వని తలంచుచున్నాఁడను గనుక నిన్నుఁ జంప రాదు. కావున వెంటనే నాపురమునుండి పొమ్ము. అని చెప్పి తనకింక రులచే నిర్ఘోషుఁ డగు శూద్రకుని గెంటించెను. మహాశూరుఁ డగు నా శూద్రకుఁడు కోపపూర్ణుఁడయి వైజయంతీపురమునకుఁ బోయెను. సు దారకమహారాజతని బ్రీతిపూర్వకముగా నెదుర్కొని గౌరవించెను. శక్తి రాజు తనకుఁ జేసిన యవమానమును స్మరించుకొనుచు సుదారకునితో నాలోచించి చతురంగబలమును వెంటఁబెట్టుకొని శక్తిరాజుతో యుద్ధ ముచేయుటకై వచ్చి యాతని పట్టణమును ముట్టడించెను. తరువాతను శక్తిరాజు మంత్రులతో నాలోచించి శూద్రకునితో యుద్ధముచేయఁ దగిన శక్తిలేనివాఁడై మిక్కిలి బుద్ధిమంతుఁ డగుకాలసేనుఁ డనుమంత్రిని బిలిపించెను. అతఁడును జతురంగబలముతో పరిత్రాణపురమునకు వచ్చె ను. కాలసేనునిరాక విని శూద్రకుఁడు భయపడినవాఁడై సుదారకునితో నిట్లాలోచించెను. మనము మహాబలశాలి యగు కాలసేనునితో నెట్లు యుద్ధము చేయఁగలము? పుత్త్రులతోఁ గూడివచ్చిన కాలసేనుని మన మెట్లెదిరింపఁజాలుదుము? అని యిట్లాలోచించు చుండఁగా నపు డాకాశవాణి యిట్లనియె. మీరు కాలసేనునకు భయపడ నవసరము లేదు. నామాట వినుఁడు. సహ్యపర్వతముపైని పంచపుటుఁ డను బౌ ద్ధుఁడు గలఁడు. అతఁడు బలవంతుఁడు, మాంత్రికుఁడు, మాయావియు ను గనుకఁ గాలసేనుని జయించును. మీరు వెంటనే యతనియొద్దకుఁ బోయి తీసికొనిరండు. మీకుఁ దప్పక యతనివలన జయము గలుగును. అను నాకాశవాణిపలుకులు విని శూద్రకుఁడు సంతోషపూర్ణుఁ డయి వెంటనే సహ్యపర్వతమునకుఁ బోయి వినయముగా నతనిని బ్రతిమాలి యతనితోఁ గూడ పరిత్రాణపట్టణమునకు వచ్చెను. తరువాతను మా